Acc No. 31040

# లీలా కథామాలిక

* కథాసంపుటి *

# LEELA KATHAMALIKA



లీలాకథామాలిక (కథల సంపుటి)

ప్రథమ ముద్రణ : 1999
వెల : 70/-
అన్నిహక్కులు : రచయితవి

ACC.No-31040

ప్రతులకు :

1. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435
బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500001

2. నవోదయ బుక్ హౌస్
3-3-865
ఆర్యసమాజ్ మందిర్‌కు ఎదురుగ
కాచిగూడ
హైదరాబాదు-500027

ముద్రణ : తేజ ప్రింటర్స్,
ఉమెన్స్ కాలేజీరోడ్, రాజమండ్రి.

కవర్ పేజీ ఫోటో : పి హెచ్.డి. నాటి రచయిత్రి

బ్లాక్ మేకింగ్ : తేజ ప్రోసెస్

ముఖపత్ర ముద్రణ:జాలీ ప్రింటర్స్ రాజమండ్రి

3 పి భారతి, M. A.,
C/o డా॥ పొన్నా లీలావతి M.A., Ph.D.
సీనియర్ అసిస్టెంట్ ప్రొఫెసర్
దేశిసాహిత్య శాఖాధిపతి
పొ. శ్రీ. తెలుగు విశ్వవిద్యాలయం
రాజమండ్రి ప్రాంగణం
బొమ్మూరు–533 124
తూ॥ గో॥ జిల్లా.
ఫోన్స్–ఆఫీస్-471499
రెసిడెన్స్--466618

# అంకితం



దుష్ట శిక్షణకు శిష్ట రక్షణకు
ధర్మసంస్థాపనకు అవతరించిన బాలగోపాలా
మురళీకృష్ణ లోకపాలా॥
నీ లీలలన్ని చిత్రాతిచిత్రములు
తెలియ వశమా తామసులకు
సకల విదితమూ తాపసులకు
దేవకీబాల యశోద మురిపాలా
వసుదేవ కుమారా నందకిశోరా॥
ప్రళయకాలమందున పదునాల్గు భువనాలను
ఉదరాన దాచుకొని కాపాడు దైవమా
సామగానలోలా సువర్ణ రమ్యచేలా
విశ్వరూప హేలా! ఉపేక్షింతువేలా
విమల చరితా! కమల వినుతా! చేకొనుమా కథామాలికను
లీలాకథామాలికను॥

# హృదయరాగం

చిన్నప్పటినుంచీ కూడా నాకు పద్యాలు. పాటలు, సంస్కృత శ్లోకాలు అంటే చాలా ఇష్టం. ఇంట్లో మా పెద్దలైన తాత, నాన్న వాళ్ళు ఎప్పుడూ సంగీత సాహిత్య వ్యాపకాలతోనే కాలం గడుపుతూ నాకుకూడా నేర్పించే వారు జీవనవృత్తి వ్యవసాయమైనా వారి ప్రవృత్తి మాత్రం సంగీత సంగీత సాహిత్య నాటకాది కళలు. నన్ను బాల్యంనుంచీ చదువులవైపే నడిపించారు. వాళ్ళు కథలు చెప్పడంగానీ, నేను వినడంగానీ అంతగా జరగలేదు. తాత ఎప్పుడో రామాయణ భారత భాగవత గ్రంథాల్లోని కథల్ని, అమ్మ ఎప్పుడో జానపద కథల్ని కొన్ని చెప్పినట్లు, నేను విన్నట్లు గుర్తు అంతేకాని కథలు వినడంపై నాకు చిన్నప్పటినుంచీ ఆసక్తిలేదు.

వయసు ఒక సంవత్సరం ఎక్కువవేసి నాలుగు సంవత్సరాలప్పుడు ఒకటవ తరగతిలో చేర్పించినప్పటినుంచీ ఎం. ఎ, పూర్తి అయ్యేవరకు, ఆపైన చాలాకాలం వరకు కూడా నేను కథలజోలికి పోలేదు. నేను హై స్కూల్‌లో చదివేటప్పుడు నా క్లాస్‌మేట్స్ అందరూ గుంపులు గుంపులుగా కూర్చొని వింతకథలు, సినిమాకథలు చెప్పుకుంటూ కాలక్షేపం చేసేవారు. నాకు అలా కాలక్షేపం చేయడం నచ్చక క్లాస్‌లోనే కూర్చొని టీచర్లు చెప్పిన పాఠాల్ని కూడా శ్రద్ధగా చదువుకునేదాన్ని. మా ఇంట్లో పెద్దలు కూడా సినిమాలు చూడటం, కథల పుస్తకాల్ని చదవడం, బయట పిక్‌నిక్‌లు, సరదాలు వంటి వాటిని నిషేధించారు. నేనూ ఆ ప్రకారంగానే ఏకాగ్ర నిష్ఠతో చదువుకున్నాను

డిగ్రీ చదివే రోజుల్లో చాలామంది అమ్మాయిలు క్లాసులో వెనక బెంచీల్లో కూర్చొని కథల పుస్తకాలు చదువుకుంటూ ఉంటే నాకు చాలా ఆశ్చర్యం కలిగేది.

ఆరోజుల్లో కథల్ని కాలక్షేపంకోసం, ఆనందంకోసం, బాధల్ని మరచి

పోవడంకోసం చదివేవారు. కాలక్రమంలో కథలు ఒక సాహిత్య ప్రక్రియగా రూపుదిద్దుకొని విద్యాసంస్థల్లో పాఠ్యాంశాలుగా, పరిశోధనాంశాలుగా నిర్ణయించబడ్డాయి.

వంద సంవత్సరాల చరిత్రకల్గిన కథాప్రక్రియా వికాసానికి ఎందరో రచయితలు దోహదం చేశారు. అంతర్జాతీయ స్థాయిలో తెలుగు కథకు ఎంతో ప్రాముఖ్యం కలిగింది. పత్రికల్లో మిగతా సాహిత్య ప్రక్రియలకు లేని స్థానం కథాప్రక్రియకే లభించింది. పెద్దపెద్ద నవలలకన్నా, వర్ణనాత్మకమైన వచన కవితలకన్నా కథల్ని చదవడానికే పాఠకులు ఇష్టపడుతున్నారు.

ప్రతి సాహిత్య ప్రక్రియ ఉద్దేశం లోకశ్రేయస్సే అయినా వాటివాటి పరిధులు, ప్రవృత్తులు వేరువేరుగా ఉంటాయి. వచన కవిత్వంలో ఒక సంఘటనను, ఒక భావాన్ని, ఒక అనుభూతిని, ఒక ప్రబోధాన్ని కొంత వరకే కవి చెప్పగలుగుతాడు. గేయంలోను అంతే జరుగుతుంది. లేదంటే అందులో సంగీతం జోడై వినడానికింపును, మనసుకు అహ్లాదాన్ని కలిగిస్తుంది. నవలలో విస్తృతమైన ఇతివృత్తం, అనేక పాత్రలు, బహు సన్నివేశాలు, సంఘర్షణలు చోటుచేసుకుంటాయి. పాఠకుడికి తీరిక, ఓపిక ఎక్కువగా ఉండాలి.

కథలో అయితే నాతి దీర్ఘం, నాతి స్వల్పం కాకుండా పరిమిత ఇతివృత్తం, పరిమిత పాత్రలు, సన్నివేశాలు ఉండి స్పష్టమైన అవగాహన కలుగుతుంది. నిర్దిష్టమైన సందేశం, అనుభూతి పాఠకుడికి అందుతుంది. అందువల్ల కథలుకూడా వ్రాయాలనిపించి అప్పుడప్పుడూ వ్రాశాను ఈ కథలన్నీ వివిధ పత్రికల్లో ముద్రితమైనవే. ఈ కథలన్నింటిని కలిపి ఒక పుస్తకరూపంలో అందిస్తే ఇంకా ప్రయోజనకరంగా ఉంటుందని భావించాను. ఈ కథలన్నీ చాలావరకు నా జీవితానుభవాలకు సంబంధించినవే. కొన్ని కథలు ఇరుగుపొరుగువారి అనుభవాల స్పందనలతో, పత్రికల్లోని విషాద సంఘటనల స్పందనలతో వ్రాసినవి.

నేను కవిత్వం వ్రాస్తానని, గేయాలు వ్రాస్తానని, కథలు వ్రాస్తానని కలలోకూడా అనుకోలేదు. వాటికి దేశదేశాంతరాలనుంచి ప్రతిస్పందనలు, ప్రశంసలు వస్తాయని ఊహించలేదు. నా జీవితం, నాచుట్టూ ఉన్న సమాజం, నా కుటుంబం నాచేత వ్రాయించక వదలలేదు కరుణ కమలం, ప్రేమదీపం కవితా సంపుటుల్లో, లీలాగీతమాలికలో ప్రత్యక్షంగా వ్యక్తం చేయడానికి వీలుపడని ఎన్నో అనుభవాల్ని, వేదనల్ని. సందేశాల్ని లీలా కథామాలికలో ఆయా పాత్రల ద్వారా పరోక్షంగా వ్యక్తం చేశాను.

నేను ఎం ఎ. వరకు తల్లిదండ్రుల సంపాదనపై ఆధారపడి చదువుకున్నాను. ఒక విద్యార్థికి కావలసిన పుస్తకాలు తీసివ్వడం, ఫీజులు కట్టేయడంతోనె పెద్దల బాధ్యత సరిపోదు మనుషులుగా, నాగరిక మనుషులుగా సాటి వాళ్ళలో సంతోషంగా తలెత్తుకుని మెలగాలంటే పెద్దగా ఆడంబరాలు లేకపోయినా తగినంత వరకైనా పెద్దలు అమర్చిపెట్టాలి. తరతరాలుగా ఎంతోమంది ఆర్తులకు, అనాథలకు, బంధుజనులకు ఆశ్రయమిచ్చి చదువులు చెప్పించి తీర్చిదిద్ది ప్రయోజకుల్ని చేసి శుభకార్యాలు, కర్మ కార్యాలు అన్నీ చేసిన పెద్దలు తమ స్వంత కన్నబిడ్డల దగ్గరకు వచ్చేసరికి అలసిపోయి అత్యవసరమైన కనీస వసతుల్ని, కనీస వస్తువుల్ని కూడా అమర్చలేక పోవడాన్ని "కర్మ" అని సరిపెట్టుకోలేకపోతే కోలుకోవడం కష్టమవుతుంది.

నేను ఊహ తెలిసినప్పటినుంచీ పడిన కష్టాలు, ఎదుర్కొన్న సమస్యలు, కార్చిన కన్నీళ్ళు నా తర్వాతి ఐదుమంది తోపుట్టువులకు రాకూడదని ఎనిమిదేండ్ల బాల్యంలోనే ధృఢంగా నిర్ణయించుకున్నాను వాటి ఛాయలుకూడా పడకుండా అడ్డుగా నిలిచి కాపాడుకోవాలనుకున్నాను. తల్లిదండ్రుల, పూర్వవంశీయులతో పుట్టువుల ధ్యాసతోనే పెరిగాను. శ్రద్ధగా చదువుకున్నాను. దైవానుగ్రహంవల్ల నాకు అన్నమాచార్య స్కాలర్‌షిప్ వచ్చింది. ఆనాటినుంచీ ఒక చిన్న పల్లెలోని మా రైతుకుటుంబాన్ని క్రమక్రమంగా నాగరిక మార్గంలో అభివృద్ధి దిశగా నడిపించాను పి. హెచ్ డి, పూర్తి కావడంతోపాటు ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్‌ద్వారా జూనియర్ లెక్చరర్‌గా కూడా దైవానుగ్రహంవల్ల సెలెక్ట్ అయ్యాను. దాని

కోసం ఎదురుచూస్తూ ఉండగా గోరంత కోరితే కొండంత ఈ ఉద్యోగాన్ని భగవంతుడు ప్రసాదించాడు, ఇది అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుల చలువ మాత్రమే.

ఈ ఉద్యోగం రావడంతో పెద్దలకు, పిల్లల చదువులకు, వసతులకు, వైద్యాలకు, డ్రస్సులకు, అలంకరణలకు, పిక్నిక్‌లకు, సినిమాలకు, సరదాలకు దేనికీ లోటులేకుండా సాటివాళ్ళలో అందరికన్నా మిన్నగా అమర్చి పెట్టాను. ఇలా చేయడంవల్ల భౌతికావసరాల చింతలు లేకుండా హాయిగా చదువుకొని ప్రయోజకులవుతారని విశ్వసించాను.

కలికాలప్రభావమో, నాకర్మమో, వాళ్ల కర్మమోఏమోగాని విశ్వసించిన రీతిలో కొందరిలో సత్ఫలితాలు కనిపించక పోగా వ్యతిరిక్త ధోరణులు పొడచూపాయి. వారి ఆలోచనలు అభివృద్ధిమార్గానికి వక్రగతిలో సాగాయి. ఈ దుస్థితి నా ఆశయాన్ని, మనశ్శాంతిని దెబ్బతీసి క్రుంగదీసింది.

అందరూ ఒకేచోట లేకపోవడం, బాధ్యతల్ని, వెనుకటి కష్టాల్ని మరచిపోవడం, కర్తవ్యంపై తదేకదృష్టి లేకపోవడం, సంపాదించి పోషించే మనిషి పడేబాధల్ని గుర్తించకపోవడం, అపోహలకు, అపార్థాలకు, అసూయాద్వేషాలకు లోనుకావడం, ఓర్వలేని మనుషుల దుర్బోధల ప్రభావాలకు లోనుకావడం, మంచీచెడుల మధ్య తేడా తెలుసుకోకపోవడం, దృఢవ్యక్తిత్వం లేకపోవడం మొదలైనవి కారణమయ్యాయి.

"ఇంట గెలిచి రచ్చగెలవాలి" అంటారు పెద్దలు "విద్యావంతులైన ప్రతి యువతీయువకులు సంస్కరణను ముందుగా తమతమ కుటుంబాల్ని చక్కబెట్టడం నుంచి ప్రారంభించాలి" అంటాడు కందుకూరి వీరేశలింగం పంతులు. అవిధంగా బయటవాళ్ళకు నా జీవితానుభవాల్ని, నీతుల్ని, బుద్ధిజ్ఞానాల్ని చెప్పి స్ఫూర్తి, చైతన్యం కలిగించడంకన్నా ముందుగా నావాళ్ళకు బోధించి తీర్చిదిద్దడం ముఖ్యమని భావించాను ఆ తర్వాతే ఇతరులకు చెప్పడానికి అర్హత, యోగ్యత లభిస్తుంది.

ఈ దేశంలో, ఈలోకంలో కోట్లాదిమందికి మంచి తిండీ, బట్ట, వసతి, విద్య, వైద్య, విందులు, విలాసాలు వంటి సుఖాలు లభించటంలేదు. అలాంటిది మనకు లభిస్తున్నప్పుడు వాటిని సద్వినియోగం చేసుకొని మంచి పనులు చేయాలి. ఇంటా, బయటా, పిన్నలపట్ల, పెద్దలపట్ల, తీర్చిదిద్ది ప్రయోజకుల్ని చేసిన మహనీయుల పట్ల బాధ్యతాయుతంగా నడచుకోవాలి. మానాభిమానాలతో, కర్తవ్యం చేస్తూ శక్తిమేరకు ఘనకార్యాలుచేసి మన ఉనికిని, సామర్థ్యాన్ని నిరూపించుకోవాలి. ఎందరో త్యాగమూర్తుల త్యాగ ఫల్ని మనం అనుభవిస్తున్నప్పుడు మనమూ అలాంటి త్యాగాలు చేయాలి. సమస్యల్ని తెచ్చిపెట్టే చెడుసాంగత్యాలకు, సమైక్యతల్ని చెడ గొట్టే స్నేహరూపశత్రువులకు, కుటుంబ అనుబంధాల్ని చెరిచే కుత్సితు లకు దూరంగా ఉంటూ దృఢవ్యక్తిత్వంతో నిలబడాలి. నిజాయితీ, దయ, కృతజ్ఞతవంటి సుగుణాల్ని అలవరచుకోవాలి కుటుంబానికీ, దేశానికి సత్కీర్తిని సంపాదించిపెట్టాలి అనే నా భావజాలాన్ని సందేశాన్ని, చైత న్యాన్ని చాల పాత్రల ద్వారా చెప్పించాను ఈ కథలు చదువుతుంటే నాకుకూడా ఎంతో అనుభూతి కలుగుతుంటుంది. వెనకటి జీవితాన్ని పున రాలోచన చేసుకొని నూతనోత్సాహాన్ని, స్ఫూర్తిని పొందుతున్నట్లు అనిపి స్తుంది. అలాగే మావాళ్ళకు, మాలాంటి మనసులు, అనుభవాలున్న పాఠక లోకానికి, జిజ్ఞాసువులైన సహృదయ పాఠకబృందానికి కూడా హృదయ స్పందనలు, సదాలోచనలు కలుగుతాయని మంచి మార్పులువస్తాయని విశ్వసిస్తున్నాను మామూలుమాటలకన్నా కథలు మనసుల్ని ఆకట్టుకుని ఆలోచింప చేస్తాయని నా నమ్మకం.

నా కథామాలికకు 'పొన్నలూ, పొగడలూ' అంటూ ఆప్యాయతగా అభిప్రాయం వ్రాసిపంపిన రాష్ట్రీయదే శీయ అంతర్జాతీయ కథారచయిత, బహుమతుల గ్రహీత డివిజనల్ అకౌంట్స్ వర్క్స్ అఫీసర్ శ్రీ కె బి కృష్ణ గారికి, అలాగే ప్రేమగా 'అభినందన' వ్రాసిచ్చిన మాతృవాత్సల్య హృద యిని, సంగీతవిద్వన్మణీ, పద్మశ్రీ, పద్మవిభూషణులు, సంగీతసుధాకరులు అయిన డా మంగళంపల్లి బాలమురళీకృష్ణగారి ప్రియశిష్యురాలు, వారి మేనమామ కూతురు సుమధుర గాయనీమణి, రేడియోఆర్టిస్ట్, రిటైర్డ్ మ్యూ జిక్ టీచర్ శ్రీమతి ప్రయాగ లక్ష్మీకాంతమ్మగారికి,

పరిపాలనా కార్యకలాపాల్లో, సాహితీ కార్యక్రమాల్లో కఋంతిరిక లేక పోయిన ఎంతో వాత్సల్యంతో ప్రోత్సాహకరంగా తమ అమూల్యమైన అభి ప్రాయం అందించిన పా. శ్రీ. తె వి వి. ఉపాధ్యక్షులు, ప్రఖ్యాత కవిపండిత పరిశోధకులు డా. ఎన్. గోపిగారికి,

ఎంతో ఆత్మీయంగా తమ హృదయస్పందనను అందించిన సంగీత సాహిత్యాభిలాషిణులు సహృదయినీమణులు కుమారి నడిమింటి ఛాయాపద్మిని రిటైర్డ్ హెడ్‌మిస్ట్రెస్, కుమారి నడిమింటి విజయలక్ష్మి టీచర్ (విజయనగరం) గార్లకు,

ఆర్ద్రతతో తమ హృదయ స్పందన తెలిపిన, వైద్య సేవలో, గానకళారాధనలో నిత్యం పునీతులవుతున్న 'అభినవ ఘంటసాల' డాక్టర్ కె. వి. వి. సత్యనారాయణగారికి,

ఈ కథామాలికను ఎంతో శ్రద్ధాసక్తులతో సకాలానికి ముద్రించిఇచ్చిన తేజ ప్రింటర్స్ యజమాని శ్రీ తాతబ్బాయిగారికి, బ్లాక్ మేకింగ్ తేజ ప్రోసెస్ వారికి, కవర్ పేజీల ముద్రణగావించిన జాలీ ప్రింటర్స్ శ్రీ హనుమంతరావు గారికి,

నాకు సహకరించి ప్రోత్సహించే మాఇంటి పిల్లలకు, పెద్దలకు నా రచనల్ని అమితానందంతో చదువుతూ ప్రతిస్పందిస్తూ నన్ను ప్రోత్సహించే సహృదయ పాఠకోత్తములకు,

నన్ను అనుక్షణం అంటిపెట్టుకొని ఉంటూ దుష్టుల బారినుంచి తప్పిస్తూ కాపాడుతుంటే అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుల పాదపద్మాలకు,

అందరికీ నాహృదయ రాగాన్ని వినిపిస్తూ కృతజ్ఞతా కుసుమాల్ని సమర్పిస్తున్నాను.

—పొన్నా లీలావతి

Prof. N. Gopi
M A, Ph.D.
VICE-CHANCELLOR
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఫోన్స్ : ఆఫీస్. 040-234815
లలిత కళాక్షేత్రం, 040-236911
పబ్లిక్ గార్డెన్స్, రెసిడెన్స్ · 040-7037585
హైదరాబాదు-500 004. (ఎ.పి.) ఫాక్స్ : 040-23. 045

తేది; 12-8-1999

# అభినందన

అధ్యాపక వృత్తిలో ఉంటూ రచనా వ్యాసంగంలో తమదైన ప్రత్యేక తను నిలుపుకొని కీర్తినార్జించినవారు తెలుగు సాహిత్యంలో ఎందరో వున్నారు. బోధన, పరిశోధన, గేయ, కవిత, వ్యాసరచనల్లో తమదైన ప్రత్యేక ముద్రను స్థాపించుకుంటున్న డాక్టర్ పాన్నా లీలావతి గారు కథారచనలో కూడా ప్రవే శించారు 'లీలాకథామాలిక' కథా సంపుటిలోని కథలన్నీ భవిష్యత్తు మీద ఆశ, అనాదిగా స్త్రీలు పడుతున్న ఇబ్బందులు, పురుషాధిక్యం ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఈనాటి స్త్రీవాదధోరణి అంతర్లీనంగా ఈకథల్లో గమనించవచ్చు.

సంసారంలో భార్యాభర్తల మధ్య నమ్మకం, విశ్వాసం కలిగి ఉండా లనీ, అపుడే దాంపత్యజీవితంలో అపారమైన అమృతానందం పొంగిపొరలు తుందని 'పాదపల్లవం' కథ చెబుతుంది. 'అనసూయ' కథలో పల్లెటూరి వా తావరణాన్ని, అక్కడి సామాజిక పరిస్థితిని చిత్రించిన తీరు బాగుంది. అన సూయ శీనయ్యకుచేసిన సేవఉదాత్తమైంది మానవత్వపువిలువలు మెండుగా ఉన్న కథ ఇది. పెద్దవాళ్ళు సాధించిన విజయాలు, చేసిన గొప్ప పనులు వారి వంశస్థులపైఎంతో కొంత ప్రభావాన్ని తప్పకచూపుతాయి. పెద్దవాళ్ళపై పిల్లలకుగల అభిమానం, మమకారం, పెద్దలు పిల్లల్ని ప్రేమించేతీరు 'అను బంధం' ఆవిష్కరించింది. మూఢనమ్మకాలతో ఆరోగ్యాన్ని పాడుచేసుకోవ డంలాంటి విషయాలు 'పట్టుదల' కథ చెప్పుతుంది.

చదువు ఒక్కటే మనకు సంతోషాన్నిస్తుంది. జీవితానికి వెలుగును, విలువను ఇస్తుంది. ఈ మోసాల కలికాలంలో చదువే మనకు తోడూనీడా అవుతుందనీ, చదువు గొప్పతనాన్ని ప్రాముఖ్యాన్ని తెలియజేస్తుంది 'మౌనిక'.

'విద్యార్థి'యైన, గురువైన వారి వారి విధ్యుక్తధర్మాల్ని అంకితభావంతో, చిత్తశుద్ధితో నెరవేర్చాలి. అపుడే వారికి సార్ధకత, సమాజానికి ప్రయోజనం కలుగుతుంది. పాఠశాలలో 'సిసింద్రీ చతుష్టయం' అల్లరి; రచయిత్రి జీవితంలో ఏర్పరచుకున్న నిశ్చితాభిప్రాయానికి అద్దం పట్టింది 'సుమధుర'. స్త్రీ వ్యక్తిత్వానికి నిలువుటద్దంగా నిలిచాయి "సౌజన్యం", "స్ఫటికం" కథలు.

కథలు ఎక్కువ భాగం రచయిత్రి స్వగ్రామం ఆధారంగా అల్లబడటం చేత గ్రామీణ వాతావరణం, కల్లాకపటం ఎరుగని పల్లెవాసుల మనస్తత్వం, ఆత్మీయత కనిపిస్తాయి. రాయలసీమ మాండలికం అక్కడక్కడా కనిపిస్తుంది.

నేటి సమాజంలోని విషయాలను పాత్రలుగా మలచడంవలన కథలు వాస్తవికతకు దగ్గరగ వచ్చాయి. రచయిత్రి కథాసాహిత్యం హృద్యంగమం, వృత్తి అధ్యాపకం, ప్రవృత్తి సాహితీ వ్యాసంగం కాబట్టి ఈమె రచనల్లో సరళత, ప్రసన్నతా గుణగణాలు కలిగి ఉన్నాయి. ఊపిరిసలపని పనుల్లో వున్నా మా విశ్వవిద్యాలయం అధ్యాపిక కాబట్టి రెండుమాటలు రాయాలని నేనీ కథలు చదివాను. డాక్టర్ పొన్నా లీలావతి తొలి కథాసంపుటియైన "లీలాకథామాలిక" పాఠకాదరణ పొందాలనీ, మరిన్ని మంచి రచనలు వీరి కలం నుంచి జాలువారాలని కోరుతూ, మనసారా అభినందిస్తున్నాను.

ఎన్. గోపి

శ్రీ కె. బి. కృష్ణ తేది : 28-7-1999
కథారచయిత, దేశీయ, అంతర్జాతీయ (ఆస్ట్రేలియా) బహుమతి గ్రహీత
డివిజనల్ అకౌంట్స్ ఆఫీసర్ (వర్క్స్) రెసిడెన్స్ ఫోన్ : 65835
గోదావరి సెంట్రల్ డివిజన్, ధవళేశ్వరం-532 125 కాకినాడ.

# 'లీ లా క థా మా లి క' లో పొన్నలూ, పొగడలూ.

డా॥ పొన్నా లీలావతిగారు రాజమండ్రి ప్రాంగణం, బొమ్మూరులో వెలసిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో సీనియర్ అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా, దేశిసాహిత్యశాఖ హెడ్‌గా పనిచేస్తున్నారు. వీరు అన్నమాచార్య విశేషపరిశోధకులుగా, కవయిత్రిగా గేయకర్తగా, విమర్శకులుగా, మధుర గాయనిగా, విదుషీమణిగా, బహు గ్రంథరచయిత్రిగా సుప్రసిద్ధులు ఇప్పుడు ఈ 'లీ లా క థా మా లి క'తో కథా రచయిత్రిగా కూడా ముందుకు వచ్చారు. ఇందులోని 21 కథలు ఇంతకుముందే వివిధ పత్రికల్లో ప్రచురితమై పాఠకులకు పరిచయమయ్యాయి అన్ని కథలు కూడా పొన్నలు, పొగడలవలె అనుభూతి పరిమళాల్ని వెదజల్లుతున్నాయి.

జీవితంలోంచి కథ వస్తుంది. కథలో జీవితం ఉంటుంది. మనం చదివే కథల్లోని పాత్రలు ఎక్కడో ఒకచోట సజీవంగా తిరుగుతూ ఉంటాయి. కథ రక్తికట్టాలంటే సజీవపాత్రల నేపథ్యంలోంచి వ్రాయాలి. దానివల్ల కొన్ని సందర్భాల్లో "ఈ పాత్రనాలాగే ఉంది. ఈ సంఘటన అచ్చంగా మా ఇంట్లో ఇలాగే జరిగింది." అని కథ చదివిన పాఠకులు అనుకోవడం జరుగుతుంది అందువల్ల కుటుంబ, సాంఘిక జీవితాలతో ముడిపడి ఉన్నకథలు ఆపకుండా పాఠకుణ్ణి చదివిస్తాయి. అలాంటి వాస్తవజీవితంతో రమ్యమైన భావనలతో కూడిన కథాపుష్పాల సమాహారమే ఈ "లీలాకథా మాలిక".

ఈ కథామాలికను చదువుతుంటే వస్తువిశ్లేషణ ప్రధానంగా నాలుగు రకాలుగా తోచింది.

మొదటిది :- ఇంట్లోపిల్లల అల్లరి చేష్టలు, క్రమశిక్షణ చర్యలు, పెద్దల బాధ్యతలు, విద్యా సంస్థల్లో వాస్తవసంఘటనలు, స్నేహాలు, అసూ

యలు, ఆదర్శాలు మొదలైన వాటితో నిండిన కథలు, ఉదాహరణకు ఎ్ర గులాబీ, కౌస్తుభ, కౌముది, సిసింద్రీచతుష్టయం, విద్యార్థి మొదలైన కథల్ని చెప్పవచ్చు.

రెండవది :- కొన్ని కుటుంబాల్లోని ఆత్మీయతలు, అనుబంధాలు, రకరకాల సంఘటనలు ఆసక్తికరంగా చిత్రించినవి. కుటుంబాల్లో జరిగిన దృశ్యాల్ని ప్రత్యక్షంగా చూసినప్పుడు ఎలా ఉంటుందో ఈ కథల్ని చదువు తున్నప్పుడు పాఠకులకు అలాంటి అనుభూతి కలిగించే కథలు. ఉదాహర ణకు అనసూయ, అనుబంధం, సౌహార్దం, హిరణ్మ్య మొదలైనవి.

మూడవది :- భార్యాభర్తల సమస్యలు. వివాహానికి ముందు ఒక విధంగా వివాహం తర్వాత మరోవిధంగా మారినప్పుడు ఉత్పన్నమయ్యే అల జడులు ఇందులో కనిపిస్తాయి. భార్యాభర్తల్లో ఒకరు మానవత్వంతో, దయా హృదయంతో సాటిమనుషులకు సహాయపడుతూ, ఔదార్యంగా జీవించాల నుకున్నప్పుడు మరొకరు సంకుచిత దృష్టితో, క్రూరత్వంతో, స్వార్థంతో బ్రతకాలనుకున్నప్పుడు ఇద్దరి మధ్యచెలరేగే స్పర్థలు, సమస్యలు, పోరా టాలు, తుదిసిర్ణయాలు మొదలైనవాటిని చిత్రించినవి

ఉదా॥ సుమధుర, సురుచిర, హేమంత్ మొదలైనవి.

నాల్గవది :- ఆదర్శదాంపత్యానికి సంబంధించిన కథలు, ఉదాహ రణకు పాదపల్లవం, సౌభాగ్య మొదలైనవి.

ఈ నాలుగురకాల కథలేకాక ఉద్యోగాలు చేసే స్త్రీలకు సంబంధిం చిన సంఘటనలతో కూడిన కథలు కూడా ఉన్నాయి “సౌజన్యం” కథలో ఉద్యోగం చేసే స్త్రీని ఏ రకంగా మగవాళ్ళు ఊహిస్తారు? ఏ రకంగా ఆశి స్తారు? అన్న విషయాన్ని రచయిత్రి కళ్ళకు కట్టిపట్లు చిత్రించారు. ఉద్యో గం చేస్తున్న స్త్రీ తనను ఆశించే దురుద్దేశ-తో చూసే కామాంధుడను డి తనను రక్షించుకునే కథా నాయికతో ఆమె స్నేహితురాలు ఇలా అంటుంది

“నీ దృఢత్వానికి, నీ చిత్తశుద్ధికి నా జోహార్లు రవళీ నీ ఆత్మవిశ్వా సం, నీ ధైర్యం నీకు ఎప్పుడూ వజ్రాయుధాలై తోడునీడగా ఉంటాయి

గురువులు పెట్టే పరీక్షల్లో నెగ్గితే విద్యార్థులకు పట్టాలు వస్తాయి నవ్వూ అంతే. లోకులు పెట్టే ఈ వ్యక్తిత్వపుపరీక్షల్లో చివరిదాకా నిలబడి విజయం సాధించాలి అప్పుడు వాళ్ళకు వాళ్ళే, చెంపలు వేసుకుంటారు క్షమార్పణలు చెబుతారు. ఈ వాక్యాలు స్త్రీజాతిని వెన్నుతట్టి నడిపించేవిగా, పురుష జాతికి కనువిప్పు కలిగించేవిగా ఉన్నాయి ఈ విధంగా ప్రతికథను కూడా ఎంతో స్ఫూర్తిదాయకంగా, చైతన్యాత్మకంగా, గుణపాఠం కలిగించేలా రచయిత్రి రచించారు. కొన్ని కథల్లో రాయలసీమ పరిసరప్రాంతాల్ని, అక్కడి ప్రజల మనస్తత్వాల్ని, మాండలికాలతో రమ్యంగా చిత్రించారు.

ఆత్మీయ డా॥ పొన్నా లీలావతిగారు స్వతహాగా కవయిత్రి, సాహితీ వేత్త కావడంతో ఈ కథామాలికలోని కొన్ని కథాకుసుమాలకు చెమ్కీల్లాంటి తళుకులుకూడా అద్దారు. ఇవి కథలకు "నగలకు రాళ్లు పొదిగినట్లు సొగసు సంతరించి మెరుపులు విరజిమ్మాయి.

"అనసూయ' కథలో శీనయ్య తనగోడు చెబుతుంటే వింటున్న అనసూయకు బాధతో 'కొండ గుహల్లోంచి జలపాతాలు దూకినట్లు కన్నీళ్ళు కారాయి'.

'అనుబంధం' కథలో తాతపాటలు పాడుతుంటే కథానాయికకు మనసులోని బాధలన్నీ గువ్వల్లా ఎగిరిపోయాయి' అలాగే మరోచోట 'పెనుగాలికి చెట్టు పడిపోయినట్లు నాన్న స్పృహతప్పి పడిపోయారు.'

'సింధువు' (పుట. 50) కథ ముగింపులో ఆకాశ హర్మ్యంనుండి అందాల నెలరాజు వెన్నెల కిరణాల జాజిపూలను వెదజల్లసాగాడు' ఎంతో రమణీయమైన వర్ణన ఇది. 'పాదపల్లవం' కథలో పూర్వాద్రిపై సూర్యభగవానుడు రథయాత్ర ప్రారంభించాడు.

'సురుచిర' (పుట. 105) కథలో 'ఆమెదోసెడేసి కళ్ళల్లోకన్నీళ్ళ స్థానంలో వెన్నెలసోన చిలికింది' ఎంత సమ్మోహన రూపమో ఊహించుకోవచ్చు. 'సౌహార్దం' కథలో 'మనసంతా తన ఊరివాళ్ళ ఊసులమీద పువ్వుమీద తేనెటీగలా తిరగిసాగింది'. ఇందులో స్వంతఊరి మనుషులపై అవ్యాజానురాగాల అనుభూతి ముద్ర ఎంతో హృదయంగా ఉంది. ఇదే కథలో 'నగర

వాసులకు' నిసర్గమైన పల్లెవాసులకు మధ్య ఉండే తారతమ్యం ఇదే. వాళ్ళ మనసులు కాగితాల పూలు, వీళ్ళ మనసులు అడవిమల్లెలు.

ఇంకా ఇలాంటి రమణీయమైన వర్ణనలు, చమత్కృతులు, చళుకులు, బెళుకులు చాలా ఉన్నాయి నేను కొన్నింటినే ఉదహరించాను. 'లీలా కథామాలిక'లోని కథల్లో క్రమశిక్షణ, నీతి, నిజాయితీ కర్తవ్య నిర్వహణ, దుష్ట సంబంధ నిరసన, మహిళాభ్యుదయం, దైవభక్తి, దేశభక్తి, శాంతి, సంగీతప్రీతి, మానవత్వం, ఆత్మవిశ్వాసం, కుటుంబానుబంధం, త్యాగశీలం మొదలైన ఉన్నతమైన భావాలు, సద్గుణాలు అంతర్వాహినిలా సాగుతున్నాయి. అన్నికథలు రచయిత్రి హృదయానికి, ఆదర్శభావనలకు దర్పణం పడుతున్నాయి. మానవశ్రేయస్సును అభిలషిస్తున్నాయి.

వాస్తవ జీవితానికి అతి దగ్గరగా ఉంటూ పాఠకులకు ఎంతో ఆసక్తిని కలిగించే చైతన్యాత్మకమైన ఇలాంటి చక్కని కథల్ని డా॥ పాన్నా లీలావతి గారు ఇంకా ఇంకా వ్రాయాలని, మిగతా సాహిత్య ప్రక్రియా రచనలతో పాటు కథా రచనకూడా కొనసాగించి సాహిత్య వికాసానికి తమవంతు కృషి చేయాలని నా అభిలాష.

— కె. బి. కృష్ణ

శ్రీమతి ప్రయాగ లక్ష్మీకాంతమ్మ
రేడియో ఆర్టిస్ట్
రిటైర్డ్ మ్యూజిక్ టీచర్
ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల
సదనం, రాజమండ్రి.

తేది : 5-8-1999

# అభినందన

చిరంజీవి డా॥ పొన్నా లీలావతి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, సాహిత్య పీఠంలో సీనియర్ అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా, దేశి సాహిత్య శాఖాధిపతిగా పని చేస్తున్నారు. ఈమె రచయిత్రిగా, కవయిత్రిగా, అన్నమాచార్య సంకీర్తనా పరిశోధకురాలుగా, అన్నమాచార్య సంకీర్తనా గాయనిగా, వక్తగా సాహిత్య లోకానికి బాగా పరిచయమే.

'కృషితోనాస్తి దుర్భిక్షం' అని జీవితంలో మనం తలచుకుంటే చేయలేనిది, సాధించలేనిది ఏదీలేదని చి॥ లీలావతి తన అన్ని గ్రంథాల్లో ముఖ్యంగా 'లీలాకథామాలిక'లో నిరూపించారు. ఇందులో ఆమె కుటుంబానుబంధం, సమాజానుభవం, దుష్టపోరాటాలు, శిష్టసాంగత్యాలు, రచనా సామర్థ్యం ప్రస్ఫుటమవుతాయి. ప్రతి ఒక్క కథలో ఆ కథకు సరిపడే విధంగా పాత్రల ఎంపిక, పాత్రల చిత్రీకరణ చాలా చక్కగా, అనుగుణంగా వ్రాసి పాఠకుల హృదయాల్లో మరపురాని పాత్రలుగా నిలపెట్టారు. మంచి సమయస్ఫూర్తి, చిత్తశుద్ధి, రచనా నైపుణ్యం గల లీల అభినందనీయురాలు.

ఈ కథామాలికలో సిసింద్రీ చతుష్టయం, పట్టుదల, నీరుపల్లమెరుగు, సింధువు, విద్యార్థి, సుమధుర, సురుచిర, స్ఫటికం, హిరణ్య, మౌనిక మొదలైన కథల్లోని పాత్రలు చిరకాలం పాఠకుల హృదయాలకు హత్తుకు పోయేరీతిలో తీర్చిదిద్దినట్లుగా ఉన్నాయి.

విద్యార్థులకు గుణపాఠంగా, ప్రేమికులకు సున్నితమైన బోధనగా, స్వార్థపరులకు, దురాశాపరులకు, నమ్మకద్రోహులకు గట్టి హెచ్చరికగా ఈమె కథలు సాగాయి. 'స్ఫటికం' అనే కథలో విమల పాత్రను ఎంతో నేర్పుగా, ఆదర్శవంతంగా చిత్రీకరించారు. ప్రేమపేరుతో, పెళ్ళి పేరుతో మోసపోయి అమూల్యమైన సంవత్సర కాలం వ్యర్థం అయినందుకు, తెలియక దుష్ట సంబంధం చేసినందుకు ఆ పాత్ర పడిన వేదనను ఈనాటి యువతరానికి గుణపాఠంగా నిరూపించారు. ఈ విధంగా ప్రతి ఒక్క కథను జీవితానికి అద్దం పట్టినట్లుగా, చైతన్యపూరితంగా వ్రాసిన రచయిత్రి లీల ప్రశంసనీయురాలు.

చిన్నతనంలోనే ఈమె 'ఎ టు జెడ్'గా జీవితాన్ని కాచి ఒడబోసిన విధంగా, ఇంక ఏమీ వ్రాయడానికి మిగలనట్లుగా నిరూపిస్తూ ఈ 'లీలాకథా మాలిక' రచన చేశారు.

పిన్నలపట్ల పెద్దలపట్ల బాధ్యతాయుతంగా ప్రవర్తించే ఈమెను కన్న తల్లిదండ్రులు అదృష్టవంతులు. ఒకరత్నంలాంటి రచయిత్రిని పాఠకలోకానికి బహుకరించిన ఆ తల్లిదండ్రులు ధన్యులు. వాళ్ళ ఊరే "పానకం". అలాగే వారి మనస్సులు తీపి ఇంక చెప్పేదేముంది! ఆమె రచనలన్నీ 'పానకం' లాగానే మధురంగా ఉన్నాయి. ఇది నిజం.

డా. లీలావతి మంచి స్నేహశీలి. ఎదుటి వ్యక్తిని చూడగానే చక్కగా అర్థం చేసుకునే శక్తిసామర్థ్యాలు ఆమెకు దైవమిచ్చిన వరాలు. జీవితాన్ని 'శ్రీ అన్నమయ్య'కు సద్వినియోగం చేసి రచనల్లో పునర్జన్మ ఎత్తిన రచయిత్రి లీల.

'చక్కని రాజమార్గము ఉండగా సందుల దూరనేల' అంటారు త్యాగరాజు. రచయిత్రి లీల చిన్ననాటినుంచీ ఆ రాజమార్గంలోనే దైవాన్ని నమ్ముకుని ధైర్యంగా పయనిస్తోంది. కానీ ఎందరో దురాశాపరులు, అసూ

యాపరులు అద్భుతగలి ప్రక్కదారులు పట్టించాలని రకరకాలుగా ప్రయత్నాలుచేసినా తృణీకరించి చక్కని రాజమార్గాన్నే పయనిస్తోంది. ఆమె సాహితీ రచనా లోకంలో తిరుగులేని రచయిత్రి. ఇంతకు మునుపే ఆయా పత్రికల్లో ముద్రితమైన కథా పుష్పాలన్నింటిని కూర్చి తనపేరుమీదుగా 'లీలాకథామాలిక'గా పాఠకలోకానికి అందిస్తున్న 'లీల'కు నా హృదయ పూర్వక అభినందనలు, ఆశీస్సులు.

సదా నీ స్నేహాభిలాషిణి
శ్రీమతి ప్రయాగ లక్ష్మీకాంతమ్మ
రేడియో ఆర్టిస్ట్
రిటైర్డ్ మ్యూజిక్ టీచర్
ఆంధ్రయువతి సంస్కృత కళాశాల
సదనం, రాజమండ్రి.
తూ. గో జిల్లా.



కుమారి నడిమింటి ఛాయాపద్మిని
(రిటైర్డ్, ప్రధానోపాధ్యాయిని)
కుమారి నడిమింటి విజయలక్ష్మి (టీచర్)
ఇం. నెం. 20-2-33, సంఘమిత్ర
లంకస్ట్రీట్, విజయనగరం-535 002

తేది : 26-8-1999

కోడ్ నం : 08922
రెసిడెన్స్ ఫోన్ నెం : 26733

# శుభాకాంక్షలు

రాజమండ్రి తెలుగు విశ్వవిద్యాలయంలో అధ్యాపకురాలుగా, అన్నమాచార్య పరిశోధకురాలుగా. సంకీర్తనా గాయనిగా, రచయిత్రిగా ప్రసిద్ధి గాంచిన డా॥ పాన్నా లీలావతి విరచితమైన మరో పుస్తకం లీలాకథామాలిక. ఇందులో ఒక్కొక్క కథ ఒక్కొక్క ఆశయానికి, జీవితావసరాలకి అద్దం పడుతున్నది. ప్రధానంగా నిత్య జీవితంలో స్త్రీలకెదురయ్యే సమస్యలు, వాటిని పరిష్కరించడంలో విద్యావంతులైన స్త్రీలు చూపించే ఓర్పు, నేర్పు, విద్యలేనివారు పడే తికమకలు బాగా చిత్రించారు. తన జీవితంలో ఎదురైన సమస్యల్ని, అనుభవాల్ని రచయిత్రి కథలుగా మలిచి వాటికి ప్రయోజనం చేకూర్చారు అనిపిస్తుంది.

'అనసూయ" కథలో పొరుగూరి శీనయ్య తాతను ఆదరించిన అనసూయ, వెంకన్నలు మానవత్వానికి ప్రతిరూపాలు. అందరూ అదే విధంగా ఉంటే ప్రతి ఇల్లు, సమాజం సుఖశాంతులతో. మానవతా పరిమళాలతో వర్ధిల్లుతుంది. 'అనుబంధం" కథలో అక్కచెల్లెళ్ళు, తాతామనవలు మొదలైన కుటుంబ సభ్యుల మధ్య చక్కని మమతానుబంధం, ఆనందం కలిగిస్తుంది. పూర్వకాలపు ఉమ్మడి కుటుంబాలు, వృద్ధుల ఆదరణలో పిల్లల మనోవికాసం గుర్తుకు తెస్తుంది. 'కౌస్తుభ" కథలో పల్లెటూళ్ళలో ఆడపిల్లలు పక్కఊరికి కాలినడకన వెళ్ళి చదువుకోవాలంటే ఎన్ని కష్టాలెదుర్కోవాలో వివరిస్తూ, అన్ని అడ్డంకుల్లో కూడా తగిన ప్రోత్సాహం ఉంటే, ఆడపిల్లలు ఆ అవకాశాన్ని ఎలా సద్వినియోగ పరచుకోగలరో కూడా తెలియజేసారు. "నీరుపల్లమెరుగు" కథలో ఉపకారాలుచేసి అపనిందలపాలైన పావనిమేడం పరిస్థితికి బాధ కలుగుతుంది. "పట్టుదల" కథలో మూర్ఖులైన ఇంటిపెద్దల్ని

ఊరు జనాల్ని ఎదిరించి తల్లిని రక్షించుకున్న రాధ పట్టుదల సెభాష్ అని పిస్తుంది. వరకట్నమే స్త్రీలపాలిటి శాపమనుకుంటే ఉద్యోగం, పెద్దజీతం కూడా ఆమె జీవితానికి గొడ్డలిపెట్టే ఈ పురుషాధిక్య సమాజంలో అన్న నిష్ఠురసత్యం స్ఫటికం కథచదివి ఒప్పుకోక తప్పదు. ఇంకా ఈ సంపుటిలో సింధువు, పాదపల్లవం, మౌనిక, విద్యార్థి, సిసింద్రీ చతుష్టయం, సాహసం, సుమధుర, సురుచిర, సౌభాగ్య, సాహార్దం, సౌజన్యం, హిరణ్య, హేమంత్ మొదలైన కథలు వస్తువైవిధ్యంతో పేర్లకుతగినట్లుగా ఉదాత్తంగా ఉన్నాయి.

ఈ రోజుల్లో క్రైమ్, సెక్స్, రొమాన్స్ వెల్లువలో కొట్టుకు పోతున్న వ్యవస్థలో ఈ రకం సాహిత్యం ఎడారిలో ఒయాసిస్సులాంటిది. పాత్రల స్వభావచిత్రణ అత్యంత సహజంగా ఉంది సమాజ హితాన్నికోరే ఇలాంటి విలువలతో కూడిన సాహిత్యం లీలావతిగారి కలం నుండి వెలువడాలని శ్రీ వేంకటేశ్వరుడు ఆమెకు ఆ శక్తి సామర్థ్యాలు ప్రసాదించ గలడనిఆశిస్తూ శుభాకాంక్షలందిస్తున్నాము.

నడిమింటి ఛాయాపద్మిని
నడిమింటి విజయలక్ష్మి



శ్రీమతి కె. కమలాదేవి
డోర్ : 86-4-1/1, వాడ్రేవునగర్,
రా జ మ ం డ్రి.

ఫోన్ నెం : 460205
తేది : 19-8-1999

# ప్రేమాశీస్సులు

పొన్నా వంశ విభూషిణి!
విన్నాద వినోదవాణి విద్యారాజ్ఞీ!
ఎన్నో కలవర కథలను
వెన్నెల కవితలుగ మార్చు విస్మయపాణీ!

లలిత గాంధర్వ మాధుర్యలాస్యగాత్ర!
శ్రీ సరస్వతీ దేవి విలాస చతుర
శత శరత్తులు రాణించ జయజయోస్తు
దినదినాభ్యుదయమ్ముగా దీవనములు

జన్మచరితార్థమగు గాక! సచ్చరిత్ర!
సౌమ్యస స్నేహమానస సంఘమిత్ర
మాతృగౌరవకారణ మహితహృదయ
రమ్యభావ విలోల! సరాగలీల!

శ్రీరస్తు గానమూర్తీ
శారద కృపగల్గుగాక సతతమునీపై
సారస్వత సంజీవని
వై రాణించుచు తరించుమాంధ్రుల వరమై॥

జయంతితే సుకృతినః

(భారతీయ సంగీత సుధాకర, వాగ్గేయకార ప్రభాకర పద్మశ్రీ, పద్మ విభూషణ్' డా॥ మంగళంపల్లి బాలమురళీ కృష్ణగారికి 24-7-1999 తేదీన ప్రతిభావైజయంతికా పురస్కార సన్మానం రోజున వారిని గూర్చి నేనువ్రాసి

పాడిన పాటకు సంగీత సాహిత్యాభిలాషిణి శ్రీమతి కె. కమాలాదేవిగారు ముగ్ధురాలై ఆప్యాయతా మకరందం నాపై జాలు వార్చారు. ఆ సాన్నిహిత్యంతో నేను బహూకరించిన కీర్తనాకౌముది, కరుణకమలం పుస్తకాలు చదివి ఆహ్లాదించి పారవశ్యంతో తమహృదయ సరస్సునుండి పద్యపద్మాల్ని పూయించారు. వారిపేరు వ్రాయకుండా ఉత్తరం ద్వారా శాశ్వతంగా గుబాళించే అ పద్మాల్ని అందించి నన్ను ఆశ్చర్యాంబుధిలో, ఆనంద వాహినిలో నన్నుముంచి తేల్చి అనుభూతి బాష్పాల్ని కురిపింప చేసిన ఈ విదుషీ మణికి, మాతృవాత్సల్య హృదయినికి ఏ బహుమతి సరితూగ గలదు! నా పవిత్ర ప్రణుతి తప్ప!)

—పొన్నా లీలావతి



డా॥ కె. వి. వి. సత్యనారాయణ

వంశీ క్లినిక్, ఫోన్ నెం : 54335
ఘంటసాల సింగర్, ప్లేబాక్ ఆర్టిస్ట్
మాస్టర్ ఆఫ్ కామెంటరీ
వెలుగుబంద, రాజానగరం-533 294
తూ॥ గో॥ జిల్లా.

తేది : 28-8- 999

# హృదయ స్వరం

సాహిత్య వినీలాకాశంలో ఓ కొత్త ధ్రువతారగా వెలసి రచనా వ్యాసంగంలో క్రొత్త ఒరవడిని సృష్టించారు డా॥ పొన్నా లీలావతిగారు మనిషి విలువలను, బాధ్యతలను ఈనాటి యువతరానికి, ఈ సమాజానికి ఉపయోగకరమైన చక్కని కథల్ని తమ శారదా పద్మహస్తాలతో రచించిన మీ లీలా కథామాలిక ఈ సమాజానికి ఓ చల్లని స్వాతికిరణమాలిక. కుటుంబానుబంధాన్ని, కుటుంబాభిమానాన్ని సమాజాభివృద్ధిని ప్రకాశింపచేసే కరదీపిక ఇందులోని ఇరవై ఒక్క కథలు ఇంతకుముందే వివిధ పత్రికల్లో ముద్రితమై పాఠకలోకానికి పరిచయమైనవే.

వివాహంలో వరుడు 'నాతిచరామి' అంటూ ప్రమాణం చేసి తనకు కాబోయే అర్ధాంగిని స్వంతం చేసుకుంటాడు. అంటే మీ కుమార్తెను ఎందులోనూ అతిక్రమించి చరించను సుమా అని అర్థం. దానికి విరుద్ధమైన వికృత మనస్తత్వం కల్గిన పాత్ర 'స్ఫటికం' కథలో మనోహర్ ఈ పాత్ర పురుషదురహంకారానికి ప్రతీక.

స్త్రీ వ్యక్తిత్వానికి గౌరవం ఇవ్వలేనివాడు ఈ ప్రపంచంలో అన్నీ ఉన్న నిరుపేద. స్ఫటికంలాంటి మంచి మనసున్న పాత్ర విమల. స్త్రీ సహజమైన స్నిగ్ధత్వాన్ని, తోవుట్టువులపై ఎనలేని అనుబంధాన్ని, ఔదార్యాన్ని సంతరించుకున్న త్యాగమయి విమల.

రచయిత్రి భార్యాభర్తల బంధాన్ని సహజ మనోహరంగా, ఆదర్శంగా 'పాదపల్లవం' కథలో నిరూపించారు. ఇందులో భర్త అహంకారంతో భార్యను

చులకన చేయకుండా అన్ని పనుల్లోనూ తోడ్పడుతూ చివరిదాకా అనురాగం తగ్గని మనస్సుతో ప్రేమగా చూసుకోవాలనే సందేశం తెలియజేశారు. భార్య అంటే నీలిమలా ఉండాలి. భర్త అంటే రాజశేఖర్‌లా ఉండాలి అని ఆ పాత్రల్ని సృష్టించిన మీ రచనా ప్రతిభకు, ఆదర్శ భావనకు హేట్సాఫ్.

తమ వాళ్ళను గురించి తామే పట్టించుకోవడానికి మనసు, ఓపిక, తీరికలేని యాంత్రిక మనుషులున్న రోజులివి. అనారోగ్యంతో స్పృహ కోల్పోయి గోడచాటున పడి మూలుగుతున్న ఒకపొరుగూరి వృద్ధుని చేరదీసి సేవలు చేసి ఆదరిస్తుంది అనసూయ పాత్ర. ఇతరులపై దయాదాక్షిణ్యాలు చూపించాలని చిన్నతనంనుండే తన పిల్లల హృదయాల్లో మానవత్వ ఔషధాన్ని నూరిపోసిన ఓ మాతృమూర్తి అనసూయ. ఈ పాత్రను గూర్చి చదువుతుంటే మనమలందరూ అనసూయలా ఉంటే ఎంత బాగుండును అనిపిస్తుంది. తల్లి ఉన్నా తల్లి ప్రేమలో ఆనందం పొందలేని ప్రతిఒక్కరూ అనసూయలాంటి తల్లి ఉంటే ఎంత బాగుండేవి అనుకుంటారు. తల్లి అంటే ఇలా ఉండాలని అనసూయ పాత్రను సృష్టించిన మీ రచనా సామర్థ్యం వెలకట్టలేనిది.

దురలవాట్లకు, అవలక్షణాలకు డాక్టర్ల మందుకంటే దైవభక్తే దివ్య ఔషధమని 'ఎర్రగులాబీ'లో మయూరి పాత్రద్వారా చెప్పించడం మీ దైవభక్తికి, విశ్వాసానికి, అధ్యాత్మిక చింతనకు నిదర్శనం పిల్లలు క్రమశిక్షణతో మెలగాలని చెప్పటానికి చేసిన ప్రయత్నం ప్రశంసనీయం.

విద్యార్థికి ఉండవలసిన మంచి లక్షణాల్ని కౌముది కథలో చూపించడం మీ సత్ప్రవర్తనకు చిహ్నం. మిడుగడిపే నిజ జీవితానికి సింధువు కథ ఒక నిలువుటద్దం అనిచెప్పాలి. లీలగారూ! తల్లిపై మీకున్న అపారమైన ప్రేమను 'పట్టుదల' కథలో రాధపాత్ర ద్వారా చెప్పించిన మీ సాహస జీవితానికి ఇంకెవ్వరూ సాటిరారనడానికి నా కళ్ళనుండి రాలిన కన్నీటి చుక్కలే సాక్ష్యాలు. విద్యావంతులైన యువతీయువకులు ఆధునిక విజ్ఞాన

వైవ్యాశాస్త్రాలపై ఎంత అవగాహన కలిగి ఉండాలో, పెద్దలపట్ల ఎంత బాధ్య తగా నడుచుకోవాలో, మూర్ఖత్వాన్ని, అడ్డంకుల్ని ఎలా ఎదుర్కొని విజయం సాధించాలో ఈ కథ ద్వారా స్ఫూర్తి కలిగించారు లీలావతిగారు.

'పానకం' అంటే తియ్యని పదార్థం. తీపి అనే పదార్థం చెలిమికి చిహ్నం. రచయిత్రి ఊరికి ఆపేరు ఎలా వచ్చిందనే విషయాన్ని, గ్రామాభి మానాన్ని, చిన్ననాటి స్నేహానుభూతిని తెలియజెప్పిన "సౌహార్దం" కథ పాఠకస్నేహితులకు ఓ లీలాకోకిలం.

జీవితానికి చదువొక్కటే వెలుగును, విలువను ఇస్తుందని అపారమైన పరిపూర్ణ విద్యావంతులైన మీరు మౌనిక పాత్రను మలచిన తీరు సాహిత్య జగత్తులో లీలాప్రసాదంగా మిగిలిపోతుంది.

పెద్దల సాంగత్యం వల్ల, స్వంతంగా ఆలోచించుకోవడంవల్ల, స్వీయా నుభవంవల్ల ఇంత చిన్నవయసులో అపారమైన జ్ఞానాన్ని, మీ జీవిత పుస్త క[illegible] ప్రతిపేజీని ఒక భగవద్గీతలా మాకందించిన మీ లీలాకథామాలిక లోని విద్యార్థి కథాచిత్రణ ఈ మహిలో మీకుతప్ప ఇంకెవరికి వర్తిస్తుంది!

తనకోసం తాను బ్రతకడంలో వుండే ఆనందంకన్నా ఎదుటివారికోసం జీవించే ఆనందం గొప్పదని మీ మనస్తత్వాన్ని 'సాహసం' కథలో కోదం డయ్య పాత్రలో చూపించారు. ఇవి మీ ఔదార్యానికి, మీ ఔన్నత్యానికి ఓ మచ్చుతునక.

ఇక మీ 'సుమధుర' కథ మధురాతిమధురం. మీరు ఒక వ్యక్తి కాదు ఓ శక్తిమూర్తి. మనిషిరూపంలో కనిపించే త్యాగశీలి మీరు జీవితాన్ని కన్నవాళ్ళకోసం, తోబుట్టువులకోసం అంకితంచేసిన ఓ త్యాగమయీ! ఆ అన్నమయ్యే తరిస్తాడమ్మా. మీ సాహితీజీవితాన్ని చూస్తే జీవితంలో సాధించవలసింది ఇంక ఏమీ లేదనిపిస్తుంది. ఓ అభినవ సురుచిరా! ఇది సత్యం.

మీ' లీలాకథామాలిక' చదువుతుంటే ఇందులోని పాత్రల్ని ఎక్కడో చూసినట్లుందే! ఎక్కడో జరిగినట్లుందే అని సహృదయ పాఠకులకు సహ

జంగా అనిపిస్తుంది. జీవితంలోని వివిధ సంఘటనలకు సంబంధించిన కథలేకాక స్కూల్లో విద్యార్థులమధ్య జరిగే సంభాషణలను హాస్యరసఫలాలుగా పండించారు. వాటిని తింటుంటే వచ్చే తీయనినవ్వులే మీ 'ససింద్రీ చతుష్టయం' కథ.

ఇవేకాదు ఇంకా ఈ 'లీలాకథామాలిక'లో ప్రతి కథకూడా రసానంద భరితమే. స్ఫూర్తిదాయకమే. రచనలు చెయ్యడం ఒక ఎత్తైతే వాటికితగిన పేర్లను సూచించడంలో మీప్రత్యేకత ఈ కథామాలికకే హైలెట్. అందులో కౌస్తుభ, కౌముది, సురుచిర, సుమధుర, హిరణ్య, హేమంత్ మొదలైన వాటిని పేర్కొనవచ్చు.

జీవితమంటే కేవలం సుఖాలేకాదు కష్టసుఖాల మేలుకలయిక అని, చెడుపై మంచే విజయం సాధిస్తుందని, మానవత్వమే ప్రధానమని తెలియనివాళ్ళకు మీ లీలాకథామాలిక ఓ చక్కటి సమాధానం. నిత్యం వైద్యవృత్తిలో యాంత్రిక జీవితాన్ని గడుపుతున్న నాకు మీ "లీలా కథామాలిక" ఓ చల్లని స్వేదనివారణ మాలిక. మీ చక్కని సరస్వతీకరకమలాలనుంచి మరెన్నో లీలాసాహిత్య సవ్వడులు జాలువారాలని, అందుకు మీ ఆరాధ్యదైవాలు అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరులు మీకు ఆయురారోగ్యాల్ని ప్రసాదించాలని ఓ డాక్టర్‌గా, శ్రేయోభిలాషిగా, సంగీత సాహిత్యాభిలాషిగా నా హృదయపూర్వకంగా కోరుకుంటున్నాను.

కె. వి. వి. సత్యనారాయణ

# విషయసూచిక

# అనసూయ



అరమరలు లేని ప్రేమకు, కుళ్ళుకుత్సితాలు లేని బంధాలకు నిలయాలు పల్లెటూళ్ళు. స్పర్థలు, విభేదాలు అక్కడక్కడా వున్నాకూడా కష్టసుఖాలు కలబోసుకుని పాలు పంచుకోవడానికి పకుల్లా పల్లెటూరి జనం గుమికూడినట్లు పురజనులు రారు.

సాయంత్రం ఐదుగంటలు కావస్తోంది. కోకిలల కిలకిలా రావాల్లో సంధ్యారాగాలు వినిపిస్తున్నాయి. లేగదూడల అంబారావాల్లో వాత్సల్యవాహిని పొంగిపొరలుతోంది. పల్లెపడుచులు ఇంటి పనులకు ఉద్యమిస్తున్నారు.

అనసూయ వంటావార్పు పూర్తిచేసి, చెత్తతీసి, వాకిట్లోనీళ్ళు చల్లి ముగ్గువేసి ఇంటి పనులన్నీ ముగించుకుంది. పెద్దమ్మాయి చిట్టెమ్మను పిలిచి చిట్టీ! నేను చేనికాడికెళ్ళి పేడెత్తేసి, కొట్టాం శుభ్రంగా వూడ్చేసి, పశువులకు కసువేసేసి బిన్నెవచ్చేస్తాను. నువ్వు బుజ్జోడిని, బుజ్జిదాన్ని జాగ్రత్తగా చూసుకో. మీ నాయన ఊరునుంచి వస్తే నీళ్ళు కాసిచ్చి ఒల్లికి పోసుకోమను. వంకాయకూర చేసి, కూడు వార్చిపెట్టినాను. మీ నాయనకు భయంగా వడ్డించు. అరకొరలుగా చేస్తే మీ నాయనకు కోపం వస్తుంది, అని చెప్పి గంప, చాట, పారక తీసుకొని పొలం దగ్గరకు బయలు దేరింది అనసూయ.

అనసూయ వీధిలో వెళ్ళుతూవుంటే పక్కనున్న మొండి గోడల్లోంచి అమ్మా—అబ్బా—అంటూ సన్నగా మూలుగులు వినిపించాయి అనసూయకు. ఆమె గుండె దిగులు సెగతో వెన్నముద్దలా కరిగిపోయింది, ఆందోళనతో గబగబా వెళ్ళిచూసింది. అక్కడ శీనయ్య అనే డెబ్బైఏండ్ల వృద్ధుడు మలమూత్రాల్లో తడిచి మురికి పట్టి మూలనబడి కొనవూపిరితో కొట్టుమిట్టాడుతున్నాడు.

అనసూయ దయా దాక్షిణ్యాలు రూపుదాల్చిన వనిత. ఆమెకు

పదేండ్లప్పుడు పెద్దలు పెళ్ళి చేసేశారు. అప్పటినుంచి అత్తవారింట్లో కాపు రం చేస్తోంది. ఆమెకు తన, మన అనే భేదాలు తెలియవు. ఎవరికంట కన్నీరు కారినా, ఎవరి కడుపు ఆకలితో అలమటించినా ఆమె భరించలేదు. ఇలా ఆమె నలభై ఏండ్లనుంచీ ఆ పల్లెటూళ్ళో ఒక అన్నపూర్ణలా మెలగుతూ దివ్యదీపంలా వెలుగుతూ గొప్ప పేరు తెచ్చుకుంది. అలాంటి ఆమె తన తండ్రిలాంటి శీనయ్య ఇలా దిక్కులేనివాడిలా పడిపోయి దీనావస్థలో వుంటే సహించలేక విలవిలలాడింది.

అయ్యా— అయ్యా— అని శీనయ్య ఒళ్ళును వూగించి పిలిచింది అనసూయ. ఆఁ— ఆఁ— అంటూ మెల్లగా కళ్ళువిప్పి చూశాడు శీనయ్య లేయ్యా— లే— ఇంటికెళదాం అంటూ శీనయ్యను లేపి తన భుజాలపై వేసుకొని ఇంటిదాక ఈడ్వలేక ఈడ్చుకుంటూ వచ్చి ఇంటి తిన్నెపై పండ బెట్టింది అనసూయ.

శీనయ్య ఎప్పటినుంచి మూలుగుతున్నాడో పాపం! ఆవూర్లో అటు వైపు ఎవ్వరూ వెళ్ళకనే వుంటారా! ఆ మొండి గోడల పక్కనున్న ఇంట్లో వాళ్ళకు ఆయన మూలుగులు వినబడకనే వుంటాయా' ఏమో అంతా ఆ భగవంతుడికే తెలియాలి. ఈ లోకంలో ఎవరు ఏమైతే మనకేమి అనుకునే స్వార్థపరులు తామరతంపరులుగా వుంటారు. ఎవరికి ఏమి జరిగినా తమకు జరిగిన దానికన్నా మిన్నగా తల్లడిల్లే మానవతా మూర్తులు అరుదుగా వుం టారు.

పల్లెటూరి వాళ్ళు చన్నీళ్ళతో స్నానం చెయ్యడానికి అంతగా ఇష్ట పడరు. అనసూయ హడావుడిగా పొయ్యిమీద బానపెట్టి దాని నిండా నీళ్ళు పోసి కసువు, చెత్తాచెదారం, శెనగతీగ అంతా జవురుకొని వచ్చి పొయ్యి మంటేసి త్వరగా నీళ్ళుకాచింది. శీనయ్యను తిన్నెమీద మంచి లేవదీసు కొచ్చి పెరట్లో పీటపై కూర్చోబెట్టింది. ఎనిమిదో తరగతి చదువుతున్న పెద్ద కూతురు చిట్టెమ్మను పిలిచింది శీనయ్యను పట్టుకోవడానికి.

ఆ పాపవచ్చి అమ్మా! తాత ఒళ్ళు కంపుకొడుతోంది. ఛీ, నేనుపట్టు కోను అని అసహ్యించుకొంటోంది. అలా అనకూడదమ్మా! నువ్వూ చిన్నప్పుడు

ఈ మాదిరిగా అంతా పూసుకొనేస్తే నేను స్నానం చేయించలేదూ! అంతే నమ్మా తాతకూ మనం చేయ్యాలి. మనం మనలాంటి మనుషులకు సహాయం చేస్తే దేవుడు మనకు సహాయం చేస్తాడు చిట్టీ అని అనసూయ తన కూతురికి నచ్చచెప్పింది. సరేనమ్మా! అంటూ చిట్టి తాత పడిపోకుండా పట్టుకుంది. ఒళ్ళంతా మలినాలతో రోత కొడుతున్న శీనయ్య ఒళ్ళును సబ్బుతో రెండుమూడు సార్లు బాగారుద్ది శుద్ధిగా సాన్నం చేయించింది. అనసూయ. శీనయ్యను మెల్లగా ఇంట్లోకి పట్టుకొచ్చి తనభర్త వె కన్న పంచెను చుట్టబెట్టి తిన్నెపైచాప, దిండు వేసి ఆయన్ను పంత బెట్టింది. చిట్టెమ్మను పిలిచి విసనకర్ర చేతికిచ్చి తాతకు మెల్లగా విసురమ్మా అంది. అట్లాగేమ్మా అని విసనకర్ర తీసుకొని విసురుతోంది చిట్టెమ్మ.

ఈలోగా ఒక గిన్నెలో అన్నం మెతుకులు వేసి మజ్జిగ దండిగా పోసి నున్నగా పిసికి తెచ్చింది అనసూయ శీనయ్యను కొంచెం పైకి లేపి పట్టుకొని పిసికిన అన్నం మజ్జిగ తాగిపించింది. శీనయ్య కొంచెం కొంచెం మజ్జిగ తాగి కోలుకున్నాడు.

ప్రాణం లేచివచ్చినట్లనిపించింది శీనయ్యకు. మాట్లాడగల్గిన స్థితికి వచ్చాడు శీనయ్య. అప్పుడు అనసూయ— ఊరునుంచి ఎప్పుడొచ్చినావయ్యా అని అడిగింది శీనయ్యను. ఈరోజు తెల్లారి వొచ్చినానమ్మా అన్నాడు శీనయ్య. అయితే ఇంటికొచ్చుంటేమి, ఆ గోడల్లో ఎందుకు పడిపోయినావు? అని అడిగింది ఆమె. ఆ వారవీధిలో రాజయ్యావోళ్ళు నన్ను సూడగానే ఇంటికి రమ్మని బలవంతం సేసినారమ్మా, అక్కడికెళ్ళి కాసేపు కూసున్నాను. మేము ఈ వూళ్ళో ఇన్నేళ్ళుగా కాపరం సేసిన ఆ ఇల్లు ఎట్లావుందో సూడాలనిపించిందమ్మా, అక్కడికెళ్ళేసరికి కడుపులో దేవినట్లు, కండ్లు తిరిగినట్లు అనిపించి అట్లాగే పడిపోయినా. అంతే అడ ఏమి జరిగిందో తర్వాత నాకు తెలవలేదు. నా ఒళ్ళు నా సోదీనంలో లేక పోయిందమ్మా అని శీనయ్య చెబుతుంటే కొండ గుహల్లోంచి జలపాతాలు దూకినట్లు అనసూయ కళ్ళనుండి ధారాపాతంగా కన్నీళ్ళు కారాయి.

ఆ కన్నీళ్లను చూశాడు శీనయ్య. ఎందుకమ్మా నువ్వు ఏడస్తావుండావు. నేను నీ కెంత కష్టం కలిగించినానమ్మా! నా పెండ్లాం బిడ్డలైనా

ఇంత బాగా సూసుండరమ్మా. వోళ్లు సెయ్యాల్సిన సేవ నువ్వునాకు సేసినావమ్మా! ఒక తల్లిపాలు తాగే బిడ్డను సూసుకున్నంత జాగర్తగాసూసు కున్నావు. మళ్లా జనమ అంటా వుంటే నీ కడుపున కూతురుగాపుట్టి, నీకు సేవసేసి ఋణం తీర్చుకుంటా తల్లీ! అంటూ అనసూయ చేతులు పట్టు కొని బోరుమని ఏడవసాగాడు శీనయ్య తాత.

గమ్మనుండయ్యా ఏడవబాక. నువ్వునాకు తండ్రిలాంటి వాడివి. ఈ వూర్లో వున్నప్పుడు మీరు, మేముకలిసి మెలసివుండి నోళ్లం. ఒకరి వుప్పు ఒకరు తిన్నోళ్లం. ఇట్టాంటప్పుడు కాక మనిషికి మనిషి తోడు కావ లసింది ఇంకెప్పుడు! అంటూ శీనయ్య తాతను ఓదార్చి, విశ్రాంతి తీసు కోయ్యా, నిద్రొస్తే నిద్రపో. ఒల్లు కుదుట పడుతుంది అని చెప్పి అక్కడ నుంచి వెళ్లింది అనసూయ.

ఈ లోగా ఏదో పనిమీద వూరికెళ్లిన వెంకన్న తిరిగి ఇంటికివచ్చాడు. రాగానే ఇంటి తిన్నెపై శీనయ్య పడుకొని నిద్రపోతున్నాడు. ఎప్పుడొచ్చాడు శీనమావ అని ఆశ్చర్యంగా అడిగాడు భార్య అనసూయను. జరిగిన విషయ మంతా భర్తకు పూసగుచ్చి చెప్పింది అనసూయ వెంకన్న మనసుకూడా వెంకన్నస్వామి లాంటి దయాసాగరం. సంఘసేవ అంటే భార్యాబిడ్డల కన్నా పరమ ప్రీతి ఈయనకు. తరతరాలుగా వీళ్లవంశం దాన ధర్మాలకు పేరు మోసింది. అలాంటి వంశాల్లోంచి వచ్చిన ఈ దంపతుల హస్తాల మీదుగా సేవలు పొందని ఇరుగు పొరుగు వాళ్లుండరంటే అతిశయోక్తి కాదు.

అనసూయ చేసిన మంచి పనికి వెంకన్న మనసు పాల సముద్రంలా ఉప్పొంగింది. పరోపకారమేకదా మానవ జన్మకు సార్థకం అనుకున్నాడు. చేనికాడికెళ్లొచ్చావా అని అడిగాడు అనసూయను. ఇంక ఈ పనితోనే సరి పోయింది, వెళ్లడానికి కుదరలేదు అంది అనసూయ. అయితే అన్నంపెట్టు. తినేసి చేనికాడికెళ్లి ఎద్దులకి కసువేసేసి బిన్నెవస్తాను అన్నాడు వెంకన్న. అనసూయ పళ్లెం తెచ్చి వెంకన్నకు అన్నం వడ్డించింది.

అంతలో వూళ్లోవాళ్లు శీనయ్యను చూడ్డానికి వచ్చారు. విషయం

అడిగారు. జరిగిందంతా వరసబెట్టి చెప్పింది అనసూయ. ఈ వూళ్లో నువ్వున్నంతదాకా ఎవ్వరికీ ఏ కొదవారాదు. ఊళ్లోకి ఏ బిచ్చగాడొచ్చినా, ఏ బికారొచ్చినా, ఏ రోగొచ్చినా నువ్వో దేవత మాదిరిగా ఆదరిస్తావుంటావమ్మా. నువ్వు నిజంగా పురాణ కాలంనాటి అనుసూయ లాంటివానివే. నీ మనసుకు మమతేగానీ మచ్చరం లేదమ్మా. నీలాంటి తల్లులు ఈ లోకంలో ఇంకా వుండారు కాబట్టే ఈ మాత్రంగానైనా లోకం నడస్తావుండాది అంటూ పూర్లోవాళ్లు అనసూయ సుగుణాల్ని, మానవ సేవానిరతిని స్తోత్రగానం చేయసాగారు.

అదే ముందిలేమ్మా! అది కనీసధర్మం. మనం చేసే మంచేమనల్ని, మన బిడ్డల్ని, ఈ లోకాన్ని కాపాడుతుంది. ఆ దేవుడు సంతోషిస్తాడు అని చెప్పింది వాళ్లకు. సరేనమ్మా, ఎళ్లొస్తాం అటూ వాళ్ల వాళ్ళ ఇళ్ళకు వెళ్లారు పూర్లో వాళ్లు.

రాత్రి 9 గంటలు అయ్యేసరికి పల్లెటూళ్ళన్నీ నిద్రాదేవి ఒడిలో పసిపాపల్లా అదమరచి నిద్రపోతాయి. శీనయ్యాకూడా నిద్రపోయినట్లున్నాడు. ఇంక నిద్రలెయ్యడని తానే శీనయ్యను నిద్రలేపి పూరునుంచి తెచ్చిన అరటిపండ్లు తినిపించాలనుకున్నాడు వెంకన్న.

మావా! మావా! అని మెల్లగా శీనయ్యను పిలిచి కదిలించి లేపాడు వెంకన్న. శీనయ్య మెల్లగా కళ్లుతెరచి చూసి ఏం నాయనా బాగుండావా! ఇట్టా అయింది నయనా నా పరిస్థితి. నాకు పుట్టినూరు మీద మనసు పడింది. సూడాలనిపించి వచ్చినాను. చివరికి ఈ గతి పట్టింది నాయనా ఈ బిడ్డనన్ను ఆసింకం అనుకోకుండా మురికిలోంచి లేవదీసుకొచ్చి సేవసేసి సేదదీర్చింది అంటూ కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు శీనయ్య.

అదేముందితేమావా! నువ్వు చేరాల్సిన చోటుకే చేరావు. మనం ఒక కులం కాకపోయినా ఆత్మీయులం. ఒకరికొకరు కావాల్సినోళ్ళం. కులం, రక్తబాంధవ్యాలకన్నా గొప్పవి ప్రేమాభిమానాలే కదమావా. నీకేం పరవా లేదు. నువ్వుబాగా కోలుకొనే దాకా ఇక్కడే వుండు. ఇది మీ ఇల్లులాంటిదే మవా అన్నాడు శీనయ్య ఒళ్ళు నిమురుతూ వెంకన్న.

ఒరే! ఎంకన్నా! మీ మాటలు, మీ సేవలు మా ఇంటిని, ఇల్లాల్ని బిడ్డల్ని మరిపిస్తావుండాయిరా. అని తన ఆత్మసంతృప్తిని వ్యక్తం చేశాడు శీనయ్య.

సరే మావాఁ! బాగా రాత్రయిపోతోంది ఇంక పండుకో అంటూ దుప్పటితెచ్చి శీనయ్యకిచ్చాడు వెంకన్న. ఆ రాత్రి అందరూ హాయిగానే నిద్రపోయారు. తెల్లవారు ఝామున వెంకన్నలేచి అలవాటు ప్రకారంగా వేంకటేశ్వర సుప్రభాత శ్లోకాలు చదివి ఆ తర్వాత పొలాలకెళ్లాడు.

అనసూయ నిద్రలేచి వాకిట్లో ఊడ్చి, కళ్ళాపుచల్లి, ముగ్గులువేసింది నీళ్ళుచేదుకొచ్చి అన్ని తొట్టెలకు, బిందెలకు నిండుగా పోసింది. బుజ్జోడికి, బుజ్జిదానికి స్నానం చేయించింది. చిట్టెమ్మకు తలదువ్వి రెండు జడలువేసి రిబ్బన్‌లతో గట్టిగా పైకి మడిచి కట్టింది. డ్రస్సువేసి ముద్దుగా తయారు చెసి బాక్సుకు అన్నం వేసిచ్చి బడికి పంపింది.

అన్నం, బీరకాయకూర కలిపి శీనయ్యకు తినిపించింది కూర శానా బాగుండాదమ్మా అన్నాడు శీనయ్య. అయితే ఇంకొంచెం తినయ్యా అంటూ బలవంతం చేసి తినిపించింది అనసూయ.

అనసూయ తనకోసం నిన్నటినుంచి ఎంతో కష్టపడుతోందని, సేవలు చేస్తోందని, ఆమెను ఇంకా కష్టపెట్టడం భావ్యం కాదని శీనయ్య సున్నితంగా ఆలోచించుకున్నాడు.

అమ్మా! అనసూయా! నన్ను ఊరికి పంపించేయండమ్మా. అక్కడ నాకోసం మనోళ్లు, మన పిలకాయలు ఎదురు చూస్తావుంటారు అనిప్రాధేయ పడ్డాడు. సరేననుకొని అనసూయ వెంకన్నతో ఈ విషయం చెప్పింది.

ఇంకా కొన్నాళ్ళు ఇక్కడే వుండమని ఇద్దరూ అడుక్కున్నారు శీన య్యను. కాని శీనయ్య తనను తన ఇంటికి చేర్చేయుమని తొందర చేశాడు. అందువల్ల వెంకన్న పొరుగూరికెళ్ళి ఎద్దులబండి కట్టితోలుకొచ్చాడు. ఆ బండిలో కసువునూ ఒత్తుగా పరుపులాగా పరచి దానిపై దుప్పటివేసి శీన య్యను కూర్చోబెట్టాడు వెంకన్న. శీనయ్య బండ్లో దిగులుగా కూర్చున్నాడు.

వెంకన్న బండి తోలడానికి సిద్ధమయ్యాడు. తనను సాగనంపడానికి వచ్చిన అనసూయకు చేతులెత్తి దండం పెడుతూ, కనిపించినంతమేరకు ఆమెనే చూస్తూ ఆత్మీయతా బాష్పాలు రాల్చుతూ వెళ్ళాడు శీనయ్య.

అనసూయ శీనయ్య వెళ్ళిన దిక్కువైపేచూస్తూ కొయ్యబారి నిలబడి పోయింది. ఆమె మనసు శీనయ్యతోనే వెళ్ళినట్లుంది. ఇంతలో బుజ్జోడు పాలకోసం ఏడ్చాడు. వాడి ఏడుపు చెవిలో పడటంతో శీనయ్యనుంచి ధ్యాస మరలింది అనసూయకు.

సంవత్సరం దాటాక అనసూయ ఇంటికి ఉదయాన్నే ఒక నల్ల కబురు వచ్చింది. అమ్మా! నిన్నరాత్రి శీనయ్య చచ్చిపోయినాడు. మీ ఇంటినుంచి వెళ్ళినాక వాళ్ళ ఇంట్లో వాళ్ళతో — తాను చచ్చిపోతే ముందుగా ఈ వూళ్లో మీకే కబురు సెప్పమన్నాడంటమ్మా. వోళ్ళ కొలం వోళ్లకన్నా, వోళ్ళసొంత బందుగులకన్నా మీరే ఆయనకు గొప్పంటమ్మా, అందువల్ల వోళ్ల ఇంట్లో వోళ్ళు మీకే ముందుగా కబురు సెప్పమన్నారు. ఆపెకారంగా మీకే సెప్పి నానమ్మా అన్నాడు పొరుగూరునుంచి వచ్చిన తోటోడు.

శీనయ్య చావువార్త అనసూయకు పిడుగుపాటులా అయ్యింది. ఒక్క సారిగా దుఃఖంతో స్పృహతప్పి కుప్పకూలింది. చిట్టెమ్మ మంచినీళ్ళు తీసు కొచ్చి ముఖంపై చల్లి కొంచెంతాగిపించింది. అనసూయ మెల్లగా కోలుకుంది. తాను చేసిన సేవను ఎంతగొప్పగా గుర్తుపెట్టుకున్నాడు! తన గుండెలో ఎంత స్థానమిచ్చాడు శీనయ్య అంటూ ఆయన్ను తలచుకొని కన్నకూతురులాగా గుండె బాదుకొని ఏడ్చింది అనసూయ.

ఎలాగో కొంత నిబ్బరించుకొని పరుగుపరుగున చేనికాడికెళ్ళి తనభర్త వెంకన్నకు ఈ వార్త చెప్పింది. హడావుడిగా ఇంటికొచ్చారు ఇద్దరూ. భర్తను బిడ్డల్ని తోడుపెట్టుకొని శీనయ్యను చివరిచూపు చూడటానికి బయలు దేరింది అనసూయ.

కోస్తావాణి

5-10-1989

# అనుబంధం



'అక్కా! చల్లగా గాలివీస్తోంది. ఆ మల్లె పందిరి కింద మంచం వేసుకొని కొంతసేపు పడుకుందాం రా' అని ఐదవ తరగతి చదువుతున్న వకుళ తన అక్క వసుమతిని పిలిచింది. 'అలాగే పద—మంచం అక్కడికి జరుపుతా'నన్నది వసుమతి.

ఇద్దరూ మంచంపై దుప్పటి పరచుకుని, దిండు వేసుకుని పడుకున్నారు. వసుమతి తన చిన్నారి చెల్లెలు వకుళ నుదుటిపైవున్న ముంగురులు నిమురుతూ 'చిన్నీ! ఈ రోజు మీ స్కూల్ విశేషాలేంటి' అని అడిగింది. "ఏముంది! మా మాస్టారు పాఠం చెప్పారు మేము విన్నాం అంతే" అన్నది వకుళ, అంతేనా— పాఠం అయ్యాక ఇంకేమీ చెప్పలేదా మీ మాస్టారు? ఆఁ చెప్పారు. ఏం చెప్పారు? చెప్పిన పాఠాల్ని ఏరోజుకారోజు చదివేయాలని, క్రమం తప్పకుండా స్కూలికి రావాలని ఇంకా చాలా నీతి వాక్యాలు చెప్పారు. ఆహాఁ— ఇంకా ఎమన్నారో వివరంగా చెప్పు! చివర్లో కొంత టైం వుండింది. అప్పుడు మాస్టారు సరదాగా ఒకొక్కరినీ లేపి 'మీ ఇంట్లో ఎవరెవరుంటారో చెప్పండి" అని అడిగారు కొంతమంది వాళ్ళ వాళ్ళ ఇండ్లల్లో తాత, అవ్వ, అత్తయ్యలు కూడా వున్నారని చెప్పారు. మరి మన ఇంట్లో అలాంటి వాళ్లెవరూ లేరుకదా నాకు చాలా బాధకలిగింది. మన ఇంట్లోవున్న వాళ్ళపేర్లే చెప్పికూర్చున్నాను" అని వకుళ దిగులుగా అన్నది.

వకుళ చిన్నిమనసులోని పెద్దబాధను గుర్తించింది వసుమతి తనకు పన్నెండేండ్లు వచ్చేవరకు మాత్రమే జీవించిన తాతను గూర్చి తెలిసినంత వరకు చెప్పి వకుళను తృప్తి పరచాలను కున్నది వసుమతి

ఇంతలో వకుళ 'అక్కా! నీకు తాతతెలుసా?' అని అడిగింది 'తెలుసు' అన్నదివసుమతి. "అయితే నీకు తెలిసినంత వరకు తాతనుగూర్చి చెప్పవూ' అని గడ్డం పట్టుకొని మరీ అడుక్కున్నది వకుళ. "అలాగే చిన్నీ నీకు చెప్పడం వల్లనేనుకూడా తాతను గుర్తుచేసుకున్నట్లుంటుంది" అన్నది వసుమతి

మనతాత సన్నగా, తెల్లగా, పొడుగ్గా, అందంగా వుండేవారు. ఎంత బాగా పాటలు పడుతారో! ఆయన కంఠస్వరం తేనెలాగా మృదుమధురంగా వుంటుంది "యోచనా కమలలోచన" "కనకనరుచిరా కనక వసన" వంటి త్యాగయ్య కీర్తనలు, "బ్రహ్మకడిగిన పాదము" అనే అన్నమయ్య కీర్తన, "ఒకపరి ఒకపరి ఒయ్యారమై" అనే అన్నమయ్య పాటగా ప్రసిద్ధికెక్కిన పెదతిరుమలయ్య సంకీర్తన, ఇంకా ఎన్నో తత్త్వాలు, శ్లోకాలు, పద్యాలు, దండకాలు తరచూ పాడుతుండేవారు మన తాత గళం విప్పితే ఊర్లో వాళ్ళందరూ గుమికూడి ఎంతో శ్రద్ధగా విని తన్మయత్వం చెందేవారు.

"అక్కా! తాత సంగీతం నేర్చుకున్నారా?" "సంగీతం మాట అటుంచు. అసలు తాతను బడికేపంపలేదు వాళ్ళ పెద్దలు. తాతకు చదువంటే చాలా ఇష్టం. అందువల్ల చదువుకున్న వాళ్ళనడిగి అక్షరాలు నేర్చుకునేవారు. శ్రుత పాండిత్యం అపారంగా వుండేది. ఎవరైనా ఏమైనా చెబితే అప్పటికప్పుడు విని దాన్ని ఆశువుగా చెప్పేసే ధారణాశక్తి విశేషంగా వుండేది. స్వయంగా పాటలు, పద్యాలు కూడా అల్లేవారు. అలా మన తాత బంధుమిత్రాదుల్లోను, చుట్టుప్రక్కల గ్రామాల్లోను సహజ సంగీత పండితుడుగా ప్రఖ్యాతి గాంచారు" అని వసుమతి ధారాపాతంగా చెబుతుంటే వకుళ చిన్నపిల్లకావడం వల్ల మధ్యమధ్యలో అడ్డుపడుతూ తన సందేహాల్ని అడుగుతోంది.

అక్కా! నువ్వుతాతదగ్గర ఏమీనెర్చుకోలేదా? చాలా నేర్చుకున్నాను చిన్నీ! ఊహ తెలిసినప్పటినుంచీ తాత నన్ను తన ఒడిలో కూర్చోపెట్టుకొని ఎన్నో పద్యాలు, పాటలు నేర్పించారు తాను నాకు నేర్పించడమేకాక నేను చదివే తెలుగు, ఇంగ్లీషు, హిందీ పాఠాల్లోని విషయాల్ని, పద్యాల్ని వినివిని తిరిగి వల్లించేవారు. ఆం అన్నట్లు తాతమంచి చిత్రకారుడు కూడా. నేను ఆరవ తరగతిలో వున్నప్పుడు ఎన్నో సైన్సు బొమ్మలు నా నోట్ బుక్‌లో వేసిచ్చేవారు. నేను వాటిని మా సార్లకు చూపిస్తే చాలా బాగున్నాయని మెచ్చుకునేవారు.

తాతలో అంతశక్తి ఉందాక్కా! ఔను చిన్నీ! నువ్వు ఇప్పుడువిన్నవి చాలా తక్కువ తాత నాటకాలుకూడా వేసి స్థానికంగా జనాల్ని మెప్పిం

చారు. వసుదేవుడుగా, కంసుడుగా, యశోదగా ఇంకా ఎన్నో పౌరాణిక స్త్రీ పురుష పాత్రలు ధరించి ప్రశంసలందుకున్నారు.

అక్కా! నువ్వు తాత నాటకాలు వేస్తున్నప్పుడు చూశావా? నేను అప్పటికి పుట్టనేలేదు. తాత, నాన్న, అప్పట్లో నాటకాల్ని చూసిన పెద్దలు నాతో చాలాసార్లు చెప్పారు. అయితే మనం కళాకారులం అన్నమాట. ఔను మనం వృత్తిపరంగా రైతులం. ప్రవృత్తి పరంగా కళాకారులం. ఆ పేరు నిలవాలంటే మనం ఇప్పుడు కళల్ని శాస్త్రీయంగా అభ్యసించి, కళాప్రద ర్శనలు చేసి ప్రజల్ని ఆనందింపచేయాలి. అక్కా! అయితే నేను సంగీతం, నృత్యం నేర్చుకుంటాను. "మన పల్లెలో అవిలేవు కదా. ప్రస్తుతం వున్న చదువుల్ని చదువు. తర్వాత వాటిని గూర్చి ఆలోచిద్దాం" అన్నది వసుమతి.

ఇలా తాతను గూర్చి అక్కా చెల్లెళ్ళ సంభాషణ సెలయేటి గలగలలా సాగుతుంటే వాళ్ళఅమ్మ మనోరమ అక్కడికి వచ్చింది. "లెండమ్మా స్నానంచేసి అన్నంతిని చదువుకోండురు. రేపు తరగతిలో మాస్టారు అడిగే ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలికదా. ఉండమ్మా! ఇప్పుడు ఆరుగంటలేగా అయ్యింది. నేను తాతను గూర్చి అక్కనడిగి తెలుసుకుంటున్నాను. "అయితే నేనూ వింటాను. మీ తాత ఎంత మంచివారో! నన్ను ఏ రోజూ కోడలుగా చూసుకోలేదు. కన్నబిడ్డలాగా ఎంతో దయతో చూసుకునేవారు. ఆయనకు మీనాన్న ఒక్కరే కొడుకు. మీనాన్న నన్ను ఎప్పుడైనా ఏమైనా అన్నాకూడా ఊరుకోరు. తాత పాటలు పాడుతుంటే మనసులోని బాధలన్నీ గువ్వల్లా ఎగిరిపోయేవి. ఎంతబాగా నిద్రపట్టుతుందో!" అని ఏక బిగిన మనోరమ చెప్పి వూరుకున్నది.

"అక్కా! నువ్వు తాతనుగూర్చి ఇంకా చెప్పవే" అన్నది వసుళ బుంగమూతిపెట్టి "నీకు వినాలనే ఆసక్తి వుండాలే గానీ తాతను గూర్చి ఎన్ని గంటలైనా చెబుతాను' అన్నది వసుమతి

ఒకసారి మా స్కూల్లోని పిల్లలందరిని మా పెద్ద మాస్టారు 'లవకుశ' సినిమాకు పిలుచుకొని పోవాలనుకున్నారు. పెద్దలు అవసరమైనంత

డబ్బు వాళ్ళ పిల్లలకిచ్చి మాస్టారుతో పాటు పంపారు. మన ఇంట్లో తాత నన్ను ఒక్కదాన్నే పంపడానికి ఇష్టంలేక తానుకూడా సినిమాకు వచ్చి నన్ను ప్రక్కనే కూర్చోపెట్టుకున్నారు. మాస్టారు, స్కూల్ పిల్లలు అందరూ వాళ్ళ తాతకు ఈ మనుమరాలంటే ఎంత ప్రాణం! అని చెప్పుకున్నారు.

అంతమంచి వారాక్కా మనతాత! చాలామంచి వారు చిన్నీ! నేను స్కూల్ నుంచి రావడం కొంచెం ఆలస్యమైనా వేంటనే బయలుదేరి వచ్చే స్తారు. నేను ఆరవ తరగతినుంచి చదవడానికి నాలుగు మైళ్ళ దూరం నడిచి వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు తాత ఏ నియమం పెట్టారో తెలుసా! 'నువ్వు పిడికెడు మెతుకులు కూడా తినలేవు. నువ్వేం నడుస్తావు అంత దూరం! నువ్వునడవాలంటే నీకు బాగా శక్తికావాలి. కాబట్టి పెద్ద పళ్లెం నిండా అన్నం ఒక్కసారిగా తింటే నిన్ను బడికి పంపిస్తాను' అన్నారు. అప్పుడు నేనేంచేశానో తెలుసా! మూడు సార్లుగా ఆ అన్నం కష్టపడి తిని ఒక్కసారే తినేశానని చెప్పేశాను. "ఏమ్మా! నిజమేనా"? అని అమ్మను అడిగారు తాత "ఔనని చెప్పమ్మా' అని అమ్మకు కళ్ళతో సైగచేశాను. "ఔనయ్యా! నిజమే అన్నది అమ్మ, థాంక్స్ గాడ్ అనుకొని దేవుడికి దండం పెట్టుకున్నాను.

అయితే తాత భలేగట్టివారనమాట గట్టివారే కాదు చిన్నీ భలే కోపిష్టి కూడా. నేను గాని ఎండల్లో తిరిగినట్లు తెలిసినా, సరిగ్గా అన్నం తినలేదని తెలిసినా 'వసుమమ్మా! అంటూ ఒక్కసారి కళ్ళు వురిమి చూశారంటే ఆ రోజురాత్రి నాకు జ్వరం వచ్చేసేది. అయితే తాత ఏది చెప్పినా, ఏదిచేసినా ఎంత కోపగించినా నా కోసమే కాబట్టి నేను ఏమీ బాధపడను పైగా తాతంటే నాకు ప్రాణం. ఎప్పుడు పాదాలు నొప్పిపుట్టినా నేను పాదసేవచేసి తాతకు సంతోషం కలిగించే దాన్ని. ఏ పని చెప్పినా చేసేదాన్ని. అంత అవ్యాజానుబంధం మా తాతా మనవరాళ్ళది.

ఒకరోజు ఏమయిందో తెలుసా! తాతకు ఎందుకో తాను చనిపోతాడనే సందేహం కలిగింది మమ్మల్ని, బంధువుల్ని, ఊర్లో వాళ్ళను అందరినీ పిలిచి కన్నీరు మున్నీరుగా ఏడ్చారు. "నాకుఒక్కడే కొడుకు, వాడి తల్లి చిన్నప్పుడే శాశ్వతంగా కన్నుమూసింది. అప్పటి నుంచీ నెనె తల్లినై పెంచి

పోషించి వాడిపై వూపిరి పెట్టుకున్నాను. నేనుపోతే వాడు ఒంటరిగా ఎలా బ్రతుకుతాడో ఈ వూర్లో మీరందరూ వాణ్ణి మీ తోబుట్టువుగా చూసి కష్టాల్లో ఆదుకోండి' అని చేతులెత్తి దండం పెట్టారు.

"ఊరుకో రామన్నా! ఏడవద్దు మేమంతా వున్నాం కదా. మీ ఆశ్ర యంలో మీ వుప్పుతిని బ్రతికినోళ్ళం. కష్టాల్లో ఆదుకోకపోతే ఆ దేవుడు మమ్మల్ని క్షమించడు, అయినా నువ్వు నూరేండ్లు కాదుకదా అంతకుపైబడి కూడా బ్రతకాలి నీ మంచి తనం వల్లనే, నీ దయ వల్లనే మేమంతా సుఖంగా వుంటున్నాం, ప్రాణం పోతుందని సందేహించద్దు రామన్నా, ఆ దేవుడు ధర్మరాజులాంటి నిన్ను చల్లగా చూస్తాడు,' అని గుమికూడిన వాళ్ళలో వెంకన్న, నాగన్న ముందుకు వచ్చి తాతను ఓదార్చారు. భగవం తుని దయవల్ల తాతకు ఏమీకాలేదు. మళ్ళీ మామూలు స్థితికి వచ్చారు. చిన్నీ! నిద్రపోతున్నావా ఏంటి? లేదక్కా! కళ్ళుమూసుకుని నువ్వు చెప్పే దంతా శ్రద్ధగా వింటుంటే తాత కళ్ళకు కట్టినట్లు కనిపిస్తున్నారు. ఇంకా చెప్పక్కా! తాతన గూర్చి.

చిన్నీ! నేను నాల్గవ తరగతి చదివేటప్పుడు మన 'కృష్ణ' పుట్టాడు. 'అంటే అన్నా'! 'ఔనమ్మా!' మనవడు పుట్టిన సంతోషంలో తాత ఎగిరి గుంతులేసి వూరంతా చాటిచెప్పి వచ్చారు అందాల చంద్రుడు పుట్టిన ఆనందంలో సముద్రుడు సంతోష తరంగాలతో వుప్పొంగి పోయినట్లు సంబ రపడిపోయారు. ముద్దుల మనవడికి 'కృష్ణ' అనేపేరు పెట్టి కృష్ణా! కృష్ణా! అంటూ కిందదించకుండా చేతుల్లోనే పెట్టుకొని పెంచారు. వచ్చీరాని చిలక పలుకులు పలుకుతుంటే ఆశ్చర్యపడేవారు ఎప్పుడూ వీధి అరుగుపై కూర్చోపెట్టుకొని కోలాటం పాట అడుగులు నేర్పించేవారు, 'కృష్ణా! తైతక్ తాథిమిత' అంటేచాలు రెండేళ్ళ మనవడు ముందు వెనకలకు మార్చి మార్చి అడుగులు క్రమబద్ధంగా వేసేవాడు గారాల మనవడి బాల్య చేష్టల్ని చూసి ఎంత పులకించి పోయేవారో మనతాత ఈ దృశ్యం ఇప్పటికీ నా కళ్ళముందు కదలాడుతున్నట్లే వుంటుంది చిన్నీ!

అక్కా! నువ్వు ఎంతో అదృష్టవంతురాలివి. తాతను చూడగల్గావు. నాకైతే అదికూడా లేదుకదా. మన చేతుల్లో ఏముంది చిన్నీ' నీ తృప్తికోసం

తాతనుగూర్చి తెలిసినంతవరకు చెబుతున్నాను. తాతను తెచ్చి చూపించ లేనుకదా. తాత ఇంకా చాలాకాలం బ్రతికి వుండాల్సింది. మన దుర దృష్టం అలా వుందిమరి. ఆయన తర్వాత తాతలాంటి మానవతామూర్తి నాకెప్పుడూ కనిపించలేదు చిన్నీ!

తాత మనసు వెన్నలాంటిది. నేను ఎండల్లో స్కూల్‌కి వెళ్ళుతున్నా నని ఎంతో బాధపడేవారు. చెప్పులు, గొడుగు తీసివ్వమని నాన్నను బలవం తం చేసేవారు. వసుమమ్మ ఆరవతరగతిలో చేరిందని, పెద్ద చదువుకెళ్ళు తోందని, పూరింట్లో వుండకూడదని, దీపం వెలుగులో పొగల సెగలలో చదవడం కష్టమని త్వరలో మేడకట్టి, విద్యుద్దీపాలు ఏర్పాటుచేయాలని అనేవారు. ఇంకా వ్రాసుకోవడానికి టేబుల్, కుర్చీ అమర్చాలని, మంచి బట్టలు, చేతికి గడియారం, మెడలో బంగారు గొలుసువెయ్యాలని నాన్నతో ఎప్పుడూ చెబుతుండేవారు. నన్ను గొప్ప 'హరికథా కళాకారిణి'గా తీర్చి దిద్దాలని తాత కోరిక. నేనేమో డిగ్రీ చదువులు చదివాను. ఇవేవీ చూడ కనే తాత పైలోకానికి వెళ్ళిపోయారు. ఇలా సుదీర్ఘంగా అక్కా చెల్లెళ్ళ సంభాషణ ప్రవాహినిలా సాగుతుంటే చేను దగ్గరనుంచి వాళ్ళ నాన్న ఇంటికివచ్చాడు.

'వకుళా! ఇలారా' అని పిలిచాడు వకుళతండ్రి రాజన్న. చదువుకో కుండా పడుకున్నావా అని కసరాడు. ఈ వరదాకా చదువుకొని ఇప్పుడే పడుకున్నానని చెప్పినాన్న కోపంనుంచి తప్పించుకున్నది వకుళ. అక్క ఏం చేస్తోంది?'తాతను గూర్చి చెబుతోంది నేనుపడుకొని వింటున్నాను' అన్నది.

వాళ్ళనాన్న పేరు ప్రస్తావనకు రాగానే రాజన్నమనసు ఆవేదనతో నిండిపోయింది. కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. "బాల్యం నుంచి ఎంతో అపురూపంగా తల్లిలా పెంచారు నాన్న. అలాంటి నాన్న నన్ను ఒంటరివాణ్ణి చేసిఎలా వెళ్ళాడో'! అని వెనకటిరోజుల్ని తలచుకున్నాడు. 'సరేవెళ్లి అక్క చెప్పేది వినమ్మా' అన్నాడు రాజన్న వకుళతో.

వకుళ పరుగెత్తుకుంటూవచ్చి అక్క పక్కన పడుకొని మళ్లీ తాతను

గుర్చి చెప్పమన్నది. చిన్నీ! తాతను గుర్చి నాకు ఇంతకన్నా పెద్దగా తెలియదు. తాతచనిపోయేటప్పుడు ఎలా వున్నారక్కా మీరంతా! ఎలా వుంటాం చిన్నీ! ఇంట్లో దీపం ఆరిపోయినట్లు, కుడి భుజం పడిపోయినట్లు, సముద్రం పొంగివచ్చి ముంచేసినట్లు ఎన్నో రకాలుగా విలవిలలాడి పోయాం. ముఖాలు వాచిపోయేలా ఏడ్చాం. అప్పుడు నేను చిన్న పాపనే అయినా బాగాగుర్తుంది. ఆరోజు రాత్రి తాత వీధి అరుగుపై కూర్చొని హరికథ విన్నారు. తర్వాత ఆయన మంచంపై యథావిధిగా పడుకున్నారు. ఆరోజు తెల్లవారుజామున నాన్న చేను దగ్గరికి వెళ్లడానికి లేచారు. తాత కిందపడుకొని వున్నారు. తాత చెయ్యి మెలికపడివుంది. ఆ చేతిని తీసి సరిగ్గా పెట్టాలని పట్టుకునేసరికి బాగా చల్లబడిపోయింది. పెనుగాలికి చెట్టు కూలిపోయినట్లు నాన్న స్పృహతప్పిపడిపోయారు. తాత గతించిన వార్త తెలిసిన జనాలు ప్రవాహంలా వచ్చారు. ఆ నాటినుంచి దాదాపు ఒక్క సంవత్సరం వరకు రాత్రింబవళ్లుగా ఏడ్చి ఏడ్చి చిక్కిపోయారు నాన్న. ఇంట్లో పరిస్థితులు ఎలా వున్నా ప్రతి ఏటా తాత పేరుతో హరికథలు, అన్నదానాలు, రామ భజనలు చేయిస్తున్నారు నాన్న.

అక్కా! తాత మంచం మీదనుంచి ఎందుకు కిందపడి చనిపోయారో చెప్పవూ! మంచం మీదపడుకొని చనిపోకూడదనే విశ్వాసం ఏదో వుండి వుండవచ్చు తాతకు మరణ సమయం తెలిసిపోయింది. మాకు చెబితే భరించలేమని చెప్పివుండరు. లేక ఈ లోకం గుర్తుకు వచ్చివుండదు. చిన్నీ తాతావాళ్ల అమ్మకు కూడా మరణ కాలం తెలిసిందని నాన్న చెప్పేవారు. అయితే ఆమె చూడాలనుకున్న వారందరిని పిలిపించుకుని అందరినీ చూసి ప్రాణం విడిచిందని కూడా చెప్పారు. అలా ఏదో మహనీయత తాతకూ సంక్రమించి వుంటుంది.

ఏంటో చిన్నీ! నువ్వు ఈ రోజు నా చేత తాతను గుర్చి చెప్పించుకున్నావు. నీకు తెలుసుకున్నాననే తృప్తి కలిగింది కానీ నాకు మాత్రం మనసంతా ఆందోళనగా వుంది. తాతను తలచుకోవడం గొప్ప స్ఫూర్తే అయినా ఆయన మనమధ్యలేడనే బాధనన్ను కుంగదీస్తోంది. తాతలేకుండా ఎలా బతుకుతున్నామో అనే ఆలోచన కలుగుతుంటుంది భగవంతుడు

ఎలా విధిస్తే అలా మనం జీవించాలి కదా అనినన్ను నేను ఓదార్చుకుంటూ వుంటాను.

అక్కా! ఆకలేస్తోంది. తాతనుగూర్చి ఇంకా రేపు వింటాలే. లెయ్య వెళ్లిభోజనంచేద్దాం. "తాతనుగూర్చి విన్నాకకూడా ఇంకా ఆకలేస్తోందా చిన్నీ! నువ్వువెళ్లితిను. నాకు ఆకలిగాలేదు. నాకు అన్నంవద్దు' అన్నది వసుమతి. తన తాత చనిపోయి ఇరవై ఏండ్లు దాటినా, తనకు తాతతో పన్నెండు ఏండ్లు మాత్రం అనుబంధం వున్నా వసుమతి హృదయంలో అమృత భాండలా తరగని ముద్రవేసుకున్నాడు రామన్న. ఆ రాత్రంతా తన తాతను తలచుకుంటూ ఉపవాసం ఉండి పోయింది వసుమతి.



కోస్తావాణి

20-9-90

# ఎగ్రగులాబి



'ఈనాటి చిన్నారులే రేపటి పెద్దలు కాబట్టి వాళ్ళ బంగారు భవిష్యత్తుకు, ఆదర్శభావాలకు బాల్యం నుంచే పునాదులు వెయ్యాలి. 'మొక్కై వంగనిదే మానై వంగునా" అన్నట్లు ఊహతెలుస్తున్నప్పటినుంచె పిల్లల్ని క్రమబద్ధంగా తీర్చిదిద్దాలి కానీ పెద్దైన తర్వాతవాళ్ళను మార్చలేం" అన్నది మయూరి.

"నిజమే పద్మినీ, ఏం చెయ్యమంటావ్ చెప్పు! మావాడు నామాట బొత్తిగా విననేవినడు. కొట్టినా, తిట్టినాకూడా భయపడడు. వాళ్ళ నాన్న అంటేకూడా భయమే లేదు వాడికి. వాణ్ణి కంట్రోల్ చెయ్యలేకపోతున్నాను పిల్లవాడి మీద విసుగ్గా మాట్లాడింది పద్మిని.

"కన్న తల్లిదండ్రులు మీరే వాణ్ణి మార్చలేకపోతే ఎలా? పిల్లలు రబ్బరు బొమ్మలాంటి వాళ్ళు మనం ఎలా తిప్పితే అలా తిరుగుతారు. ఒక్కోసారి కోతుల్లా ఇల్లంతా గందరగోళం చేస్తారు. వాళ్ళను మంచి దారిలో పెట్టాలంటే ముందుగా పెద్దవాళ్లకు జ్ఞానం, ఓపిక, శ్రద్ధ చాలా అవసరం. జన్మతః కొంతమంది పిల్లలు చాలా అల్లరి చేస్తుంటారు. ఇలాంటి వాళ్లను నయానా భయానా లొంగదీసుకోవడం కూడా ఎంతో కష్టం".

"అదే కదా నేను చెబుతున్నదిమయూరి' అలా అని పిల్లవాణ్ణి చక్క బెట్టక వదిలేస్తావా ఏంటి పద్మినీ' "వాళ్ల ట్యూషన్‌మేడంకు చెప్పి భయ పెట్టిస్తాను" "అప్పుడు వాడు ట్యూషన్ మేడం ఉన్నంత వరకే భయంగా ఉంటాడు అంతే" "అయితే ఏం చెయ్యమంటావ్ చెప్పు" "ముందువాణ్ణి కదలకుండా ఒక పదినిమిషాలు కూర్చునేలా చెయ్యి. అదికూడా చేతులు కట్టుకొని పద్మాసనం వేసుకొని. "తర్వాత ఏం చేయించమంటావ్?" "వాడి కెదురుగా ఒక రాముడి ఫోటోనో కృష్ణుడు ఫోటోనో పెట్టి కొంత సేపు ఏకాగ్రతగా చూసేలా చెయ్యి" "తర్వాత....!" "ఏదైనా ఒక భక్తి పద్యం చెప్పించు, ఇలాకొన్నాళ్లు వాడిచేత చేయించు. ఆ తర్వాత వాణ్ణి గమనించు, తప్పకుండా మార్పు కనిపిస్తుంది."

ఇలా మయూరి పద్మిని ఇద్దరూ పిల్లవాడి అల్లరినిగూర్చి, వాణ్ణి అదుపుచేసే మార్గాన్ని గూర్చి సంభాషిస్తున్నారు. సాయంత్రం నాలుగు గంటలయింది స్కూల్‌నుంచి అందాల చిలిపి కృష్ణయ్యలా కేరింతలు కొడుతూ గోపివచ్చాడు. వచ్చీరాగానే పుస్తకాల బ్యాగ్‌ను ఇంట్లో విసిరి కొట్టాడు చేతులు,కాళ్ళు ముఖం కడుక్కోకుండానే వంట గదిలోకెళ్ళి గ్లాసు తీసుకొని నీళ్ళబిందెలో ముంచబోయాడు.

మయూరి చూసి గబగబాలేచి వెళ్ళి గోపిచేతిలోంచి గ్లాసు తీసుకొని తాను బిందెలోంచి నీళ్ళుముంచిచ్చి తాగించింది 'ఏంగోపీ! స్కూల్‌నుంచి ఇంటికి రాగానే కాళ్ళుచేతులు కడుక్కోవాలని తెలియదా' 'ఊహు— నేనెప్పుడూ ఇలాగేవచ్చి తాగుతా' 'ఇలా మురికి చేతులతో నీళ్ళుముంచి తాగ కూడదని అమ్మ చెప్పలేదా?" "ఊహు" అని తల అడ్డంగా తిప్పుతూ "అమ్మ ఎప్పుడూ చెప్పలేదు" అన్నాడు గోపి.

"పద్మిని బి.ఎ. వరకు చదువుకొని కూడా ఇంతబండగా ఉందేంటి? బిడ్డను పదినెలలు మోసి కనింది. ఆ మాత్రం బిడ్డను ఎంత జాగ్రత్తగా పెంచాలో, ఎలాంటి అలవాట్లు నేర్పించాలో కూడా తెలియదా? తల్లులే ఇంత బద్ధకంగా ఉంటే పిల్లలు ఇంకెలా తయారవుతారు'? అని మనసులో తర్కించుకుంటూ కాసేపు నీళ్ళబిందె దగ్గరే నిలబడిపోయింది మయూరి

మయూరి వంటగదినుంచి ఇంకా రాలేదేంటా? అనుకుంటూ మయూరిని పిలిచింది పద్మిని. పద్మిని వచ్చింది. "ఏంటి పద్మినీ! ఏం చేస్తున్నావ్ వంటగదిలో" "వంట చేస్తున్నా." "పరిహాసం వద్దుగానీ నిజం చెప్పుతల్లీ" "నిజం చెప్పమంటున్నావ్ కాబట్టి పక్కింట్లో ఉంటున్న ఆత్మీయురాలవని భావించి నిస్సంకోచంగా నీ మేలు కోరి చెబుతున్నా" "నువ్వు నా మేలుకోరే దానివని నాకు తెలుసులేమ్మా పైగా నాకన్నా ఎంతో పెద్దచదువు చదివి పెద్దకాలేజిలో ఉద్యోగం చేస్తున్న దానివికదా. నీకు చాలా విషయాలు తెలిసుంటాయి. ఆలస్యం చెయ్యకుండా చెప్పు"

"ఇదేదో పెద్ద తాత్త్వికంగానీ, బ్రహ్మవిద్యగానీ కాదు. కనీసం శుభ్రతను గూర్చి— మీ అబ్బాయిని గూర్చి ఆలోచిస్తూ ఉండిపోయాను. గోపి

స్కూల్‌నుంచి రాగానే బాత్‌రూంకి తీసుకెళ్ళి స్నానం చేయించి బట్టలు మార్చాలని తెలియదా? వాడికి దాహంవేస్తే ముంచికి చేతులు పెట్టివాడే నీళ్లు ముంచుకొని తాగాలా? నువ్వెళ్ళి నీళ్ళు తాగించవచ్చుకదా! ఈ రోజు నేను చూశాను కాబట్టి తెలుసుకున్నాను. రోజూ ఇంతేనా?" ప్రశ్నించింది మయూరి.

"అదేంటి పద్మినీ! ఇంతచిన్న విషయాన్ని కూడా ఇంత లోతుగా ఆలోచిస్తున్నావా? "ఇది చిన్న విషయమా? నీకు సైన్సు పరిజ్ఞానం అణువంత కూడా లేదు మనం ఎంతో శుభ్రంగా ఉంటూ తినే ఆహారం విషయంలో, తాగేనీటి విషయంలో ఎంత జాగ్రత్త పాటించినా మనకు తెలియకనే ఎన్నో సూక్ష్మజీవులు మనలో ప్రవేశించి మన ఆరోగ్యాన్ని పాడుచేస్తుంటాయి ఆలాంటిది తెలిసి తెలిసీ మరికి విషయంలో పట్టించు కోకపోతే ఎలా? వాడు పెరిగే పిల్లవాడు కదా ఇప్పటినుంచీ అన్ని విషయాల్లో జాగ్రత్తలు చెబుతుండాలి".

"అలాగే మయూరీ! రేపటినుంచి నీ పద్ధతుల్ని నేనూ పాటిస్తా. గోపి చేతకూడా—చేయిస్తా సరేనా!" "అదేదో నా కోసమైనట్లు". సరేలేమ్మా ఏదో అన్నాను". "అంటే అన్నావు కానీ గోపీ చేత రేపు ఉదయం నేను చెప్పినట్లుగా పద్మాసనం వేయించి, భక్తిపద్యం చెప్పించు'

"మయూరీ! నాకు పద్యాలేవీ నోటికిరావు. ఏదైనా ఒక పద్యం వ్రాసివ్వు". "నీకు ఒకటి రెండు పద్యాలు కూడా రావా తల్లీ చిన్నప్పటి నుంచీ బి.ఎ సెకండ్ లాంగ్వేజ్ వరకు తెలుగు భాష చదివావుకదా", 'అం ఏదో పరీక్షలకోసం చదివి వదిలేశాను' "అ మాత్రం ఉండనమాట నీకు చదువుపై ధ్యాస" "చదువుపై ధ్యాస లేకనేకదా బి.ఎ.తో ఆగిపోయి పెళ్ళి చేసుకున్నది." 'సరే, ఇంక నీపెళ్ళి సుత్తి ఆపు. నేను పద్యం వ్రాసిస్తాను కాగితం, పెన్ను తీసుకురా".

"నీవే తల్లివి తండ్రివి
నీవే నాతోడు నీడ నీవేసఖుడౌ
నీవే గురుడవు దైవము
నీవే నాపతియు గతియు నిజముగ కృష్ణా"

కృష్ణ శతకంలో పద్యం వ్రాసిచ్చింది మయూరి "ఏదీ ఒకసారి చదువు" అన్నది పద్మిని తప్పులుగా తడబాటుగా చదువుతూంటే మయూరికి ఒళ్ళు మండిపోతుంది ఛీ! ఇంత చిన్న పద్యం, సరళమైన పద్యంకూడా చదవ లేవా? అని కోపంతో చూసింది "తప్పయిపోయింది తల్లీ ఈ సారిబాగా చదువుతాను' అంటూ ఎలాగో సరిగ్గానే చదివింది పద్మిని.

'పిల్లలకు మనం ఏమేమి నేర్పించాలను కుంటామో అవి మనకూ బాగావచ్చి ఉండాలి. లేకపోతే వాళ్ళ దగ్గర మనం తలవంచుకోవలసి వస్తుంది. కాబట్టి వాడికి ఒక్కొక్క పంక్తి చెప్పించేటప్పుడు జాగ్రత్తగా తప్పులు లేకుండా చెప్పించు. ఇలా ఒకవారం రోజులు చేయించు గోపీచేత ఆ తర్వాత వాడి పరిస్థితి చెప్పు' అంటూ ఏదోపని ఉందంటూ ఇంటికి వెళ్ళింది మయూరి.

పద్మినికి ఆరోజు రాత్రంతా పిల్లవాణ్ని ఎలా కుదురుగా కూర్చోబెట్టడం వాడిచేత ఎలా పద్యం చెప్పించడం? అని ఒకే ఆలోచన. ఉదయం 6 గంట లకు పిల్లవాణ్ని బలవంతంగా నిద్రలేపి ముఖంకడిగి కూర్చోబెట్టింది. తుంటరి పిల్లవాడ్ని పద్మాసనం వేసి కూర్చోబెట్టడానికి పది నిమిషాలు కష్ట బడింది. ఎదురుగా ఉన్న రాముడి ఫోటోను కన్ను ఆర్పకుండా తదేకంగా చూసేలా చెయ్యడానికి పదిహేను నిమిషాలు పట్టింది. వాడిచేత పద్యం చెప్పించడానికి ఇరవై నిమిషాలు పట్టింది మొత్తానికి పిల్లవాడికోసం మయూరి చెప్పిన పద్ధతిని సాధించింది పద్మిని

ఇలా పిల్లవాడిచేత వారం రోజులు కష్టపడి చేయించింది క్రమేణ వాడంతటవాడే లేచి ఆపని చేయసాగాడు. వాడిలోని తుంటరి తనం నానాటికీ మంచులా మాయమయింది ఎక్కడున్న వస్తువులు అక్కడే సురక్షితంగా ఉండసాగాయి. బుద్ధిగా చదువుకుంటున్నాడు. పద్మినికి విసుగురాకుండా చేస్తున్నాడు. అవలక్షణాల్ని మాన్పడానికి ఔషధంలా ఉపయోగపడుతుంది కదా దైవభక్తి

'అమ్మా! కృష్ణుడి పద్యం చాలా బాగుంది. మా పుస్తకాల్లో ఇలాంటి పద్యాలుంటే బాగుంటుంది కదమ్మా!' "ఔను బాబూ"! "మరెందుకు

లేవమ్మా"! "ఏమో బాబూ కాలం మారిపోయింది కదా బ్రిటిష్ వాళ్లవల్ల ఇంగ్లీషు చదువులు వచ్చి మన చదువులు పక్కకు పోయాయి. భక్తిజ్ఞానం వచ్చే ఇలాంటి చదువులు ఇప్పుడు క్లాసు పుస్తకాల్లో ఉండవుబాబూ!" 'మరి నీకిపద్యం ఎలా తెలుసు? 'మొన్నటిదాకా నాకూ తెలియదు. మయూరి అక్కయ్య నీకు నేర్పించమని చెప్పి నాకు నేర్పించింది" ఆ అక్కకు ఇలాంటి పద్యాలు వచ్చా?". 'చాలావచ్చు బాబూ!' 'అయితే ఆ అక్కనడిగి నేర్చుకుంటా', ' నువ్వు నేర్చుకుంటానంటే నేనెందుకు వద్దంటాను గోపీ! అయితే ఆ అక్క తిరిగ్గా ఉన్నప్పుడే వెళ్లి అడిగి నేర్చుకుందువుగాని, స్కూల్‌కి టైం అవుతోందికదా. లే రెడీ అవుదువు.

పద్మిని పిల్లవాడిని స్కూల్‌కి రెడీ చేసింది. రిక్షా అతనువచ్చి గోపీని స్కూల్‌కి తీసుకెళ్లాడు.

'పద్మినీ! ఏం చేస్తున్నావ్' మయూరి కంఠస్వరం వినబడింది పద్మినికి. పద్మిని మయూరిని చూసి ఎంతో సంబరపడి పోయింది. మయూరి మీద ముందుకన్నా మిన్నగా మమతానురాగాల్ని పెంచుకున్నది.

'రా, మయూరీ! టిఫిన్ చేద్దువుగానీ' 'ఇప్పుడేమీ వద్దు. నేనూ టిఫిన్ చేశాను'. 'చేస్తేచేశావుగానీ మళ్లీ కొంచెం తిను' అంటూ మసాలా దోసె బలవంతంగా తినిపించింది పద్మిని.

'చాలా బాగుంది పద్మినీ— నీ చేతిదోసె' 'ఏంకాదు— నీ మనసు, నీ తెలివి, సూక్ష్మత ఇంకా ఎంతో బాగున్నాయి' 'అదేంటి అలా పొగిడేస్తున్నావ్' పొగడకపోతే తప్పే అవుతుంది." 'ఏంటో ఆ పొగడ్త?" మయూరీ నేను బిడ్డను మోసి కన్నానే కానీ నీకున్న బిడ్డల పరిజ్ఞానం, భవిష్యత్ ఆలోచన నాకు లేకపోయింది. అసలు నీ హృదయమే తల్లిహృదయం. ఐదారుమందితో పుట్టువుల్ని పెంచి,పెద్దచేసిన అనుభవం, జ్ఞానం నీకుంది; వారి ఆరోగ్యం, మంచీ చెడులు, చదువు సంస్కారాలు అన్నింటినీ బాగా ఆలోచిస్తావు. నువ్వు మా పక్క ఇంట్లో ఉండటం నా అదృష్టం. అందరూ నీలాగా చొరవ చేసుకొని మంచి విషయాలు చెప్పరు. నీ పుణ్యమా అంటూ గోపి చాలా బుద్ధిమంతుడయ్యాడు. నీ దగ్గరికి వచ్చి ఇంకా పద్యాలు,

పాటలు ఏవేవో నేర్చుకోవాలని తహతహలాడుతున్నాడు సాయంత్రం తీరిక చేసుకొని ఉండుమరి" అంటూ స్వాంతంగా, ఆప్యాయంగా మాట్లాంది పద్మిని

'కల్లా కపటం, మాయామర్మం తెలియని పిల్లలంటే నాకు చాలా ఇష్టం పద్మినీ. వాడికి నాకు తెలిసినవన్నీ చెప్పిస్తాను గాంధీ, నెహ్రూ వంటి దేశభక్తుల్ని గూర్చి, హరిశ్చంద్రుడు, శిబివంటి చక్రవర్తుల్ని గూర్చి దధీచివంటి త్యాగమహర్షుల్ని గూర్చి ఉయ్యాల వాడ నరసంహారావు, భగత్ సింగ్, అల్లూరి సీతారామరాజు వంటి అమర వీరుల్ని గూర్చి, రుద్రమదెవి, ఝాన్సీరాణి వంటి వీరనారీమణుల్ని గూర్చి, ఆ భగవంతుని గూర్చి ఇంకా ఎన్నో విషయాల్ని గోపీకిచెప్పి మహాత్ములపై ఆసక్తి కలిగిస్తాను. ఉత్సాహం గా చెప్పింది మయూరి.

'చాలా సంతోషం మయూరీ! నీఋణం ఎలా తీర్చుకోవాలో తెలియ డంలేదు' ఇంకా నేనేమీ చెయ్యలేను. అప్పుడే ఋణాల మాటెందుకు పద్మినీ! అయినా మన మందరం ఋణపడి ఉండాల్సింది ఆ భగవంతు డికి, త్యాగమూర్తులకు, దేశభక్తులకు'. 'ఇలా చెప్పడం నీ ఔదార్యం మయూరీ'.

'సరేలే— అదిగో గోపిగాడు రిక్షాలో వస్తున్నాడు. వాడికి కావలసిన ఏర్పాట్లు చూడు' అంటూ ఇంటికెళ్లింది మయూరి. మయూరి ఇంటి కెళ్ళ గానే పక్కింట్లో నుంచి పిల్లవాడి అరుపులు, దెబ్బల శబ్దం వినబడ్డాయి. పరుగెత్తుకెళ్ళింది మయూరి చొక్కాచింపుకొని వచ్చాడని గోపీని కొట్టుతోంది పద్మిని.

'పద్మినీ! నీకు బుద్ధుందా? ఎందుకలా వాణ్ణి గొడ్డును బాదినట్లు బాదుతున్నావ్? గోపిఏం తప్పు చేశాడు?'

'చొక్కాచింపుకొని వచ్చాడు'. అంత మాత్రానికే వాడేదో కొంపకూల్చే సినట్లు కొట్టాలా? నువ్వెళ్ళు— గోపీని నేనడుగుతాను. చొక్కాఎందుకు చినిగింది గోపీ?' 'మా క్లాసులో ఒకబ్బాయి వాడికి పెన్ను ఇవ్వలేదని బ్లేడ్‌తో చొక్కా కోసేశాడు' అని ఏడుస్తూ చెప్పాడు గోపి.

"పోనీలే ఏడవకు" అని వాణ్ణి ఓదార్చించి మయూరి మెల్లగా పద్మిని దగ్గరికెళ్ళి "పద్మినీ! పిల్లలు లేత శరీరాలు గులాబీ పువ్వుల్లా కోమలమైనవి కదా. అలా బాదేస్తే ఎలా చెప్పు? విషయం ఏంటో తెలుసుకోకుండా అంత కోపం తెచ్చుకుంటే ఎలా? ఇంకెప్పుడైనా ఇలా కొట్టావో నేను ఊరుకోను. లేచి వెళ్ళి వాడికి స్నానం చేయించి అన్నం తినిపించు వాడికి ఇప్పుడేకదా నాలుగేండ్లు పూర్తయ్యాయి. సహనంగా తల్లి సేవలు చేయక తప్పదు" అంటూ ప్రేమగా ఆదేశించి మయూరి వెళ్ళింది.

పిల్లల ప్రేమ, మానవప్రేమ, తెలివితేటలు ఉన్న మయూరితో తనకు ఇంతటి అపూర్వానుబంధం కుదిరించినందుకు భగవంతుడికి మనసులో థాంక్స్ చెప్పుకుంది పద్మిని చిన్నారులను ప్రతిబింబించే కుండీలోని ఎర్రగులాబీ పిల్లగాలికి ఊగిసలాడింది. చిరునవ్వుతో మయూరికి టాటా చెప్పింది.



కోస్తావాణి

4-5-90

# కౌ ము ది



పువ్వుపుట్టగానే పరిమళిస్తుందని, ముల్లు పుట్టగానే కూచిగా పొడుతుందని అంటారు పెద్దలు. అలాగే కౌముది పుట్టుకతోనే తెలివైనపిల్ల. బడికి పోవడమన్నా చదువుకోవడమన్నా పంచ ప్రాణాలు. జ్వరంవచ్చి ఒల్లుకాలిపోతున్నా అయ్యవార్లు బడికి రావద్దులే అని ధైర్యం చెప్పినా తాను మాత్రం బడికి వెళ్ళకుండా ఉండేది కాదు. అంతటి విద్యా సక్తి కౌముదికి. శుచి శుభ్రత, భయము, భక్తి, వినయం విధేయత ఈ సుగుణాలను ఉగ్గు పాలతో అమరాయి కౌముదికి. "వట్టిమాటలు గట్టిపెట్టవోయ్, గట్టిమేల్ తలపెట్టవోయ్ అన్న గురజాడ సూక్తి కౌముది పట్ల నూటికి నూరుపాళ్ళు వర్తిస్తుంది. కౌముది ఎవ్వరితోనూ ఎక్కువగా మాట్లాడదు.

సాటిపిల్లలు సరదాగా బొమ్మల పెళ్ళి చేస్తున్నా తొక్కుడు బిళ్ళల ఆట ఆడుతున్నా, తానుమాత్రం మరుపటి రోజు తరగతిలో అయ్యవార్లు అడిగే ప్రశ్నలకు సమాధానాలు నేర్చుకుంటూ వుంటుంది. అసలు ఆపిల్ల ధ్యాసంతా చదువుమీదే. అమ్మ పిలిచి అన్నం కలిపినోట్లో పెట్టి తినిపిస్తేతప్ప తినేదికాదు "చిన్నారి ఇక నిద్రపోరా! ఆరోగ్యం పాడవుతుంది. అని వాళ్ళ తాతయ్య బుజ్జగించి వీపుతడుతూ జోలపాట పాడనిదే నిద్రపోయ్యేదికాదు. అందరి పిల్లలకువలే ఆట వస్తువులు, బట్టలు, తను బండారాలు, సినిమాలు చుట్టాలతో సరదాలు, కబుర్లు ఇవేవీ ఆ పిల్ల కోరుకోదు. కౌముది బాల్యంలోనే బాల్యపు చేష్టల్ని అధిగమించింది కొత్త పుస్తకాలు వాళ్ళ నాన్నకొని తేవడమే తడవు అయ్యవారు పాఠాలు చెప్పకముందే అన్నీ చదివి నేర్చుకు నేస్తుంది కౌముది. అందుకే వాళ్ళ నాన్నకు కౌముది అంటే వల్లమాలిన ప్రేమ. కొడుకంటే ఎంతో మక్కువ చూపే వాళ్ళ నాన్న కౌముదినే ఒక కొడుకుగా భావించుకున్నాడు. ఇరుగు పొరుగువాళ్ళు, బంధువులు ఆడపిల్ల కుచదువెందుకు పెళ్ళి చేసుకొని అత్త గారింటికి పోతుంది. మనకు ఉపయోగం ఏమిటి? అని నిరుత్సాహపరచినా "ఆడపిల్లకూడా ఒక మనిషేనని, ఆమెకూడా చదువుకొని స్వంత వ్యక్తిత్వంతో స్వతంత్రంగా జీవించాలని, మనకు ఉపయోగం ఉన్నా లేకపోయినా అమ్మాయిని చదివించాలని

వాళ్లకు జ్ఞానోపదేశం చేసేవాడు వాళ్లనాన్న తన కౌముది చదువుపట్ల అయన ఎంతో శ్రద్ధవహించేవాడు. తాను పుస్తకాలు తీసిచ్చి బడికి పంపడం తోనే సరిపెట్టుకోక తన కూతురు ఎలా చదువుతోందో తెలుసుకోవాలని అప్పుడప్పుడు ఆఫీసర్‌లా వాళ్ల స్కూలుకి వెళ్లి అయ్యవార్లను అడిగి తెలుసుకొనేవాడు. అయ్యవార్లు కౌముది చదువుపై సంతృప్తిని వ్యక్తం చేయగానే ఆనందంతో పాలవెల్లిలా ఉప్పొంగిపోయేవాడు. పొలంలో తానుపడే కష్టాలన్నీ మరచిపోయేవాడు. తన కౌముది ఎంతవరకు చదువుకుంటుందో అంతవరకు చదివించాలని అతని ఆశయం.

కౌముదిపై తన ప్రేమను బట్టబయలుచేస్తే ముదిగారాబంతో ఎక్కడ చదువు మానేసి పాడయిపోతుందో అని శంకించి కౌముదిపై లాలనచూపేవాడు కాదు వాళ్లనాన్న. అయన కొంత కఠిన వైఖరినే అవలంబించేవాడు. బంధువుల ఊర్లకు, సినిమాలకు పంపించేవాడు కాదు. ఎవరైనా ఇంటికి వచ్చినా కౌముదిని వాళ్లకు దూరంగా ఉంచేవాడు. పలకరించాలనుకుంటే చదువుల్ని గూర్చే అడగమని చుట్టాలకు షరతులు పెట్టేవాడు. కౌముదిని ప్రతిరోజూ తెల్లవారుజామున 4 గంటలకులేపి కూర్చోబెట్టి వేంకటేశ్వర సుప్రభాతం, శ్యామలాదండకం, సుమతి శతకం, దాశరథి శతకం మొదలయిన దేశభక్తి, జ్ఞాన, నీతిబోధక పుస్తకాల్ని చదివించేవాడు. వీటిని చదవడంవలన మానసిక నిశ్చలత్వం, బుద్ధివికాసం కలుగుతుందని అయన విశ్వాసం. కౌముది నాన్న మాటకు ఎదురాడక చెప్పినట్లు చేస్తుంది నిద్రమత్తులో తనకు తూగు వస్తున్నా నాన్న భయంవలన లేచి మంచినీళ్లతో ముఖం కడుగుకొని కిరోసిన్ దీపం ముందు కూర్చొని శ్రద్ధగాచదివేది ఎక్కడయినా పొరపాటున తప్పులు చదువుతుంటే వాళ్లనాన్న హెచ్చరికలు చేస్తూ సవరించేవాడు.

కౌముది తరగతి పాఠాలైనా, భక్తిపద్యాలైనా చదువుతుంటే చుట్టుప్రక్కలవారంతా వచ్చి ఇంటి అరుగుపై కూర్చొని ఆలకించేవారు. అంత శ్రావ్యంగా, స్పష్టంగా, గట్టిగా చదువుతుంది కౌముది. కౌముదికి వాళ్ళ బడిలో ఎవరికీ రానన్ని శ్లోకాలు పద్యాలు, దండకాలు. పాటలు వస్తాయి. వాళ్ళ బడిలో ప్రతిరోజూ ఉదయం "వందేమాతరం" అనే దేశభక్తి గీతం

పాడేది కూడా కౌముదియే. ఆ స్కూల్ సందర్శనం కోసం, చెకింగు కోసం ఎవరైనా పెద్దలు, ఆధికార్లు వస్తే తమ స్కూల్ ప్రతిభ కోసం అయ్యవార్లు కౌముది చేత పాటలు పాడిస్తారు. పద్యాలు చెప్పిస్తారు. వాళ్ళు "సెబాస్" అని ప్రశంసిస్తుంటే దీనికి కారణం తాతయ్య, నాన్నేకదా అని మనసులో తలచుకొని వాళ్ళపై ప్రేమ, గౌరవాలు పెంచుకునేది కౌముది. వాళ్ళ స్కూల్‌లో సంవత్సరాంతంలో పెట్టే ఆటల పాటల పోటీల్లో, తెలివి తేటల పోటీల్లో, విద్యా సంబంధ చర్చల్లో అన్నింటిలోను బహుమతులు గెలుచుకునేది చిన్న చిన్న నాటకాల్లో నృత్యాలల్లో పాల్గొని తన నైపుణ్యంతో అందరినీ మురిపించేది. వాళ్ళ స్కూల్‌లో అందరూ అయ్యవార్లకు సాటి విద్యార్థులకు కౌముది అంటే ఎంతో ప్రీతి.

కౌముది చదివే బడిలో ఒక ఆచారంలాంటిది ఉండేది. అది సదాచారమనే చెప్పాలి. విద్యార్థుల్లో ఎవరు బాగా చదివితే వాళ్ళను ముందు బెంచీలో మొదటగా కూర్చోబెట్టేవారు వాళ్ళ అయ్యవారు. కౌముది ఎప్పుడూ మొదటి బెంచీలోనే మొదటి సీటులోనే ఉండేది ప్రతిరోజూ ఇంగ్లీషు, తెలుగు, లెక్కలు మొదలయిన సబ్జెక్టుల్లో విద్యార్థుల్ని నోటి ప్రశ్నలు అడుగుతుంటారు వాళ్ళ అయ్యవార్లు. సమాధానాలు చెప్పనివారిని చెప్పిన వారిచేత చెంపదెబ్బలు వేయిస్తారు. ఆ విధంగా ప్రతిరోజు కౌముది తరగతిలో అందరికి చెంపదెబ్బలు వేయవలసివచ్చేది. కౌముది అసలే వెన్నెలవలె చల్లని మనస్సు కలిగిన అమ్మాయి. సాటి పిల్లల చెంపలపై గట్టిగా కొట్టాలంటే కౌముదికి చేతులాడవు. అందువల్ల అయ్యవారు అటూఇటూ చూస్తుండగా చందనం పూసినట్లు గబగబా చెంపలు తాకించి తనసీట్లో వచ్చి కూర్చొనేది కొంత మంది కఠిన మనస్సు కలిగిన పిల్లలు గట్టిగా కొడుతుంటారు. అందువల్ల వాళ్ళ కఠినత్వానికి నొచ్చుకున్న వాళ్ళు కౌముదిని జాబిలిగా భావించి ప్రేమగా చేరువయ్యేవారు. కౌముదిని రాచబిడ్డ అంతటి గొప్పగా చూసుకునేవారు.

కౌముది పది సంవత్సరాల వయస్సు వరకు వాళ్ళ అమ్మా నాన్నలకు ఒక్కటే కూతురు. వాళ్ల అమ్మా నాన్నలకు, తాతయ్యకు కౌముది అంటే ఊపిరి. వాళ్ళ అమ్మ ఎర్రతామర పువ్వులాంటి కౌముది ముఖాన్ని

తన చేతిలోకి తీసుకొని బొట్టు కాటుకలు తీర్చి దిద్దుతుంది. చక్కగా తల దువ్వి రెండు జడలు వేసి ఎర్రటి రిబ్బన్‌లతో కట్టి చూడముచ్చటగా ముచ్చటవేస్తుంది. రెండు జడలలోను పువ్వులు పెట్టి సింగారిస్తుంది. కౌముది తలలో పువ్వులు లేనిరోజు ఎప్పుడూ కనిపించదు. కౌముది అందాల బరి బిలా, ఒయ్యారాల హరిణిలా సుందరంగా ఉంటుంది. అందరి కన్నా మిన్నగా చదువుతున్నాకూడా పేదలైన సాటిపిల్లల్ని ఎప్పుడూ అసహ్యించు కోదు.

న్రమత కౌముదికి ఒక అలంకారం అందరిపట్ల ఎంతో ఆదరంగా ఉంటూ అందరిని శ్రద్ధగా చదువుకోమని ప్రోత్సహిస్తుండేది. ఎవరయినా తెలియనిది అడిగితే ఓపికగా చెప్పేది. ఏదైనా కావాలని కోరినా తన దగ్గ రున్న వస్తువుల్ని ఇచ్చేస్తుంది. అంతటి దయామయి కౌముది. తన తరగతి పిల్లలు చదువుకోకుండా కాలాన్ని వ్యర్థం చేస్తుంటే "చక్కగా చదువుకుంటే అయ్యవార్ల దగ్గర చీవాట్లు, బాగాచదివే విద్యార్థుల దగ్గర చెంపదెబ్బలు ఉండవుకదా" అని వాళ్ళకు పెద్ద ఆరిందేవిలా బోధిస్తుండేది. వాళ్లు విని పించుకోకుండా ఉంటే "మీకర్మ" అంటూ ఊరుకునేది. ఇలా కౌముది తాను శ్రద్ధగా చదువుకుంటూ సాటి పిల్లల బాగోగుల్ని గూర్చికూడా హెచ్చ రించేది. తన తరగతి పిల్లల మధ్య ఆహ్లాదంగా కౌముది కూర్చుని ఉంటే నక్షత్రాల నడుమ అందాల చందమామలా వెలిగిపోతూ కనుల పండుగగా కనిపించేది.

పట్టుమని పది సంవత్సరాలైనా నిండని చిన్నారి కౌముదిలో ఉదాత్త మైన పెద్దరికం, దృఢమైన వ్యక్తిత్వం గోచరిస్తుండేది. ఎవరైనా గిట్టని వాళ్ళు, పోకిరి పిల్లలు నిష్కారణంగా తిట్టినా, ఏవో వంకలు పెట్టి చేతు లుండక కొట్టినా తాను తిరిగి తిట్టడం గానీ, కొట్టడం గానీ, చేసేదికాదు. అలాంటి దుష్టపనులు మనమూ చేస్తే వాళ్ళకువలె మనకూ చదువురాదని, చెడ్డపేరు వస్తుందని తాతయ్య ఒడిలో కూర్చోపెట్టుకొని చెప్పిన మాట గుర్తుకు తెచ్చుకునేది. కౌముదికి పుస్తకాల్లోని పాఠాలన్ని మెరుపు తీగల్లా మెదడులో తారాడుతుంటాయి. తాను పరీక్షల్లో ఎప్పుడూ కాపీకొట్టి వ్రాయ లేదు. అలాచూచి వ్రాయడం, అడిగి చెప్పించుకొని వ్రాయడం అంటే

కౌముదికి అసహ్యం పరీక్షల్లో అలా వ్రాయడం తప్పుగా భావించేది కౌముది సాటి విద్యార్థులెవరైనా ప్రక్కవాళ్ళ పలకలోను, కాగితంలోను చూసి కాపీకొడుతుంటే బాధపడేది. అయ్యవారు పట్టుకుంటే వాళ్ళను కొడతారు కదా అని దిగులు చెందేంది. కానీ వాళ్లు మరీ జాలిగా చూస్తూ చెప్పించమని ప్రాధేయ పడుతుంటే చెప్పకుండా ఉండలేక పోయేది. వాళ్ళకు సమాధానాలు చెప్పి అయ్యవార్ల దగ్గర తాను మొట్టికాయలు తినేది.

కౌముది ఒక చిన్న పల్లెటూరులో పుట్టిన చిలకలాంటి పిల్ల అయినా అన్నీ నాగరిక ఆలోచనలే, పల్లెటూరులో ఉంటే సరియైనవసతులుండవని, పట్టణాలలోకి వెళ్లి పెద్దపెద్ద చదువులు చదువుకోవాలని, పుస్తకాల్లో తాను చదువుకున్న గాంధి మహాత్ముడు. సరోజనీదేవి, తులసీదాసు, మీరాబాయి, ఝాన్సిలక్ష్మిబాయి, వీరేశలింగం పంతులు వీరివలె అంతటి ఆదర్శభావాలతో పెరగాలని మహోన్నత స్థితికి రావాలని ఉబలాటపడేది తన వూరులోని పాఠశాలల్లో ఐదవ తరగతివరకే విద్య ఉండేది. తాను మామూలు రోజుల్లో లాగే సంవత్సరాంత పరీక్షలో కూడా ప్రథమ శ్రేణిలో ప్రథమ స్థానంలో పాస్ అయ్యింది. కౌముది తాతయ్య, నాన్న, అమ్మ ఆ వూరు ప్రజలు కౌముదిని ప్రేమతో అక్కునచేర్చుకున్నారు. అయ్యవార్లను ఇంటికి పిలిపించి విందు ఏర్పాటుచేసి ఘనంగా సన్మానించారు వాళ్ళ అమ్మానాన్నలు. అయ్యవార్లు పై చదువులు చదవాలని కౌముదిని వాత్సల్యంగా తల నిమురుతూ ఆశీస్సుల అక్షింతలు చల్లారు. కౌముది గురుభక్తితో అయ్యవార్ల పాదాలకు నమస్కరించి చిన్ని చేతులతో కళ్ళకు అద్దుకొన్నది.



కోస్తావాణి
**2-8-1992**

# కౌస్తుభ



ఏదో పనిమీద అచ్యుత రామమూర్తి ఊరువెళ్లి తిరిగి ఇంటికి వచ్చే సరికి ఫస్టుక్లాసులో ఫస్టు ర్యాంకులో పదవ తరగతి పాస్ అవుతుందనుకున్న తన కూతురు కౌస్తుభ థర్డ్‌క్లాస్‌లో పాస్ కావడం, తన భార్య అన్నపూర్ణ ఆరవ కాన్పులో నైనా అబ్బాయిని ప్రసవిస్తుందనుకుంటే ఆడపిల్లే పుట్టడం అయనకు గొడ్డలి పెట్టయింది. ఆడపిల్ల పుట్టేసింది ఇకతప్పదు 'నారుపోసిన వాడే నీరు పోయక పోతాడా' అని సరిపెట్టుకున్నా కౌస్తుభ మాత్రం క్లాసులో ఫస్టురాకపోవడం నిలువునా క్రుంగదీసింది. అచ్యుత రామమూర్తిని. అందుకు నిరసనగా కౌస్తుభతో మాట్లాడటం మానేశాడు. ఇంట్లో చిన్న పిల్లలపై కూడా చిన్న చిన్న విషయాలకే పెద్ద పెద్ద అలకలు పూనుతాడు అతను. సకాలానికి ఆహారం కూడా తీసుకోడు. తనలో తాను పరిపరి విధాలుగా ఆలోచించుకొంటూ మౌనంగా వుంటాడు.

తాను కౌస్తుభ స్కూలికి ఎప్పుడు వెళ్లినా 'మీ అమ్మాయి కౌస్తుభ చాలా బాగాచదువుతుంది బుద్ధిమంతురాలు' అని వాళ్ళ మాస్టారు కౌస్తుభ చదువుల్ని గూర్చి, నడవడిని గూర్చి ఘనంగా ప్రశంసించేవారు. తానుకూడా ఏ మాత్రం విరామం దొరికినా అమ్మాయిని ప్రక్కన కూర్చోబెట్టుకొని శ్రద్ధగా పుస్తకాలు చదివించే వాడు. సుప్రభాత సమయంలోనే నిద్రలేపి మరి పాఠాలు చెప్పించేవాడు. చిన్న పరీక్షల్లోను, పెద్ద పరీక్షల్లోను అన్ని సబ్జక్టుల్లోనూ కౌస్తుభకే ఎప్పుడూ ఎక్కువ మార్కులు వచ్చేవి. అలాంటిది పబ్లిక్ పరీక్షలో కనీసం సెకండ్ క్లాసైకూడా రాకపోవడం వాళ్ళ మాస్టారకు కూడా చాలా ఆశ్చర్యం, విచారం కలిగించింది.

కౌస్తుభ అందరిలాగ సకల సదుపాయాల మధ్య చదువుకోలేదు. తన వూరినుంచి హైస్కూలికి నాలుగు మైళ్ళ దూరం వుంది. ఆ అమ్మాయి ఆరవ తరగతి నుండి పదవ తరగతి వరకు కాలి నడకతోనే రాకపోకలు సాగించేది. ఎప్పుడైనా టౌన్‌నుంచి వచ్చిన జీపుగానీ, లారీగానీ, ఎద్దులబండి వంటివి గానీ వాళ్ళ వూరినుంచి వెళ్లుతుంటే హాయిగా అందులో కూర్చొ

వెళ్ళేది ఈ రోజు నడక తప్పింది హమ్మయ్య, అని ఎంతో ఆనందించేది. కౌస్తుభ చదివే రోజుల్లో ఆర్టీసి బస్సులుగానీ, ఇతర వాహన సౌకర్యాలుగానీ వుండేవికావు. ఇలా ఉదయాన ఏడుగంటలకు టిఫిన్‌బాక్స్ తీసుకొని బయలు దేరి సరిగ్గా స్కూలు టైంకు చేరకొనేది. మళ్ళీ సాయంత్రం ఆరుగంటలకు తిరిగి వచ్చేది మనిషి సన్నగా వుండటంవల్ల పిట్టలా చాలా తేలిగ్గా వేగంగా ఎగిరిపోతున్నట్లుండేది కౌస్తుభ. ఐదవ తరగతి వరకు ఊర్లోనే పాఠశాల వుండేది. అందువల్ల ఈ ఊర్లోవారు తమ ఆడపిల్లల్ని చదవడానికి వ్రాయ డానికి వస్తే చాలులే అని పూర్లో ఐదివరకే చదివించేవారు. పైగా 'ఆడపిల్లల్ని చదివించడం వల్ల మనకేమి లాభం 'ఇటు చదువులకు అటు పెళ్ళిళ్లకు ఖర్చు పెట్టడం కష్టమని, ఆడపిల్లల్ని పై చదువులు చదివిస్తే అనేక రకాల సమస్యలు, సామాజిక ఇబ్బందులు ఎదురవుతాయని, చదివి ఉద్యో గం చేసినా పెళ్లయ్యాక అత్తవారింటికి చెందుతుందని తల్లి దండ్రులు స్వార్థతత్వంతో ఆలోచించి తమ ఆడపిల్లల్ని పై చదువులకు పంపించేవారు కారు.

ఆ వూరులో కౌస్తుభ తండ్రి అచ్యుత రామమూర్తి ఇంటా బయటా కొన్ని విషయాల్లో ఛాందసత్వం ప్రదర్శించినా తన కూతుర్ని చదివించె విషయంలో మాత్రం ప్రగతిశీలక దృక్పథం కనబరిచేవాడు. చదువుకు ఆడ మగ తేడా పాటించకూడదని చదువుల తల్లి సరస్వతి స్త్రీయేనని, ఆడ పిల్లల్లోని తెలివితేటల్ని పెద్దలు స్వార్థ ప్రయోజనాలకు బలిచేయకూడదని, శ్రద్ధగా చదువుకునె అమ్మాయిల్ని చదివించడం కన్నవారి ధర్మమని, పెద్ద చదువులు చదివి ఉద్యోగం వచ్చి అత్తగారింటికి వెళ్ళినా తమ బిడ్డనని తన కూతురైనా సుఖంగా ఉంటేచాలని, మంచికీర్తి అయినా. చెడు అయిన ఆడ పిల్ల వల్లనే త్వరగా వస్తుందని ఇలా గొప్ప సంస్కర్తలా, మహెూవర్తలా సహేతుకంగా ఆయన లెక్చరిస్తుంటాడు.

తానొక సాధారణ రైతు అయినా తన స్వార్థ సుఖాలు విలాసాలు అన్నీ వదులుకొని అతిధుల్ని ఆదరించడం, బంధువుల్ని ఉద్ధరించడం, పొరుగు వారికి సాయపడటం, తన కూతుర్ని చదివించడం ఇవేజీవిత లక్ష్యా లుగా పెట్టుకున్నాడతను. తనభార్య అన్నపూర్ణ సకల సద్గుణరాశి, తనకు

నగలూ నాణ్యాలు, విలువైన దుస్తులూ అక్కరలేదని తనకూతురు చదివి మహోన్నతురాలైతే అదే తరగని, చెరగని ఆభరణాలని భర్తతో ఎప్పుడూ చెబుతుండేది.

అచ్యుత రామమూర్తి తండ్రి హరిముకుంద కూడా తన మనుమ రాలైన చిన్నారి కౌస్తుభపట్ల అపారమైన ప్రేమను. ఆ అమ్మాయి చదువు పట్ల ఎనలేని శ్రద్ధచూపించేవాడు. పుట్టినప్పటినుంచి తన మనమరాలి ముఖంలో ఏదో అపూర్వమైన తేజస్సు ఉట్టి పడుతుండటంవల్ల, ఆయన గొప్ప రామభక్తుడు కావడంవల్ల ఆ చిన్నారిని మహా విష్ణువు కంఠంలోని మణిపేరు పెట్టాడు. కౌస్తుభను ఎప్పుడూ తొడపైన కూర్చొపెట్టుకొని అల్లారు ముద్దుగా లాలిస్తూ సంగీత స్వరాలు, అన్నమయ్య, త్యాగయ్య, రామదాసు కీర్తనలు నేర్పించాడు. రామాయణ, భారత భాగవతాది గ్రంథాల్లోని కథ లను, నీతికథలను చెబుతుండేవాడు. కౌస్తుభకూడా తాతపట్ల ఎంతో విన యంగా, గౌరవంగా ప్రవర్తించేది. ఎప్పుడైనా కాళ్లు చేతులు ఒత్తమంటే పరుగెత్తి వచ్చి తాతకు సేవచేసి మురిపించేది.

కౌసుభలో ఇలా బాల్యంనుంచే భగవద్భక్తి, పెద్దలపట్ల నమ్రత సంగీ తంపై అనురక్తి, క్రమశిక్షణ, నిశిత పరిశీలన ఏర్పడింది. తనతో పాటు పల్లె నుంచి హైస్కూలుకి వచ్చేవాళ్ళు ఒక్కొక్కరే ఒక్కక్క. తరగతిలో అగి పోతుంటే తాను ఒంటరిదై పోయింది. అలా ఎనిమిదవ తరగతినుండ పదవ తరగతి వరకు ఒక్కతెగా అంతదూరం నడకసాగించేది. మధ్యమధ్యలో రేగుకాయలు, మామిడికాయలు, కలింకాయలు, నెల్లికాయలు, వేరుశెనగ కాయలు, తీపిచింతకాయలు, నేరేడుపండ్లు, వెలగపండ్లు, సజ్జకంకులు చెరకు గడలు కౌస్తుభకు నడకయాసాన్ని పోగొట్టి ఆహ్లాదాన్నిచ్చేవి. దారి మధ్యలో కొంతదూరం సువర్ణ ముఖీనది ఇసుక ఎడారి, మరి కొంతదూరం చెట్లు, పుట్టలు రాళ్ళు మరికొంత దూరం అతి పెద్ద చెరువు వుండేది. ఆ రోజుల్లో పల్లెల్లో దయ్యాల కథలు చెప్పుకునే వారు బుడబుక్కలవారు, ఫకీరువారు మంత్రాలువేసి మాయచేసి పిల్లల్ని ఎత్తుకెళ్ళి ఎక్కడో నర బలులు ఇచ్చేవారని కూడా చెప్పుకునేవారు.

అప్పట్లో రౌడీలబెడద కూడా ఉండేది. అయితే వాళ్లు లంగా, వోణి వేసుకున్న అమ్మాయిలపట్ల ఎగతాళిగా, తుంటరిగా ప్రవర్తించి కొంతదూరం వెంబడించి తిరిగి వచ్చేవారు. కౌస్తుభ పదవ తరగతి చదువుతున్నా ఆరవ తరగతి పిల్లలాగే చాలా చిన్నగా కనిపించేది. పొట్టిస్కర్టుషర్టు వేసుకొనేది. రెండు జడలు వేసుకొని వాటిని మడిచి పెట్టుకునేది వాళ్లఅమ్మ ఎంతో ముచ్చటగా బొట్టు, కాటుక తీర్చిదిద్దేది చూడముచ్చటగా, ఆకర్షణీయంగా వున్నా శారీరక ఎదుగుదల, దానికి తగిన వేషధారణ లేకపోవడం వల్ల కౌస్తుభకు రౌడీల బెడద తప్పేది. పదవతరగతి చదువుతున్నప్పుడు వాళ్ల మాస్టార్లు సాయంత్రం స్కూల్ విడిచిపెట్టగానే ప్రతిరోజు ఒక ఇంగ్లీషు స్టోరీ చూడకుండా వ్రాయించుకొని ఆ తర్వాత పంపించేవారు.

ఒకసారి అలా వెళ్ళుతున్నప్పుడు సువర్ణముఖినది ఇసుక ప్రాంతంలో తనప్రక్క వూరి నరేష్ అనేఅబ్బాయి కౌస్తుభను మౌనంగా వెంబడించాడు. నరేష్ బి. ఎ చదివే కాలేజి విద్యార్థి. ఆతని తల్లిదండ్రులు, ఇంటి వ్యక్తులు అందరూ కౌస్తుభ తల్లిదండ్రులకు బాగాతెలుసు కౌస్తుభను కూడా నరేష్ అప్పుడప్పుడు చదువులకు సంబంధించి పలకరించేవాడు. అలాంటివాడు "ఈ రోజెందుకే ఇంతగా ప్రవర్తిస్తున్నాడు" అతనికేమి కావాలి? ఏదైన అవ సరమైతే పలకరించవచ్చుకదా? అని మనసులో అనుకున్నది కానీ అలాం టిదేమి చేయడంలేదు. అతను ఏదో వికారంగా కనుగుడ్లు ఉరిమిచూస్తు న్నాడు.

దారిలో కనుచూపు మేరకు జనసంచారమే లేదు. కౌస్తుభ పదవ తరగతి చదువుతున్న పదమూడు సంవత్సరాలు కూడా నిండని లేతబిడ్డ ఆ అమ్మాయిని చురుకుదనాన్నిబట్టి, తెలివితేటల్నిబట్టి వాళ్ళనాన్న రెండు సంవత్సరాల వయసు ఎక్కువ వేసి స్కూల్‌లో చేర్పించాడు. అందు వల్ల చదువుకు తగిన వయసు కూడాకాదు కౌస్తుభది లౌకిక విషయాలు, స్త్రీ పురుష సంబంధాలు ఏవి తెలియవు తనకు రెక్కలు విచ్చని ఎర్రగులాబీ లాంటి కౌస్తుభ కొంతదూరం నిదానంగా నడిచింది. నరేష్ ముందుగా వెళతా డని. కాని ఆతను వెళ్ళలేదు సరే, తానే ముందుగా వేగంగా వెళ్ళదామని పరుగులు తీసింది. నరేషకూడా పరుగులు తీశాడు. ఇలా చాలాదూరం లేడి వెంట బోయవాడిలా నరేష్ కౌస్తుభను వెంబడించాడు.

చివరికి ఎలాగో తప్పించుకొంటూ దారిప్రక్కనున్న తన స్నేహితు రాలు కుముద ఇంట్లోకి దూకేసింది కుముద, వాళ్ళ అమ్మా నాన్నలు, అన్న, అక్క అందరూ కౌస్తుభ గాబరాపడుతున్నట్లు గుర్తించారు. విషయం అడిగారు. చెబితే ఏమనుకుంటారో అనిసంకోచించి అసలు విష యం చెప్పకుండా "ఎండలో నడవలేక పరుగెత్తి వచ్చాను. నీళ్ళు దప్పికగా వుంది అంతే' అన్నది వాళ్ళిచ్చిన నీళ్ళు తాగి కొంతసేపు అక్కడే కూర్చొని అలసట తీర్చుకొన్నది కౌస్తుభ. ఆ దుష్టుడు ఈ వరకు వెళ్ళివుంటాడులే" అని అనుకున్నది మనసులో. ధైర్యంగా బయలుదేరి కొంతదూరం వచ్చే సరికి చెట్లు, తీగల పొదల్లో నరేష్ బ్లూకలర్ షర్టు కనిపించింది. 'వాడు ఇక్కడేదాక్కొని ఉన్నాడు బాబోయ్" అంటూ భయపడి బెంబేలెత్తిపోయి తిరిగి కుముద ఇంటికే వెళ్లి పరిస్థితి అంతా చెప్పేసింది. కౌస్తుభ. వాళ్ళం దరూ పరుగెత్తి వచ్చారు. కుముద అన్న కరుణాకర్ వాణ్ని ఓరే వెధవా! అంటూ చొక్కాపట్టి లాగి చెంపలు వాయించాడు. "ఇంకెప్పుడూ ఇలా చేయను, నన్నుకొట్టకండి దయచేసి వదిలేయండి" అంటూ దండంపెట్టాడు నరేష్. ఆనాటినుంచి నరేష్ కౌస్తుభ జోలికి రాలేదు.

ఈ విషయం ఊరంతా ప్రాకింది తక్కిన అబ్బాయిలు కూడా భయభక్తులు కలిగి ప్రవర్తించసాగారు కౌస్తుభ పట్ల. కౌస్తుభ అమ్మానాన్నలు తమబిడ్డ ఉపాయంగా అపాయం తప్పించుకొని ఇల్లుచేరి నందుకు దేవుడికి అర్చనలు చేయించారు. స్వగ్రామం నుండి ఆడపిల్లలు పొరుగూరికి వెళ్ళి చదువుకోవాలంటే అబ్బాయిల బెడద ఇలా ఉండేది ఆ రోజుల్లో. కౌస్తుభకు హైస్కూల్ జీవితంలో మరచిపోలేని భీతావహసం ఘటన ఇది.

కౌస్తుభ ఒక్కసారి సూర్యాస్తమయం వేళల్లో ఒంటరిగా నడుస్తున్న ప్పుడు ఎవరైనా వికృత వేషధారులు ఎదురైనా, గాలివీచి చెట్లఆకులు గల గలమని శబ్దం చేసినా ఏదో దయ్యమని వణికి పోయేది. కళ్ళుమూసుకొని తాత, నాన్న, పొరుగూరి ఆశ్రమంలోని గోపాలస్వామి తనకు నేర్పించిన 'హరేరామ హరేకృష్ణ' అనే నామమంత్రాన్ని మనసులో స్మరించుకుంటూ పరుగెత్తి వెళ్ళేది. ఆ తర్వాత రెండువూర్లు దాటి తనవూరు చేరేది. అనుక్షణం

భయాందోళనలతో కౌస్తుభ ఐదు సంవత్సరాలు అంతదూరం కాలినడక సాగించి హైస్కూలు విద్యాభ్యాసం పూర్తిచేసింది. ఇంట్లో కూడా తగిన వసతులుండేవికావు దీపం, లాంతరు వెలుగులో ఇంటి అరుగుపై చాపపరుచుకొని దానిపై కూర్చొని చదువుకొనేది. పుస్తకాలు మాసిపోకుండా, చినిగిపోకుండా వుండటానికి గట్టి అట్టవేసి జాగ్రత్తగా చేసేది దుమ్ము పడకుండా పెద్ద వస్త్రంతోగానీ, పెద మైనం అట్టతోగానీ, శుభ్రంగా కప్పిపెట్టేది. ఎప్పుడూ తాను తన పుస్తకాలు శుచిగా, నిర్మలంగా ఉండాలి తనకు. కౌస్తుభ ధ్యాసంతా చదువుపైనే. ఇరుగుపొరుగువారి కాకమ్మ కబుర్లంటే భలే చిరాకు పడేది. కాలాన్ని మంచి పనులకు వుపయోగించుకోవాలని, అనవసరంగా మాట్లాడటంవల్ల ఎప్పుడో ఒకప్పుడు రచ్చలొస్తాయని భావించేది కౌస్తుభ తన సమయమంతా నడపడానికి, పరుగెత్తడానికి, చదువుకోవడానికే సరిపోయేది.

ఇంట్లో ఉన్నంతసేపు ఆరేళ్ళ అల్లరితమ్ముడు రఘుతోను, ముద్దుల చెల్లెలు అరవిందతోను ముచ్చటలాడుతుండేది. వాళ్ళు వచ్చీరాని తొక్కుపలుకులు పలుకుతుంటే సంబరపడి పోయేది. అమ్మ పొలాలవైపు వెళ్ళినప్పుడు వాళ్ళకు స్నానాలు చేయించి, తలదువ్వి, సింగారించి ముచ్చట చూసేది. ఇంట్లో చదువుకోవడానికి సమయం సరిపోదని వచ్చిపోయేదారి మధ్యలోనే ఇంగ్లీషు స్టోరీలు, తెలుగు పద్యాలు అన్నీ నేర్చుకొని మననం చేసుకుంటూ వచ్చేది. చదువులపై అంత గురి పెట్టేది కౌస్తుభ

కౌస్తుభ ఎవరికీ ఎందులోనూ ఏ మాత్రం తీసిపోయేదికాదు స్కూల్లో కార్యక్రమం జరిగినా, ఏ ఆటల పోటీలు పెట్టినా కౌస్తుభదే పైచేయి. అన్నింటికన్నా కౌస్తుభకు పాటలు, పద్యాలు, నాట్యం, పరుగుల పందెం అంటేచాలా ఇష్టం కర్తవ్యంపై శ్రద్ధ,పట్టుదల, దీక్ష క్రమబద్ధమైన నడవడి వుంటే సాధించలేనిదంటూ ఏమీ వుండదు కదా కౌస్తుభ అంటే తనతోటి అమ్మాయిలైనా, అబ్బాయిలైనా ఎంతో ఆదరాభిమానాలు చూపే వారు, మాస్టార్లు ఆ అమ్మాయిపై ప్రత్యేకమైన వాత్సల్యం, ఆప్యాయత కురిపించేవారు.

అలాంటి కౌస్తుభ పదవతరగతిలో మామూలుగా పాస్ అయినా గొప్పగానే చూసేవారు మాస్టార్లు. అన్ని సబ్జెక్టుల్లో ఎప్పుడు ఏది అడిగినా తడ

బాటు లేకుండా చెప్పేది కౌస్తుభ ఒక్కతే. దురదృష్టవశాన పబ్లిక్ పరీక్షలో మార్కులు తగ్గినందుకు విచారించి మళ్ళీ కౌస్తుభ వ్రాసిన పరీక్ష పేపర్లను రి-వాల్యుయేషన్‌కు పెట్టించారు మాస్టార్లు.

మాస్టార్ల ప్రయత్నం వల్ల కౌస్తుభ స్టారేమారిపోయింది. మొదటినుంచీ అందరూ అనుకున్నట్లు కౌస్తుభదే పదవతరగతిలో ప్రథమ స్థానం అయింది. అచ్యుత రామమూర్తి ఆనందానికి అవధులులేవు. కౌస్తుభను పిలుచుకొని తిరుమల శ్రీ వెంకటేశ్వరుని సన్నిధికెళ్ళి భక్తితో సంతోషంతో తలనీలాలు సమర్పించి వచ్చాడు. అతను కౌస్తుభపై అవ్యాజ వాత్సల్యం, దయచూపి ఎంతో శ్రద్ధతో పాఠాలు చెప్పిన కౌస్తుభ గురువులకు, ఆయన తన ఇంట్లో ఘనంగా పార్టీ ఏర్పాటు చేశాడు. అందరికీ అన్నదానం చేసి సంతృప్తి పడ చాడు.

అన్నిటికీ భగవంతుడే కారణం అనుకున్న చిన్నారి కౌస్తుభ ఆనాడు ఎలావుందో ఇప్పుడు అలాగేవుంది "కర్తవ్యం చేయడమే తనవంతు, ఫలితం పరమాత్మ వంతు" అనుకునే గీతాతత్వం కౌస్తుభది. అదే అమ్మాయి ప్రత్యే కత. అచ్యుత రామమూర్తి మాత్రం కొండంత ఉత్సాహంతో కౌస్తుభ కాలేజి చదువుల్ని గూర్చి ఆలోచించ సాగాడు

ఈ రోజుల్లో ఇళ్ళల్లో ఎన్ని సౌకర్యాలున్నా వాటివిలువ తెలుసుకో కుండాచదువుకోవడానికి బద్ధకించే బాల విద్యార్థులకు చిన్నారి కౌస్తుభ ఒక గొప్ప స్ఫూర్తి. ఆడపిల్లల చదువుల్ని నిర్లక్ష్యం చేసే తల్లిదండ్రులకు కౌస్తుభ తల్లిదండ్రులు ఒక దీప్తి.



కోస్తావాణి

25-5-96

# నీరం పల్లి మెరుంగు



పెద్దలు తమ పిల్లల్ని చదివించడమేకాక చిన్నప్పటినుంచీ ఎవరిపట్ల ఎంతవరకు ఎలా ప్రవర్తించాలో కూడా నేర్పించాలి. దుష్ట సాంగత్యాల్ని నివారించి బుద్ధినేర్పించి తీర్చిదిద్దవలసిన పెద్దలే, ముదిగారాబంతో పిల్లల్లోని ఆవేశాన్ని, మొండితనాన్ని సమర్థిస్తే అది వాళ్ళకేకాక అందరికీ బాధాకరంగా పరిణమిస్తుంది. చిన్ననాటి మొండితనమే పెద్దైన తర్వాత క్రమేణ బలపడి భయంకరమైన వ్యాధిగా మారినా ఆశ్చర్యంలేదు.

హాస్టల్‌లో తనకు ఆరోగ్యం సరిగా లేదని టౌన్‌లోరూం తీసుకొని తానే వంటా వార్పుచేసుకొంటూ చదువుకొంటోంది జయ. ఇలా నెలరోజులు ప్రశాంతంగా సాగింది. ఒకరోజు ఇంటి యజమాని రంగారావుకు ఆ అమ్మాయికి ఏదో విషయంలో రచ్చవచ్చింది. ఇక అక్కడవుంటే రీసెర్చ్‌వర్క్ చేయడం కష్టమైపోతుందని మరోఇల్లు చూసుకోవాలను కున్నది జయ.

ఉదయం 11 గంటలకు డిపార్ట్‌మెంటుకెళ్ళి తన పర్యవేక్షకురాలైన పావనీమేడంను కలుసుకుని నమస్కరించింది జయ. 'ఏమ్మా! జయా! నేనిచ్చిన వర్క్ పూర్తిచేశావా? 'లేదుమేడం నిన్నంతా మా ఇంటి యజమానితో గొడవ జరిగింది. అందువల్ల వర్క్ చేయలేక పోయాను వాళ్లునన్ను రూం ఖాళీ చేయమని నా వస్తువులన్నీ ఎత్తి బయట పడేశారు' అని చెబుతూ ఏడ్చింది.

ఎదుటి మనిషి కన్నీళ్ళు చూస్తేనే పావని భరించలేదు. అలాంటిది తనను అభిమానించే విద్యార్థి కళ్లల్లో నీళ్ళు రావడం సహించలేకపోయింది. గొడవఎందుకు జరిగింది? ఏంటి? అని విచారించడం అనవసరమని భావించింది. ముందు ఆ అమ్మాయిని ఓదార్చి కష్టం నుంచి తప్పించాలను కున్నది.

'జయా! నువ్వుఏడవకు. ముందు కన్నీళ్ళు తుడుచుకో నేనున్నాను కదా. నువ్వెళ్లి ఆ వస్తువుల్ని తీసుకొని మా ఇంట్లోపెట్టిరా? అని తన ఇంటి

తాళాలు ఆ అమ్మాయికిచ్చింది. వీపుతట్టి ధైర్యం చెప్పి పంపింది జయ తాళాలు అందుకొంటూ 'మేడం! మీరు నా పాలిట దేవతలా వున్నారు. మీకు నా మనః పూర్వక కృతజ్ఞతలు అని చెప్పింది

ఆ సమయంలో జయ కళ్ళల్లో ప్రకాశించే ఆనందపు మెరుపును, పెదవులపై నర్తించే మందహాస రేఖను చూసి పావని ఎంతో సంతోషించింది. 'అదేముందిలే జయ! ఆ మాత్రం ఆపత్కాలంలో మనిషికి మనిషితోడ్పడక పోతే ఎలా? అందులో నువ్వు నా విద్యార్థివి. ఈపాటి సహాయం చేయడం నా ధర్మం, సరేనువ్వు త్వరగా వెళ్లి నీ వస్తువుల్ని మా ఇంట్లో పెట్టేసిరా అన్నది పావని

పేదవాడికి పెన్నిధి దొరికినట్లు జయ సంతోషంతో వెళ్లి తన వస్తువుల్ని ఆట్టపెట్టెల్లో అమర్చుకొని రిక్షామీద పావని మేడం ఇంటికి చేర్చింది. వస్తువుల్ని ఒక్కొక్కటే తెచ్చి ఒక మూల సర్దిపెట్టుకొన్నది కొంతసేపు విశ్రాంతి తీసుకొని మళ్ళీ డిపార్ట్‌మెంటు కెళ్లింది.

'మేడం! నా సామాన్లను మీ ఇంట్లో చేర్చేశాను. చాలాథాంక్స్ మేడం అంటూ ఇంటి తాళాల్ని మేడం కందించింది జయ.

'జయా! నీకు మంచి గది దొరికేదాకా ఏ ఇబ్బంది లేకుండా హాయిగా మీ ఇంట్లోలాగే నా దగ్గరవుండు. ఇంట్లో సార్‌కూడా లేరు ఏదో పని వుందని హైదరాబాదు వెళ్ళారు. నెలరోజులదాకా రాకపోవచ్చు. ఈలోగా మీ నాన్న వాళ్ళకు వుత్తరంరాయి. వాళ్ళు వచ్చి నిదానంగా మంచి గది వెదికి పెడతారు" అన్నది పావని మేడం 'అలాగే మేడం' అంటూ తన రీసెర్చ్‌వర్క్ మీద లేబొరేటరీ కెళ్ళింది జయ.

సాయంత్రం పావని, జయ ఇద్దరూ కలసి ఇంటికెళ్లారు. పావనికి తన పనులు తాను చేసుకోవడమంటే చాలా ఇష్టం. స్టౌవెలిగించి పాలుకాచి హార్లిక్స్ కలపి రెండు కప్పుల్లో నింపింది. జయకు ఒక కప్పు అందించితాను ఒక కప్పు తీసుకున్నది. "మేడం! మీకెందుకింత శ్రమ. నాకు చెబితే నేను చేసేదాన్ని కదా" అన్నది జయ. "ఇదేముందిలేమ్మా! ఈ మాత్రం పనులు చేసుకోక పొతేఎలా? నీకు కొత్తకదా! నువ్వు వున్నన్ని రోజులు హాయిగా వుండి చదువుకోవాలు" అన్నది పావని

ఇంట్లో పనులు, వంటపనులు అన్నీ తానే చూసుకుంటూ ఏ ఇబ్బందీ లేకుండా అన్నీ అమర్చి పెడుతూ జయను ఒక చెల్లెలుగా, ఆత్మీయురాలుగా చూసుకుంటోంది పావని. పావనికి జయకు వయసులో పెద్దతేడాకూడాలేదు. పావనికన్నా జయ రెండేండ్లు మాత్రమే చిన్నది. పావని ఆ సంవత్సరమే కొత్తగా ఉద్యోగంలో చేరింది. ఈ గురు శిష్యులు చూసేవారికి సమానవయస్కులుగానే కనిపిస్తారు.

ఇద్దరూ కలసి అన్యోన్యంగా వుండటం, ఎక్కడికైనా కలసి వెళ్ళడం కలసి పనులు చేసుకోవడుం చూసి కొంతమంది పావని సహెూద్యోగులు ఈర్ష్య పడసాగారు. అసూయ ఆత్మవినాశ హేతువనే సంగతి వారికి తెలిసినట్లులేదు. అవకాశం దొరికితే ఇద్దరి మధ్య ఎలాగైనా క్రోధాగ్నిని రగిలించి విడగొట్టాలని ఎదురుచూస్తూన్నారు. 'వేరు పురుగుచేరి వృక్షంబు చెరచు" అని వేమన అన్నట్లు లోకంలో ఐక్యతను చెడగొట్టే ఇలాంటి దుష్టశక్తులే అధికం. తమశక్తి, సమయం వృథాఅయినా సరే ఎదుటి వాళ్ళను నాశనం చేసి ఆనందించడమే వాళ్ళపని.

జయ పావని ఇంటికి వచ్చి పదిహేను రోజులయింది. ఎంతోదూరాన తన స్వంత వూర్లో ప్రాణప్రదమైన చిన్నారి చెల్లెళ్ల మమకారాన్ని జయలో చూసి సంతోషించింది పావని. జయ తన కోర్సు పూర్తి అయ్యేవరకు తన దగ్గరే వుంటే బాగుంటుందనుకున్నది. ఇంతలో జయ వాళ్ల నాన్న ముకుంద మూర్తివచ్చాడు. కూతుర్ని చేరదీసి ఆశ్రయమిచ్చి ఆదరిస్తోన్న పావనీ మేడంకు నమస్కరించి తన కృతజ్ఞతలు తెలియజేశాడు.

'ఆదేముందిలెండి' అని పావని చిరునవ్వు నవ్వుతూ లోపలికి వెళ్లి మంచినీళ్లు తెచ్చింది. జయ వాళ్ళ నాన్నకు స్నానానికి వేడినీళ్ళు సిద్ధం చేసింది. పావని త్వరత్వరగా వంటకాలు పూర్తిచేసి దూర ప్రయాణంచేసి వచ్చిన ముకుందమూర్తికి వడ్డించింది. ఆయన స్నానంచేసి వచ్చి భోజనం చేసి విశ్రాంతి తీసుకున్నాడు. జయ, పావని ఇద్దరూ కూడా భోజనం ముగించుకొని ముకుందమూర్తి దగ్గర కూర్చున్నారు.

నాన్నా! మామేడం చాలామంచివారు. ఇన్నాళ్ళు నాకు అక్కప్రేమ అంటే ఏమిటో తెలియదు. కానీ ఈనాడు మేడంలో ఒక అక్కను గుర్తిం

చాను. అంతేకాదు మేడం ఒక దేవతామూర్తి. ఈ మాత్రం ఒక విద్యార్థికి సహాయం చేసే గురువులెంతమంది వుంటారు ఈ రోజుల్లో. అని ఘనంగా తనను ప్రశంసస్తూ జయ వాళ్ల నాన్నతో చెబుతుంటె "ఇక చెల్లెమ్మా ఈ ప్రశంసలు! నేను చేసింది చాలా చిన్న సహాయం" అన్నది పావని

"ఇప్పటికి చిన్న విషయం అని మాకనిపించినా అనాడు ఇది మా అమ్మాయికి పెద్దకష్టమేనమ్మా మేము ఎంతో దూరంలో వుంటున్నాము. ఈ పూర్లో మా అమ్మాయికి ఎవ్వరూలేరు. మీరు దేవుడిలా అదుకొని ఆశ్రయం ఇచ్చారు. ఇది మా దృష్టిలో గొప్పవిషయమేనమ్మా" అన్నాడు ముకుంద మూర్తి. అతని ప్రశంసలకు ఒక చిరునవ్వు నవ్వింది పావని.

"మేడం! నాకు నిద్రొస్తోంది. నేనువెళ్లి పడుకుంటా నన్నది జయ. "అలాగే వెళ్లమ్మా. నేను కాసేపు నాన్నతో మాట్లాడి వస్తానన్నది పావని. ప్రయాణబడలికతో వున్న ముకుందమూర్తి తనకూ నిద్రరావడంతో 'సరేమ్మా రేపు వుదయం మాట్లాడు కోవచ్చులే మీరూవెళ్లిపడుకోండి" అన్నాడు.

మరునాడు దైనందిన కార్యక్రమాలు పూర్తిచేసుకొని జయ, పావని ఇద్దరూ డిపార్ట్‌మెంట్ కెళ్లారు ముకుందమూర్తి వాళ్ల అమ్మాయికి రూం వెదకడానికి బయలు దేరాడు. దారి మధ్యలో ఎవరితోనో మాట్లాడుతుంటే ఎవరో పేయింగ్ గెస్టుగా చేర్చుకుంటారని తెలిసింది. వాళ్ల అమ్మాయిని అక్కడ చేర్చేస్తే వంటా వార్పు పనులు అమ్మాయికి తప్పుతాయని, బాగా వర్క్ చేసుకుంటుందని అనుకున్నాడు.

ఆరోజు సాయంత్రం కూతుర్ని మేడం ఇంటినుంచి తీసుకెళ్లి పేయింగ్ గెస్టుగా చేర్పించాడు ముకుందమూర్తి. ఇన్నాళ్లు తనతో వుంటూ ఇప్పుడు జయ వెళ్లుతున్నందుకు పావనికి విచారం కలిగింది ఎప్పటికైనా తప్పదు కదా అని సరిపెట్టుకున్నది.

ఒకసారి ఫిజిక్స్ డిపార్ట్‌మెంట్ హెడ్ సెలవుపెటిపోతూ పావనికి బాధ్యతలు అప్పగించాడు. జయ రీసెర్చ్‌వర్క్ పూకార్తివస్తోంది తానుఏదో పనిమీద వూరు వెళ్లుతున్నానని, తనను తీసుకొనిపోవడానికి వూరినుంచి

వాళ్ళనాన్న వచ్చారని జయచెప్పింది. తానువూరు వెళ్ళడానికి అనుమతి కావాలని, రీసెర్చ్‌వర్క్ పూర్తి అయినట్లు సర్టిఫికేట్ ఇమ్మని జయ మేడంను కోరింది. తప్పనిసరి అంటే వూరికి వెళ్ళడానికి అనుమతిస్తాను కానీ వర్క్‌పూర్తి అయినట్లు సర్టిఫికేట్ మాత్రం ఇవ్వడం కుదరదని, అది రూల్‌కి విరుద్ధమని చెప్పింది పావని. తాను అడిగిన సర్టిఫికేట్‌ను పావని ఇవ్వలేదనే ఆవేశంతో, ఆగ్రహంతో పరుగు పరుగున వెళ్లి అక్కడ ఆఫీసులో పనిచేసే సుబ్బలక్ష్మికి, ఫిజిక్స్ లెక్చరర్ ధర్మారావుకు చెప్పింది వాళ్లిద్దరికీ ఎందుకో పావని మేడం అంటే ఏ మాత్రం గిట్టదు. ఏ కారణమూలేకుండా ఆమెపై అసూయా ద్వేషాల్ని పెంచుకున్నారు. తమకు లేని అందచందాలు, నిజాయితీ, మంచిపేరు, విద్యాబుద్ధులు ఎదుటి వాళ్ళలో వుంటేచూసి సహించలేని మనస్తత్వం వాళ్ళది. వాళ్లు పావని, జయ పరస్పరం అన్యోన్యంగా వుంటే చూడలేక కళ్లు పొడుచుకుని కుళ్లేవారు. ఎలాగైనా ఇద్దరి మధ్యా చిచ్చురగిల్చాలని కొండంత దురాశతో ఎదురుచూస్తున్నారు. అలాంటి వాళ్ళకు జయ చేతులార అవకాశాన్ని అందించింది.

'జయా' నీతో మీ మేడం అంత స్నేహంగా వుంటోందికదా. ఆమె ఇవ్వాలనుకుంటే సర్టిఫికేట్ ఇచ్చేయచ్చు. అందరూ రూల్సు పాటిస్తున్నారా! అదే నేనైతే కాదనకుండా ఇచ్చేవాణ్ణి అని ధర్మారావు అన్నాడు. 'ఔను నువ్వెళ్లి కొంచెం తీవ్రంగా బెదిరించినట్లు మాట్లాడు. చచ్చినట్లిస్తుంది సర్టిఫికేట్ అని సుబ్బలక్ష్మి అగ్నికి అజ్యం తోడైనట్లు జయకు దుర్బోధలు నూరిపోసింది.

మరునాటి వుదయం జయ వాళ్ళనాన్నతోకలసి పావని గదికెళ్లింది. తన కన్నీళ్ళు తుడిచి ఇంట్లో ఆశ్రయమిచ్చి పోషించిన దేవత అని అనాడు పొగడిన తండ్రీ కూతుళ్ళు కోపంతో రెచ్చిపోయారు. అది విద్యా సంస్థ అని, పావని గురువని మరచిపోయారు. 'రీసెర్చ్‌వర్క్ పూర్తికాకపోయినా సర్టి

ఫికేట్ ఇవ్వవచ్చని ఆఫీసు లో సుబ్బలక్ష్మి, ఫిజిక్స్ లెక్చరర్ ధర్మారావు చెప్పారు. మరి మీరెందుకివ్వరు? అని పావనిని నిలదీసి ప్రశ్నించాడు ముకుందమూర్తి 'మంచికి ఎంతవరకైనా తగ్గుతాను కానీ బెదిరింపులకు భయపడేదాన్నికాను. ఇలాంటి విరుద్ధమైన పనులు చేయడం నాకు వీలు పడదు. ఎవరో మీకు తప్పుడు సలహాలిచ్చారు. రేపు ఏదైనా ఇబ్బందివస్తే మిమ్మల్ని నన్ను ఆదుకుంటారా? అయినా మీరు నాదగ్గర గర్జించి మాట్లా డుతుంటే మీకు నేను సమాధానం చెప్పాల్సిన దుస్థితి నాకులేదు మీరే మైనా నా పోషకులా? రక్షకులా? మీకెవరిచ్చారు హక్కు ఇలా మాట్లాడ మని? మీరింకేమి మాట్లాడకండి గెట్ఔట్' అని ఆజ్ఞాపించింది పావని.

మా నాన్నను వెళ్ళమంటారా? అంటూ తనజుట్టు పీక్కొంటూ, రెండు చేతులతో తల కొట్టుకుంటూ, అరుస్తూ, ఏడుస్తూ పిచ్చిదానిలా మీద పడి పీకడానికి జయ వురుకుతోంది.

ఈ దుర్మార్గ పరిస్థితి ఏంటో పావనికి అర్థంకాలేదు, ఇంకో క్షణం వుంటే ఏమవుతుందో అనే ఆందోళనతో గదికి మరోవైపున తలుపుతీసుకుని మేడనుంచి కిందకి దిగి వచ్చేసింది పావని. తండ్రీకూతుళ్ళు అరుచు కుంటూ, పావనిని తిట్టుకుంటూ కిందికి వచ్చారు. ఆఫీసువాళ్లు తండ్రీ కూతుళ్ళకు తగిన విధంగా బుద్ధిచెప్పి, ఇది మీ ఇల్లుకాదని హెచ్చరించి శాంతపరచి పంపించేశారు.

మరునాడు డిపార్ట్మెంట్ హెడ్ లోకనాథం వచ్చేశాడు పావని జరి గిన పరిస్థితి అంతా హెడ్కు తెలియపరచింది ఆ అమ్మాయిని తన పర్య వేక్షణనుంచి తొలగించి తనకు విముక్తి కలిగించమని వేడుకున్నది.

పావనిగారూ' మీరు అక్కాచెల్లెళ్ళలాగా కలసి మెలసి వున్నారు. ఇంత కాలం. ఒకచెల్లెల్ని క్షమించినట్లు దయతో ఆఅమ్మాయిని క్షమించండి అని అనునయంగా చెప్పాడు లోకనాథం, ఆ అమ్మాయిని పిలిపించి పావనికి క్షమార్పణ చెప్పించాడు.

'మేడంగారూ! నాకు చిన్నప్పటినుంచీ హిస్టీరియా జబ్బువుంది. అందువల్ల ఒళ్లు తెలియకుండా అలా ప్రవర్తించాను. ఇంకెప్పుడూ అలా చేయను నన్ను క్షమించండి' అని ఏడుస్తూ నమస్కరించింది

ఈ ఏడుపేకదా ఆనాడు నా మనసుని కరిగించింది. ఇప్పుడు మళ్లీ కరిగిపోతే ఇంకా ఎలాంటి దుర్ఘటనలు ఎదుర్కోవలసి వస్తుందో అని మనసులో ఆవేదన చెందింది పావని. ఏమైనా పై అధికారి క్షమించమన్నారు కాబట్టి తప్పదని దేవుడిపై భారం వేసి ఆ అమ్మాయిని క్షమించింది.

ఇన్నాళ్ళు ఆ అమ్మాయిలో ఈ భయంకరమైన జబ్బువుందని, ఇంతటి బీభత్సాన్ని ఎదుర్కోవలసి వస్తుందని తెలియక సన్నిహితంగా మెలిగింది పావని. ఇప్పుడు కేవలం తానొక గురువుగా మాత్రం ప్రవర్తించసాగింది.

జయ తనపని కోసం పైకి క్షమార్పణ చెప్పినా లోలోపల మాత్రం మేడంకు వ్యతిరేకంగానే వుంది. అందుకే పావనిని ద్వేషించి సుబ్బలక్ష్మితోను, ధర్మారావుతోనూ సన్నిహితంగా వుంటోంది. వాళ్ళు ఇదే అదను అనుకొని పావనిపై రకరకాల నెరాలు సృష్టించి జయ ద్వారా దుష్ట ప్రచారాలు చేయించారు.

'మేడంగారూ! మీరు జయను కష్టాల్లో ఎంతో ఆదరించారు. కానీ మీరేదో ఆ అమ్మాయిని బాధపెట్టినట్లు, ఆ అమ్మాయి తనకు తాను చావాలని బావిలో దూకపోతే సుబ్బలక్ష్మిలాగినట్లు సుబ్బలక్ష్మి, జయ ఇద్దరూ కాలేజీ మొత్తం దండోరా వేస్తున్నారు. నేను విని భరించలేకపోతున్నాను, అన్నాడు పావని శిష్యుడు గోపాల్.

పోనీలేబాబూ! 'నీరు పల్లమెరుగు నిజము దేవుడెరుగు' అన్నట్లు ఆ భగవంతుడికి తెలియవా నిజానిజాలు! అబద్ధాలు ప్రచారం చేసేవాళ్లకు,

వాటిని నిజమని నమ్మేవాళ్లకు పాపాలు చుట్టుకుంటాయి. నన్నుగూర్చి తెలిసిన నీలాంటి వాళ్ళే వాళ్ళకు తగిన విధంగా బుద్ధిచెబుతారు ఏదో ఒక విధంగా నా వ్యక్తిత్వానికి మచ్చతెప్పించాలని, రచ్చకెక్కించాలని, నా ప్రగతివృక్షాన్ని విరచాలని కొంతమంది చీడపురుగులు పన్నేపన్నాగాలకు జయ అవకాశం ఇచ్చింది.

ఆ అమ్మాయి మనస్తత్వమే చాలా విడ్డూరంగా వుంటుంది. ప్రతిచిన్న దానికీ ఏడవడం, చస్తాననడం మాత్రం ఆ అమ్మాయిలో చాలాసార్లు గమనించాను. ఒకసారి మన హెడ్ లోకనాథం ఏదో అన్నారని ఏడుస్తూ నాదగ్గరకువచ్చి మేడం! నాకు చచ్చిపోవాలనివుంది అన్నది.

అదేం పిచ్చిమాటలు తల్లీ! ఇలాంటి ఆలోచనల్ని మనసులోకి ఎప్పుడూ రానీయకు. ఏదైనా బాధగావుంటే ఏ భక్తి గ్రంథాన్నో, ఏ మహనీయుని జీవితచరిత్రనో చదివితే బాధలన్నీ పోతాయి అని ఓదార్చిపంపాను. అలాగే మరోసారి సుబ్బలక్ష్మి ఎందుకో కసిరిందని ఆమె కారణంగా బావిలోదూకి చావాలని వుందని చెప్పింది. మళ్ళీ ధైర్యం చెప్పి ఓదార్చి పంపాను. ఈ విషయాల్ని నేనెప్పుడూ ఏవరికీ చెప్పలేదు. ఇతరుల పచ్చని జీవితాల్ని నాశనం చేసే అలవాటున్న వాళ్ళు ప్రచారాలు చేసుకుంటారు కానీ ఇలాంటివి నేను పట్టించుకోను. ఈ రోజు వ్యక్తిగతంగా, విద్యాపరంగా ఉపకారాలు చేసిన నామీదే ఇలాంటి ఆరోపణలు చేయడం వల్ల అవిగుర్తుకొచ్చాయి. ఆ అమ్మాయి ఇలా చేస్తుందని తెలియక చేరపెట్టాను. ఆ అమ్మాయి తిన్న ఇంటి వాసాలు లెక్కిస్తుందని, పెట్టిన చేతినే కాటేస్తుందని నేను వూహించుకోలేదు. అంతా ఆ దైవమే చూసుకుంటాడు అంటూ మనసులో రోదించసాగింది పావని.

'మేడంగారూ! మీరేమీ బాధపడకండి. మీరు అమృత హృదయులు. ఎవరినీ ఒకమాట అనరు. నొప్పించరు. ఒకసారి నాకు జబ్బుచేసినప్పుడు గట్టిమేలు తలపెట్టవోయ్' అన్నారుకదా రురజాత వంటి మహనీయులు!

వారం రోజులు మీ ఇంట్లో పెట్టుకొని ఎంతో ఖర్చుపెట్టి స్వంత తమ్ముడులా నన్ను చూసుకున్నారు. ఆ రోజుల్ని నేను మరచిపోలేను. అమ్మాయి విషయంగా ఎవరైనా మీ మీద అపనిందలు వేస్తే నిజమేంటో తెలియజేసి వాళ్ళకళ్ళు తెరిపిస్తాను ఇక మీదట దీన్నిగూర్చి ఆలోచించకండి. ఇక్కడి మనుషుల బుద్ధులు, ప్రచారాలు మీకు తెలియడం మంచిదని చెప్పాను' అన్నాడు గోపాల్.

సరే, గోపాల్ నీవెళ్ళి వర్క్ చూసుకో అంటూ ఏ చింతలూ లేని పుస్తక ప్రపంచంలోకెళ్ళింది పావని.



'శుభం' మాసపత్రిక
ఏప్రిల్, 1997

# సింధువు

సిఫార్సులు, లంచాలు లేనిదే ఏ చిన్న వుద్యోగమైనా రాని ఈ రోజుల్లో వారిజకు ఏ వుత్తర దక్షిణాలు లేకుండా తన విద్యాప్రతిభతో, దైవకృపతో ఒకటికి రెండు ప్రభుత్వోద్యోగాలు వెతుక్కుంటూ, వచ్చాయి. ధర్మదేవత ఇంకా బ్రతికి వుందనడానికి లోకంలో కనిపించే కొన్ని నిదర్శనల్లో ఇదీ ఒకటి అని భావించింది వారిజ. ఉద్యోగాలు ఎన్నివచ్చినా చేరాల్సింది ఒక్కదానిలోనే కాబట్టి వారిజ తనకు నచ్చిన వున్నతస్థాయి వుపాధ్యాయ వుద్యోగాన్నే ఎన్నుకొన్నది. తానేంటో తనపనేంటో సక్రమంగా చేసుకుపోతూ వుంటుంది. ఒకర్ని ఒకమాట అనదు. తానూ అనిపించుకోదు ఆత్మాభిమానాన్నే ఆయుధంగా, ఆత్మవిశ్వాసాన్నే వూపిరిగా, దైవభక్తినే వెలుగుగా, కర్తవ్యాన్నే జీవిత పరమార్థంగా చేసుకుని ముందుకు సాగుతుంటుంది వారిజ.

'ఏంటి, వారిజగారూ! మీరు ఎవ్వరితోనూ మాట్లాడరా' సున్నితంగా అడిగాడు సహోపాధ్యాయుడైన వసంత్ 'అదేం పిచ్చి ప్రశ్న వసంత్‌గారు? నేను చదువుకున్న దాన్ని. మీతో పాటు వుద్యోగం చేస్తున్నదాన్ని. మానవ సమాజంలో జీవిస్తున్నదాన్ని. ఎవరితోనూ మాట్లాడకపోతే ఎలా కుదురుతుంది? మీరెందుకు ఇలా ప్రశ్నిస్తున్నారో అర్థం కావడంలేదు' నిరసన భావంతో పలికింది వారిజ.

సారీ, వారిజ గారూ! మీ మనసుకు నొప్పికలిగివుంటే క్షమించండి. నా దృష్టిలో మీరు ఎక్కువగా మాట్లాడుతున్నట్లు కనబడరు. అందుకని అలా అన్నాను అంతే.

నాకు చిన్నప్పటినుంచీ కూడా అతిగా మాట్లాడటం ఇష్టంవుండదు. ఎవ్వరితోనైనా ఎంతవరకుండాలో అంతవరకే నా పరిధిలో నేనుంటాను. ఇది జన్మతః సిద్ధించిన అలవాటు. అనవసరంగా మాట్లాడటంవల్ల ఎవో భేదాభిప్రాయాలు రావడం, వాటివల్ల మనఃస్పర్థలు, వాటివల్ల విరోధాలు, వేదనలు, కాలం వ్యర్థం కావడం ఇవన్నీ భరించే ఓపిక, శక్తి నాకు లేవు వసంత్ గారు పైగా ఇలాంటివినాకు నచ్చవుకూడా. 'వట్టిమాటలు కట్టిపెట్టవోయ్,

'అదిసరే వారిజగారూ! ముప్పైఏండ్లయినా నిండకనే అప్పుడే ఓపిక, శక్తి లేదంటే ఎలా? ఇంకా వివాహం కావాలి, పిల్లలు, సంసారం, ఎంతో జీవితం వుంది వారిజగారూ' అని వసంత్ అంటుండగా నీరజ అక్కడికి వచ్చింది క్లాసుకు వెళ్లింది వారిజ.

'ఏంటి వసంత్ గారూ! వారిజతో ఏదో ఓపిక, సంసారం అని మాట్లాడుతున్నారు' అన్నది వారిజ స్నేహితురాలు నీరజ. వారిజ మాటల్ని తెలిపాడు వసంత్.

'వారిజ మీకు ఇప్పుడిప్పుడే పరిచయం వసంత్‌గారూ! నాకుమాత్రం చిన్నప్పటినుంచీ తెలుసు. టాక్‌లెస్ వర్క్ మోర్ అన్న సిద్ధాంతం వారిజది కర్తవ్యం చేయడం, దైవభక్తి కలిగివుండటం, దురాచార దుష్ట పోరాటాలు చేయడం, సాటి మనుషులకు చేతనైన సహాయం చేయడం, కుటుంబాభివృద్ధిని గూర్చి, తద్వారా దేశాభివృద్ధిని గూర్చి ఆలోచించడం ఇలాంటి విషయాలతోనే వారిజకున్న ఓపిక, శక్తి సరిపోతోంది. ఇంక కాలక్షేపం కబుర్లకు, వాటివల్లవచ్చే వివాదాలను తనకు ఓపికే ముంటుంది. చెప్పండి! ఇంక వివాహం, సంసారబంధాలంటారా, ఆ వూసులెత్తితేనే ఆమడదూరం వెళ్ళుతుంది. వారిజ ఎందుకు ఇలాంటి మాటలతో ఆమెను వేధించడం' అని వసంత్‌ని హెచ్చరించింది నీరజ

'అంటే వారిజ విహవాం చేసుకోదా? ఏం? వివాహం చేసుకునేతీరాలా? 'అలా అనికాదు అది సహజంకదా' "మనకు సహజమైనంత మాత్రాన అందరికీ సహజం కావాలని వుందా?" "వుండకపోవచ్చు" అలాగండి దారికి. వారిజకు వివాహం చేసుకోవాలనే ఆలోచనేలేదు". ఇలా వసంత్, నీరజ ఇద్దరూ వారిజను గూర్చి సంభాషిస్తుండగా తరగతిలో పాఠం చెప్పి అప్పుడే ఉపాధ్యాయగదిలోకి వచ్చింది వారిజ.

"ఏంటి? ఏదో చర్చించుకుంటున్నారు' "ఏమీ లేదులేమ్మా! పాఠం చెప్పి అలసిపోయి వుంటావు. ముందు మంచినీళ్లు తాగి కొంతసేపు విశ్రాంతి తీసుకో. వసంత్‌కు నీ వివాహం గూర్చి చాలా సందేహాలున్నాయి. వాటిని తీర్చుదువుగాని" అన్నది నీరజ.

"మళ్ళీ మొదలయిందన్నమాట తలనొప్పి" అని వారిజ తన మనసులో అనుకుంటూనే ఏంటి వసంత్‌గారూ! మనం డ్యూటీలో వుంటున్నప్పుడు ఇలాంటి వ్యక్తిగతపు మాటలు ప్రస్తావించుకోవడం నాకిష్టం వుండదు మీకంత ఓపిక, ఆసక్తివుంటే సాయంత్రం నాతోపాటు ఇంటికిరండి. అక్కడ నీ సందేహాలు తీరుస్తాను" అన్నది వారిజ.

సాయంత్రం ఐదుగంటలు అవుతోంది. వారిజ, వసంత్‌లు కలసి ఇంటికి వెళ్ళుతున్నారు. ఆనాటి సాయం సంధ్యా శీతల పవనాలు, నునులేత అరుణకాంతులు, కోకిల కిలకిలారావాలు వారిజమనస్సును యమునానదీ తీరపు ఇసుక తిన్నెలవైపు లాక్కెళ్ళాయి. "ఇక్కడే కదా జగన్మోహనాకారుడైన మురళీధరుడు, రాధ, గోపికలు సరససల్లాపాలాడింది! ప్రేమవాహినిలో ఓలలాడింది! ఎంత భాగ్యశాలురు ఆనాటి రేపల్లెవాసులు! ఆనాడేవారితో పాటు జన్మించివుంటే ఈ కలికాలపు హింసలు. నయవంచనలు, అణచివేతలు, వేదనలు చుట్టుముట్టేవి కావు కదా!' అని మనసులో భావించుకుంటూ నడుస్తోంది వారిజ

'ఏంటి వారిజగారూ! మౌనంగా వస్తున్నారు. ఏమైనా మాట్లాడండి' అన్నాడు వసంత్ "ఏమీలేదు వసంత్‌గారూ! మామూలుగానే వస్తున్నాను. మాట్లాడటానికి నాకేమీలేవు' ముక్తసరిగా పలికింది వారిజ.

"మీకు పాటలంటే ఇష్టమా?" "చాలా ఇష్టం" "అయితే ఒకపాట పాడతారా!" "పాటలు ఇష్టమైనంత మాత్రాన పాటలు పాడుతానని ఎలా అనుకుంటారు?" మీరు పాడతారనిపించింది. ప్లీజ్ పాడండి" "నడుస్తూ పాడటం నాకు అలవాటులేదు ఇంటికెళ్ళుతున్నాం కదా అక్కడ పాడుతాను". "లేదండీ ఇప్పుడే వినాలని వుంది" లేడికి లేచిందే పరుగన్నట్లు ఇప్పటికిప్పుడే పాడమంటే ఎలా? ఆలోచించుకోవద్దా"? "ఆలోచించుకోండి. నడుస్తూపాడటం మీకు కష్టమైతే, అదిగో ఆ పచ్చికపై కొంతసేపు కూర్చుందాము. మీరు పాట పాడాక ఇంటికి వెళ్ళదాం".

"దయ చూడుమయా తిరుమల నిలయా
భక్తుల మొరవిని పాలింపుమయా"

అనేపాట ఎంతో అర్ధ్రంగా, హరిభక్తి రసస్ఫోరకంగా పాడింది వారిజ. వసంత్ మరమనాస్తికుడు. వారిజ సాయంత్రం పూట ఏదో శృంగార గీతం పాడుతుందని కలలుగన్నాడు. కానీ దానికి విరుద్ధంగా జరిగింది. అయినా తన నాస్తికత్వాన్ని కప్పిపుచ్చుకుని "చాలా అద్భుతంగా, మృదు మధురంగా భక్తిపాట పాడి వినిపించారు వారిజగారూ! చాలా కృతజ్ఞతలు" అన్నాడు వసంత్

"సరే, లెండి ఇంటికెళ్ళాలికదా" అన్నది వారిజ ఇద్దరూ కొంత దూరం నడిచి ఇంటికెళ్ళేసరికి సాయంత్రం 6 గంటలయింది.

వారిజ తల్లి టిఫిన్ సిద్ధంచేసి టేబుల్‌మీద పెట్టింది. వారిజ వసంత్‌కు నీళ్ళగ్లాసు అందించి చేయి కడుక్కోమన్నది. వసంత్ చేయి కడుక్కొని వచ్చి పెసరట్టుతింటూ "పెసరట్టు చాలా బాగుంది వారిజగారూ! మీ అమ్మగారు చాలా బాగా చేశారు" అన్నాడు. "అయితే ఇంకొకటి వేసుకోండి" అంటూ వారిజ మరో పెసరట్టు వేసింది. వారిజకూడా మరోప్లేట్‌లో పెసరట్టు వేసుకున్నది. ఇద్దరూ టిఫిన్‌తిని హాల్లో సోఫాపై కూర్చున్నారు

"ఏంటి వసంత్‌గారూ! నాతో ఏం మాట్లాడాలనుకున్నారు?" "మీ వివాహం గూర్చి". నా వివాహం గూర్చి మీకు ఏంకావాలో సూటిగా అడగండి" "వారిజగారూ! నేను మీకిష్టమైతే మిమ్మల్ని వివాహం చేసుకోవాలనుకుంటున్నాను" నన్ను గూర్చి మీకేమి తెలుసు? నేను వుద్యోగంలో చేరి మీకు పరిచయమై ఒక్కనెలకూడా కాలేదు. నన్ను మీరెందుకు ఇష్టపడుతున్నారు?" "మీ మంచితనంచూసి" "నా మంచితనాన్ని ఏయే విషయాల్లో గుర్తించారు? "డ్యూటీలో మీ నిజాయితీ, మిత భాషిత్వం, పరోపకారం, మానవత్వం, సున్నితత్వం వంటి ఎన్నో సమున్నతలక్షణాల్ని మీలోగుర్తించాను. అందువల్ల మీ పై ఆసక్తి కల్గి శాశ్వతంగా మీతో సహజీవనం చేయాలనుకున్నాను. మీ వుద్దేశం చెప్పండి." వినయంగా అడిగాడు వసంత్.

"చూడండి వసంత్‌గారూ! మీకు నాలో ఏయే గుణాలునచ్చాయో మీరు చెప్పారు. మరి నేనెప్పుడూ మీలో ఈ గుణాల్ని గమనించలేదు. అయినా నాకు వివాహం చేసుకోవాలనే ఆలోచనేలేదు. ఎందుకంటే నా

దృష్టిలో సంసారం ఒక మాయాజాలం. ఇంకా మహాసాగరమని, కాలసర్ప మని కూడా అనుభవజ్ఞులు చెబుతుంటారు. సంసారంలో ఎన్నెన్ని మోసా లుంటాయో, ఎన్నెన్ని నయవంచనలుంటాయో, ఎన్నెన్ని దారుణ హింసలు జరుగుతుంటాయో ఊహతెలిసినప్పటినుంచీ సాటిస్త్రీల వైవాహిక జీవితాల్ని గమనించి తెలుసుకున్నాను. నాఅదృష్టాన్ని పరీక్షించదలచుకోలేదు. కడెంచి మెలెంచాలన్నారుపెద్దలు. అడుసు త్రొక్కనేల కాలుకడుగనేల అన్నసామెత రీతిగా సంసారపంకంలో పడదలచుకోలేదు. బాల్యంనుంచీ ఇంట్లో పుట్టుడు పిల్లలకు మాతృసేవలు చేశాను. పురుటి సమయాల్లో తల్లికి ఉపచర్యలు చేశాను. ఇంటాబయటా ఎన్నో శక్తికి మించిన పోరాటాలు చేశాను.

గ్రంథాలయానికి అబ్బాయిలు వస్తారని, అక్కడికి వెళ్ళవద్దని, ఎన్ని పుస్తకాలైనా దేశమంతా వెతికితెస్తామని, నీవుమాత్రం అక్కడికి వెళ్ళడానికి వీలులేదని, వెళ్ళేపక్షంలో చదువుకు వెళ్లనివ్వమని ఇలా చిన్న చిన్న విష యాల్లో పెద్దలు పెద్దపెద్ద ఆంక్షలు పెట్టి చాలా చికాకులు కలిగించారు. ఎక్కడికైనా పనిమీద వెళ్ళుతున్నప్పుడు పిల్లి, కుక్క అడ్డం వచ్చినా భర్త చనిపోయిన స్త్రీ ఎదురైనా, గోడకో, రాయికో, తలో, కాలో తగిలినా, ఇంకా దుర్ముహూర్తమని, వర్జ్యమని ఏవేవో అడ్డంకులు చెప్పి ప్రయాణం ఆపిం చేసేవారు. ఇలాంటివి వివరంగా చెప్పాలంటే వేల సంఖ్యలో వున్నాయి. ప్రతిచిన్న పనికి ఎంతో పోరాటం చేస్తేగానీ ఆ పని జరగనిచ్చేవారుకారు. నాలోని సర్వశక్తుల్ని ధారపోసి పెద్దల్లోని మూఢాచారాల్ని, ఇరుగుపొరుగు పెట్టేహింసల్ని ఎదుర్కొని ఆదేవుని దయవల్ల నా చదువుల్ని సక్రమంగా సాధించుకున్నాను. ఆ భగవంతుని దయవల్లనే నేడు ప్రశాంతంగా జీవిస్తు న్నాను. ప్రస్తుతం పెండ్లిపేరుతో ఈ ప్రశాంత జీవితాన్ని కోల్పోవడానికి సిద్ధంగాలేను. నన్ను ఇలాంటి మాటలతో ఇంకెప్పుడూ విసిగించకండి ప్లీజ్ అని చెప్పవలసినవన్నీ ఏకధారగా చెప్పింది వారిజ.

అంతలో నీరజ అక్కడికి రానే వచ్చింది. "హలో వసంత్‌గారూ! మీరిక్కడున్నారా"! "వారిజగారితో ప్రత్యక్షంగా మాట్లాడాలని వచ్చారు మాట్లాడటం అయిందామరి"! "ఏంటోనండీ" అంటూ దిగులుగా సోఫాపై తలవాల్చాడు.

"ఏంటి వారిజ! వసంత్ అదోలా వున్నాడు?" అడిగింది నీరజ, నీవైనా అతనికి నా మనసేంటో, నా జీవితాశయమేంటో, నా అభిరుచిలేంటో మరో సారి తెలియజెప్పి వివాహ సంబంధంగా మాత్రం నాతో ఎప్పుడూ మాట్లాడ వద్దని దయచేసి చెప్పు నీరజ" అభ్యర్థించింది వారిజ సరే అన్నట్లు చూసింది నీరజ.

చూడండి వసంత్‌గారూ! మీరు నా స్నేహితురాలైన వారిజను ఇష్ట పడి వివాహం చేసుకోవాలనుకోవడం నాకు సంతోషమే కానీ మీకున్న ఆలో చన వారిజకూ వుండాలి కదా. తాను ఎవ్వరితోనూ వివాహానికి సిద్ధంగాలేదు. తన ఆశయమే అసామాన్యమయింది. వుదాత్తమయింది. ఒక్కబిడ్డకే సరి యైన వసతులు కల్పించి పోషించి చదువులు చెప్పించలేని పెద్దలు గంపెడు బిడ్డల్నికని వేదనలపాలు చేయ్యడాన్ని చిన్నప్పటినుంచీ నిరసిస్తూ మౌనం గాపోరాడుతోంది వారిజ. అధిక సంతానం వల్ల ఇటు కుటుంబం, అధిక జనాభావల్ల అటుదేశం అనేక కష్టనష్టాలకు గురిఅవుతోందని, తన వంతుగా కుటుంబానికి దేశానికి ఏదో ఒకమేలు చేయాలనే వారిజ సంకల్పం

ఒక బిడ్డను కనడం మానేస్తె భవిష్యత్తులో ఎన్నోతరాల జనాభాను అరికట్టినట్లు అవుతుందని ఆమె భావన. ఉన్న బిడ్డలను వదిలేసి కొత్తబిడ్డ లను సృష్టించుకోవడం, స్వార్థంగా బ్రతకడం ఆమెకు నచ్చని విషయాలు. వివాహం ఒక లాటరీ. అనుకూలమైతే స్వర్గం అవుతుంది ప్రతికూలమైతే నరకం అవుతుంది. అందుకే వివాహం విషయాన్ని ఆలోచించడానికి ఏనాడో భరత వాక్యం పలికేసింది. ఎందరో పుణ్యపురుషులు, స్వాతంత్ర్య వీరులు వీరవనితలు దేశప్రజల సుఖశాంతుల కోసం ఎన్నెన్నో త్యాగాలు, పోరాటాలు చేశారని, తాను కూడా ఈ లక్ష్యసాధనతో జీవితాంతం ఎంతటి పోరాటానికైనా సిద్ధమే నంటుంది. వివాహమనే పేరుతో ఒకరికి బందీగా వుండలేనని చెబు తుంటుంది. మంచి మనసున్న వాళ్ళకు భగవంతుడు ఎప్పుడూ అండదం డగా వుంటాడని వారిజకు గట్టినమ్మకం. అని వారిజ ఆలోచనల్ని, అభిప్రా యాల్ని వివరంగా చెప్పింది నీరజ.

'నీరజగారూ! మీ స్నేహితురాలి తరపున ఆమె నిర్ణయాలను ఇంత సుదీర్ఘంగా, నిశ్చితంగా చెప్పిన తర్వాతకూడా ఆమెను ఇబ్బంది పెట్టడం

నాకు భావ్యంకాదు వారిజ త్యాగశీలమనే మహా సింధువులో నేనొక బిందువును కూడాకాను. ఆమెకు నేను ఏ విషయంలోను సరిపోను. ఇంకెప్పుడూ వివాహ ప్రసక్తిచేయను. ఇంక వెళ్ళొస్తానండీ" అన్నాడు వసంత్. జాలిగా చూసింది వారిజ. సరే రేపు ఆఫీసులో కలుసుకుందాం అన్నది నీరజ. వారిజ సువిశాల భావనకు, నిస్వార్థానికి, నిశ్చల వ్యక్తిత్వానికి, దృఢచిత్తానికి ఆకాశ హర్మ్యం నుంచి అందాల నెలరాజు వెన్నెలకిరణాల జాజిపూలను వెదజల్లసాగాడు.



కోస్తావాణి
2-3-91

# పట్టుదల



ఏంటి రాధ ఉన్నట్లుండి సూట్‌కేస్ సర్దుకుంటున్నావ్? అని ఆశ్చర్యంగా ప్రశ్నించింది గౌరి.

అమ్మకు ముందులాగ మళ్ళీ ఫిట్స్‌వచ్చి సీరియస్ అయ్యిందట ఊరికెళ్ళి అమ్మను చూసి రావాలి.

నీకెలా తెలిసింది?

చెల్లి ఉత్తరం రాసింది. గౌరీ! వార్డన్ దగ్గరికెళ్ళి, ఇంటికెళ్ళడానికి పర్మిషన్ అడిగిరావాలి. అలాగే మాగైడ్ దగ్గరికెళ్ళి ఆయనకూ పరిస్థితి చెప్పాలి. వస్తావా వెళ్దాం.

అదేంటి రాధా! మనంహాస్టల్‌లో ఐదేండ్లనుంచి ఆత్మీయస్నేహితులం ఈ పరిస్థితిలో నిన్ను ఒంటరిగా వదలి ఎలా ఉంటాను! సరే, పద వెళ్దాం.

ఏమ్మారాధా! బాగున్నావా ఏంటి ఇలా వచ్చావ్? అని లాలనగా కుశలమడిగింది వార్డన్ మాణిక్యాంబ.

మీతో పనుండే వచ్చాను మేడం. నేను అర్జెంట్‌గా ఊరికెళ్ళాలి. మీ అనుమతి కోసం వచ్చాను అంది రాధ.

అంత అర్జెంట్ ఏంటమ్మా? అని ప్రశ్నించింది వార్డన్

మా అమ్మకు ఆరోగ్య పరిస్థితి చాలా సీరియస్‌గా వుందని ఉత్తరం వచ్చింది మేడం. నేను వెళ్ళకపోతే మా అమ్మచాలా ఆందోళన పడుతుంది.

అయితే వెళ్ళురాధా

మన వార్డన్ మానవత్వం కల్గిన మంచి మనిషిరాధా. కొంతమంది అయితే నానాయక ప్రశ్నలు వేసి పీల్చి పిప్పిచేస్తారు. అలాకాకుండా ఇంత దయా హృదయం కలిగిన మేడం మనకు వార్డన్ కావడం మన అదృష్టం అంది గౌరి.

ఔను అంటూ తల ఊపింది రాధ.

ఇక మీ గైడ్ దగ్గరికెళ్దామా.

అలాగే గౌరీ

దూరం నుంచి గైడ్‌రూం వైపుచూస్తూ రాధా! మీ గైడ్ రూంలో ఉన్నట్లే, కిటికీలు తెరుచున్నాయి అంది గౌరి.

సార్ వచ్చివుంటేనే కిటికీలు తెరచివుంటాయి. నువ్విక్కడేవుండు నేను వెళ్ళొస్తాను అంది రాధ.

ఎక్స్‌క్యూజ్ మిసార్!

ఎవరు? రాధనా! రామ్మారా, ఏంటి! ఏదోకంగారుగా వున్నట్లున్నావ్ అని వాత్సల్యంగా అడిగారు గైడ్ జయరాజ్.

ఔన్‌సార్! నాకు ఆందోళనగానేవుంది. నేను అర్జెంట్‌గా వూరెళ్ళాలి. మా అమ్మకు ఆరోగ్యం సరిలేదని వుత్తరం వచ్చింది మీకు చెప్పి వెళ్దామని వచ్చాను.

అలాగే వెళ్ళిరామ్మా. మంచి డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళి చూపించండి బాగై పోతుందిలే. నీవేమీ దిగులుపడవద్దు

చాలాథాంక్స్‌సార్. వెళ్ళొస్తాను.

గౌరీ! మాగైడ్ అనుమతి కూడా అయింది. ఇక హాస్టల్ కెళ్ళి సూట్‌కేస్ సర్దుకొని వెంటనే బయలు దేరాలి. మీ వూరి బస్సు తప్పిపోతే మళ్ళీబస్సు దొరకడం బాగా ఆలస్యమవుతుంది రాధా.

ఔనుగౌరీ! త్వరగా వెళ్ళాలి. నువ్వెందుకుమళ్ళీ. నీకు రిస్కు కదా. నేను వెళ్తాను. బస్‌స్టాండ్ నుంచి నువ్వు ఒక్కదానివే మళ్ళీ వెనక్కిరావాలికదా.

పరవాలేదు రాధా! అదేమంత కష్టంకాదు నిన్ను బస్ ఎక్కించి వస్తేనాకు తృప్తిగా వుంటుంది.

నీలాంటి స్నేహితులు చాలా అరుదుగా వుంటారు గౌరీ. నువ్వునా అదృష్టంకొద్దీ దొరికావు.

అదేముందిలే రాధా! ఈ మాత్రం తోడ్పడటం కనీస స్నేహధర్మం కదా. మీ వూరుబస్సు రెడీగావుంది. పద. త్వరగా ఎక్కు. లేకుంటే సీటుపోతుంది

బస్‌లో సీటు దొరికింది రాధకు గౌరి! వెళ్లొస్తాను. అక్కడ అమ్మ ఆరోగ్య పరిస్థితినిబట్టి నేను వస్తాను. ఈలోగా నువ్వు మీ గైడ్ఇచ్చిన వర్క్ బాగా చేస్తుండు.

అలాగే రాధా నువ్వు జాగ్రత్తగా వెళ్లిరా.

బస్సు పల్లెటూరికి వచ్చేసింది. రాధ బస్సుదిగి సూట్‌కేస్ చేతపట్టుకొని వస్తూవుంటే దూరం నుంచే ఇరుగు పొరుగు అమ్మలక్కలు వింతగా చూస్తు న్నారు.

అద్దో అక్కడ— రాధమ్మ వస్తావుండాది ఈ పిల్లను చూస్తే వాళ్లఅమ్మకు ప్రాణంలేచొస్తాది. రాధమ్మఅంటే అమెకు పంచప్రాణాలు అని ఒకరికొకరు చెప్పుకుంటున్నారు.

'ఏమ్మా! మీరందరూ బాగున్నారా' అడిగిందిరాధ

మేవంతా బాగానే వుండాంగాని. మీ అమ్మకు అంతకుముందు మీ చెల్లెళ్లు పుట్టినప్పుడు వచ్చినట్టు పెద్దజబ్బు వొచ్చేసింది. అందరూ ఏ దెయ్యమో, పిశాచమో పట్టింది అంటావుండారు అని మూఢంగా మాట్లాడసాగారు అమ్మ లక్కలు.

అది అలాంటిదేమీ కాదు.

ఏమోనమ్మా! అందురూ అనుకునింది మేం చెపావుండాం అంతే

సరే, నేను వెళ్తాను అంటూ వాళ్లను వదిలించుకొని రాధ ఇంటికి వచ్చింది. అమ్మను చూడగానే రాధకు కన్నీళ్లు కుండపోతగా కారసాగాయి. ఎలాగో నిగ్రహించుకొని కన్నీళ్లు తుడుచుకొని నిద్రపోతున్న అమ్మను మెల్లగా స్పర్శించి, అమ్మా! నేనమ్మా రాధను. ఎలావుందినీ ఆరోగ్యం? మెల్లగా పలకరించింది.

ఇప్పుడు కొంచెం బాగానేవుందికదమ్మా. నాకేమీకాదులే. ఎందుకమ్మా ఏడు స్తావు? అంటూరాధతల్లి సావిత్రికూడా కూతుర్ని పట్టుకొని ఏడవసాగింది రాధ కొంత తేరుకొని అమ్మను వూరడించింది. రాధను చూడగానే, అమె అమృత వాక్కులు వినగానే సావిత్రికి వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లు, తనజబ్బు మాయమైనట్లు అనుభూతి కలిగింది.

శారీరక బలహీనతవల్ల చెల్లాయిలు పుట్టినప్పుడు ప్రారంభమైన ఈ ఫిట్స్ ఇంకావదలడంలేదు. అది వచ్చినప్పుడు నిన్ను చూడలేకపోతున్నానమ్మా కాళ్లు చేతులు కొట్టుకుంటూ ఎంత తల్లడిల్లిపోతావో నేనుచూసి భరించలేక పోతున్నాను. హాస్టలలో ప్రతిరోజూ నిన్నుగూర్చి భయంకరమైన కలలు వస్తున్నాయి. అవి నీ విషయంలో నిజంగా జరిగిపోతున్నాయి. ఎలా భరిం చాలి? ఎలా చదువుకోవాలి? అని తన ఆవేదనను వ్యక్తం చేసింది రాధ.

నా దిగులు పెట్టుకొని నువ్వు చదువు పాడుచేసుకోవద్దమ్మా. అన్నీ పక్కకు నెట్టి బాగా చదువుకో. నాకు ఏమీ పరవాలేదులే. అంతా ఆ జగన్నాథుడు శ్రీహరే చూసుకుంటాడు.

అలా అని గాలిలో దీపంపెట్టి దేవుడా! కాపాడు అంటూ ఊరుకుంటామా చెప్పు! నాన్నెక్కడ?

పొలం దగ్గరికెళ్లినట్లుంది అంటూ సావిత్రి ప్రక్కకు తిరిగి పడుకొంటూ వుంటే ఆమె వీపున వాచిపోయిన వాతలు కనిపించాయి రాధకు.
అయ్యో, ఏంటమ్మా ఈ వాతలు
నాకుఫిట్స్ వచ్చినప్పుడు ఆదేదో దయ్యం ఆవరించిందని చింత బర్రలతో, జిల్లేడు మండలతో మునిరత్నం అనే మాంత్రికుడిచేత కొట్టించారమ్మా. ఎంత లెయ్యాలనుకున్నా వాళ్లూవీళ్లు, మీ నాన్న అందరూ కలసినాచేతులు కాళ్లు, భుజాలు అదిమి నొక్కిపట్టుకొని మరీ కొట్టించారు.
అయ్యో తల్లీ ఎలా భరించావమ్మా ఈ హింసలు. నాన్న ఎలా ఒప్పుకు న్నాడు? ఈ చిన్న బిడ్డలంతా ఎలా తట్టుకున్నారు?
మీ నాన్నకూడా ఆ మాంత్రికుడి మాటలేనమ్మాడు. కానీ నా బాధలు పట్టించుకోలేదమ్మా.
'అక్కా! అదుగో నాన్న చేను దగ్గరినుంచి వస్తున్నాడు' అన్నాడు మురళి.
రానీ, నాన్నకు బాగా తెలిసి వచ్చేలా గట్టిగా వివరించి విశ్లేషించి హెచ్చరిక చేస్తాను అంది రాధ.

ఎవ్వరిమాటా వినని నాన్న, నీమాట మాత్రం వింటాడనే నమ్మకం లేదునాకు.
విన్నా, వినకపోయినా, నేను ఏమిచెయ్యాలో, ఎలా చెయ్యాలోచేసి చూపి స్తాను.

'సరే, అదేదో చేసే చూపించక్కా' అన్నాడు మురళి

అంతలో రాధతండ్రి కృష్ణమోహన్ పొలం నుంచి రానేవచ్చాడు

ఏమ్మా రాధ! ఎప్పుడొచ్చావ్ హాస్టల్ నుంచి?

వచ్చి ఒక గంటసేపయింది నాన్నా. నీ కోసమే ఎదురుచూస్తున్నాను.

మీ అమ్మకు ముందులాగా జబ్బు తీవ్రంగా వచ్చిందమ్మా. అందరూ భూతం పట్టిందని, మాంత్రికుడి చేత మంత్రం వేయించమని, అదీ పని చేయ్యకపోతే జిల్లేడు మండలతో కొట్టించమని చెప్పారు.

రాధ చెవులు మూసుకొని, ఇంకాచాల్లే అపు నాన్నా, మీ నోటితో ఈ మాటలు ఎలా అనగలుగుతున్నారేమో కానీ, నేను మాత్రం నా చెవుల్తో ఈ కర్క శపు మాటల్ని వినలేకపోతున్నాను. అది ఏ జబ్బూకాదు ఏ భూతమూ ఆవ రించలేదు. అదికేవలం నరాల బలహీనత. అమ్మపట్ల మీరు మొదటినుంచీ చూపిన నిర్లక్ష్యం, నిర్దయవల్లనే ఇలా అయ్యింది. ఎనిమిది మంది బిడ్డల్ని మోసికని ఇంతగా బలహీన పడిపోయింది.

అదేంటమ్మా అలా అంటావు మీఅమ్మకు మాంత్రికుడు చెప్పినట్లు ఏదోగాలి సోకిందనే అనిపిస్తోంది రాధా.

భూతం పట్టింది అమ్మకు కాదు. మీకు, ఆ మాంత్రికుడికి, ఊర్లోని కాక మ్మలకు. మీ అందరికి పట్టిన ఆపిశాచాన్ని నేనేవదల గొట్టుతాను. ముందు ఆ మాంత్రికుడి ఇంటికి వెళ్ళొస్తానుండు

వద్దమ్మా రాధా! వెళ్ళొద్దు అయునా నిలదీసి ప్రశ్నించావంటే అతను మం త్రం వేసి ఏమైనా చెయ్యగలడమ్మా.

మంత్రంలేదు, ఏమీలేదు. అతనికేం వచ్చు మంత్రాలు. చేత్తోవేపాకులు పట్టుకొని ఏదో జపిస్తున్నట్లు పెదాలు కదిలిస్తుంటాడు. అంతే. అతనికిడబ్బు రోగం పట్టింది. మీలాంటి వాళ్ళని మూర్ఖశిఖామణులుగా చేసి, వేమార్చి పొట్టపోసుకోవడానికి ఈ వేషం వేసి బ్రతుకుతున్నాడు. నాకు అడ్డు చెప్ప కండి నాన్న. వెళ్ళి అతనికి బాగా బుద్ధిచెప్పి రావాలి అంటూ కోపంతో రాధ మాంత్రికుడింటికి వెళ్ళింది.

ఏమయ్యా మాంత్రికుడా? ఎందుకు మా అమ్మను ఇలా చింత బర్రలతో, జిల్లేడు మండలతో గొడ్డును బాదినట్లు బాదావు?

మీ అమ్మకు దయ్యం పట్టిందమ్మా అందువల్ల ఆపని చెయ్యక తప్పలేదు. లేకపోతే మీ అమ్మ మీకు దక్కవుండేదికాదు.

'నీ మాయదారిమాటలు నా దగ్గర చెల్లవు చదువురానిమూర్ఖుల్ని చదువుకున్నా ఆలోచించే జ్ఞానంలేని ఛాందసుల్ని వేమార్చి బ్రతకగలవేమో కానీ నన్ను మోసం చెయ్యలేవు. నువ్వు ఇంకెప్పుడూ మా ఇంటి ఛాయల దగ్గరకుకూడా రావద్దు. వచ్చావంటే పరిస్థితి చాలా తీవ్రంగా వుంటుంది. నేను చదువుకున్న దాన్నని, కఠిన చర్యతీసుకుంటానని గుర్తుపెట్టుకో" అని రాధ మాంత్రికుణ్ణి సహేతుకంగా హెచ్చరించి వస్తూవుండింది. అంతలో ఇరుగు పొరుగు వారంతా రాధమ్మను దూరం నుంచి చూశారు.

ఓ రాధమ్మా! మీ అమ్మకు ఆ జబ్బు మళ్ళీవొచ్చేసింది. పరుగెత్తిరా అని అరిచారు. అయ్యో! మళ్ళీ వచ్చిందా. భగవంతుడా! మాకిదేమి శిక్షస్వామీ! అమ్మను రక్షించుస్వామీ అని వేడుకుంటూ పరుగెత్తి వచ్చింది.

రాధా! నువ్వు అమ్మ చేతుల్ని గట్టిగా నొక్కిపట్టుకో ఓరే, మురళీ! నువ్వు కాళ్ళను గట్టిగా అదిమి పట్టుకో నేను భుజాల్ని పట్టుకుంటాను అంటూ రాధ తండ్రి కృష్ణమోహన్ హడలెత్తి మాట్లాడాడు.

ఏమి కర్మోగానీ ఇది వచ్చిందంటే మూడు, నాలుగు గంటలవరకు వుంటుంది.

ఎలా భరిస్తుందో! ఎంత నొప్పో ఏమో అమ్మకు! ఇప్పుడేమి చెయ్యాలి? ఈ పల్లెటూరులో డాక్టర్‌కూడా లేడు. ఆసుపత్రిలేదు అని విలపించ సాగింది రాధ.

సునీతా! నువ్వెళ్ళి ఆ మాంత్రికుణ్ణి పిలుచుకొని రామ్మా అని కృష్ణమోహన్ తన చిన్న కూతురిని ఆదేశించాడు. నేను వెళ్ళను నాన్నా. వెళ్ళితే అక్క తన్నుతుంది.

వెళ్ళుతావా లేదా? వెళ్ళి అతన్ని అర్జెంటుగా పిలుచుకొనిరా అని కృష్ణమోహన్ సింహగర్జన చేశాడు సునీతను.

ఏంటి నాన్నా అలా కసరుతున్నావ్ చెల్లాయిని ఆ హాస్పత్రికన్నా పిలుచుకొని వచ్చి మళ్ళీ చింత బర్రలతో కొట్టి చంపేస్తారా? ఏంటి కొంచెమైనా ఆలోచన లేకుండా ఇలాంటి కౄరపు పనులు చెయ్యడానికి ఒడిగట్టుతున్నారు? ఇంక ఇంతకన్నా నేనేమి చేసేదమ్మా రాధా.

చెయ్యాల్సింది చాలావుంది నాన్నా ముందు డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాలి మద్రాసులో గొప్ప న్యూరోసర్జన్ డాక్టర్ బి రామమూర్తిగారున్నారు ఆయన అయితేనే అమ్మకు ఈ జబ్బునయం చెయ్యగలరు. మద్రాసులో నాకో మంచి స్నేహితురాలుంది. ఒక పదిరోజులు వాళ్ళ ఇంట్లో వుండి అక్కడ వైద్యం చేయించి తీసుకొస్తాను.

అదంతా నువ్వు అనుకున్నంత సులభంగా అయ్యేపనికాదమ్మా. కనీసం ఐదారువేల రూపాయలన్నా ఖర్చు అవుతుంది. పట్నంలో వైద్యం చేయించడం కష్టం. అంతడబ్బు నాదగ్గరలేదు. అయినా ప్రాణం పోసేది దేవుడు గానీ డాక్టర్ కాదుకదా.

నాన్నా! ఇలాంటి చేతగాని మాటలతో నన్ను రెచ్చగొట్టకండి. మీకు తుమ్ములు, దగ్గులు వస్తేనే డాక్టర్ దగ్గరకి పరుగులు తీస్తారే! అలాంటిది ఈ ఇంటికి దీపం అయిన అమ్మపట్ల ఎందుకంత దయావిహీనంగా మాట్లాడుతారు? జరగరానిదేదైనా జరిగితే ఈ ఆరుమంది పిల్లలు ఏం కావాలి? మీకు సేవలు చేసే దిక్కెవరు?

అలా ఆని పొయ్యేప్రాణాన్ని మనం ఆపగలమా? డాక్టర్ ఆపగలడా? నువ్వు, నేను ఆపగలమా? ఎలా జరగాలో ఆలా జరుగుతుంది.

ఛ, ఇంత మూర్ఖంగా, ఇంత కటువుగా ఎలా మాట్లాడగల్గుతున్నారో నాకర్థం కావడంలేదు మన ప్రయత్నం మనం చెయ్యాలికదా. చేతిలో డబ్బులేకపోయినా అప్పు అయినా చేసి, లేకపోతే ఉన్నపాలమైనా అమ్మి అమ్మను మద్రాసుకు తిసుకెళ్ళి వైద్యం చేయించాలి తప్పదునాన్నా ఇది ని కనీస ధర్మం. బాధ్యత

నాచేతిలో డబ్బులేదు. నేను అప్పు చెయ్యలేను. ఈ సారి పంటలో కూడా అంతా నష్టమే వచ్చింది. అప్పుచేస్తే దాన్ని తీర్చగల్గాలికదా. భూమి అమ్మడం మహాపాపం.

అమ్మ మీకు అక్కరలేదు. కన్నబిడ్డలు ఏమైపోయినా మీకు బాధలేదు కానీ అమ్మ నాకు కావాలి. పాలుతాగే ఈ ఇద్దరు పసిపాపలకు, ఇంకా వున్న ముగ్గురు చిన్నవాళ్ళకు అమ్మ దూరం కాకూడదు నేను నా పిహెచ్ డి స్కాలర్‌షిప్‌డబ్బుల్ని కొంత కొంత దాచుకుంటూ వచ్చాను. ఆ డబ్బుతో అమ్మకు వైద్యం చేయిస్తాను అని తీర్మానించుకుంది రాధ

ఎందుకమ్మా నీకీ శ్రమ. హాస్టల్‌కెళ్ళి నీ చదువు నువ్వు చదువుకో జరిగేదేదో జరుగుతుంది గానీ అంటూ రాధతల్లి సావిత్రి నచ్చచెప్పింది.

ఏమ్మా! నువ్వు అనారోగ్యంతో ఇలాగే వుంటే మేమంతా ఎలా బ్రతకాలి స్వధర్మాల్ని పక్కకునెట్టి పరధర్మాల్ని నిర్వహించారు మీరు మీచేతుల్లో పెరిగి కార్యాలన్నీ చేయించుకుని వెళ్ళిన వాళ్ళుగానీ,ఇంకా మీనీడలో బ్రతికిన మీతో పుట్టువులు, ఇతర బంధువులుగానీ ఎవరైన వచ్చి నిన్ను విచారించారా? వాళ్ళందరికీ కూడా ఇప్పుడు నువ్వు అక్కరలేదు నాన్నకూడా పట్టించుకోలేదు. పైగా డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళొద్దని అడ్డంకులు వేస్తున్నాడు. వాళ్లందరు నువ్వులేక పోతే హాయిగా బ్రతకగలరు కానీ మేంమాత్రం రెక్కలు తెగిన పక్షుల్లా నేలకూలడం తథ్యం. ఇలా కావడం నికిష్టమేనా? లేమ్మాలే నిదానంగా లేచి చీరమార్చుకో. మద్రాసుకెళ్ళాలి

నేను వద్దంటా వుంటే ఏంటి నీ ధైర్యం? మద్రాసుకు పోవడానికి వీలులేదు అంతేఅంటూ పిడుగుపాటుగా, భయంకరంగా అరవసాగాడు. కృష్ణమోహన్.

ఎందుకిలా చేస్తున్నాడో రాధకు అర్థంకాలేదు. నాన్న అంతర్యం ఏమిటోచాలా సేపటికి పసికట్టింది రాధ. నాన్న కీర్తికాముకుడు ఇంట్లో భార్యాబిడ్డలకన్నా బయటమనుషులకే ఎక్కువ ప్రాధాన్యమిస్తాడు. వాళ్లకు ఎన్నోవిధాలుగా సహాయ సహకారాలు చేస్తూపేరు ప్రతిష్ఠలు పొందుతుంటాడు. అలాంటి మనిషి అమ్మను పట్నం తీసుకెళ్లి వైద్యం చేయిలేకపోతున్నాడు. నేనుచేస్తే పదిమందిలో కీర్తినాకే వస్తుందని. తనకు అప్రతిష్ఠవస్తుందని నాన్నభ్రాంతి చెందినట్లుంది. తాను ఈ పని చెయ్యకుండా తప్పుకుంటే నేను తప్పకచేసి తీరుతానని, ఎప్పుడైనా నేను ఈ పనిచేశానని అంటె నిన్నెవ్వరు చెయ్యమన్నారు అని వక్రంగా మాట్లాడటానికి వీలుగా వుండాలనికూడా ఇలా అడ్డంకులు వేస్తున్నట్లుంది అయినా ఇదేం బుద్ధో ఆ బ్రహ్మదేవుడికే తెలియాలి అని మనసులో తీవ్రంగా బాధపడింది రాధ

చుట్టూమూగిన లోకులమ్మలు కూడా రాధను వ్యతిరేకించారు. 'మీ నాయన వద్దంటావుంటే నీకేం మానేయ్' అన్నారు.

అమ్మలారా! అక్కలారా! తల్లులారా! మీకు. మీ ఉచిత సలహాలకు ఓ పెద్ద నమస్కారం. మీరంతా రోగాలొస్తే డాక్టర్ల దగ్గరకు వెళ్ళరా? మీ మీ పతి దేవుళ్ళంతా ఇలాగే మాట్లాడుతారా? మా నాన్న మీకందరికీ దానధర్మాలు చేస్తుంటాడని, భార్యాబిడ్డల నోళ్ళుకొట్టి అడగినవి ఇస్తుంటాడని ఆయన మాటను బలపరుస్తున్నారు. మాతల్లీ బిడ్డలం నాశనం అయితే మీకేం వస్తుంది? ఎందుకిలా నీచంగా అడ్డు మాట్లాడుతారు? మీరు దయచేసిఇక్కడి నుంచి మీమీ ఇండ్లకు వెళ్ళిపోతే మర్యాదగా వుంటుంది. అంటూ రాధ ఒక్కొక్కరిని ఒక్కొక్క చెంప దెబ్బకొట్టినట్లు గట్టిగా మాట్లాడింది. అందరూ మూతులు, చేతులు తిప్పుకుంటూ, నడుం వూపుతూ వెళ్లిపోయారు.

అమ్మా! లే, నిదానంగా బస్సుదాకా నడవాలికదా అని రాధతల్లి చెయ్యిపట్టి లేపబోయింది.

ఎక్కడికి వూరేగుతున్నావ్ పెద్దజోరుగా. ఆ సూట్‌కేసె ఇటివ్వు.

ఏంటి నాన్నా! నాచేతిలో సూట్‌కేస్ లాక్కుంటున్నావ్? నువ్వెన్ని ఆటంకాలు కల్పించినా సరే నేను మాత్రం ఆగేదిలేదు. గతంలో నా పట్టుదల ఎంత పటిష్టమయిందో చాలా సంఘటనల్లో మీకు అనుభవం వుందికదా మళ్ళీఎందుకు నన్ను పరీక్షిస్తారు? అనిరాధ హెచ్చరించింది. ఇంక ఏమీ చెయ్యలేక సూట్‌కేసె క్రిందపెట్టి ప్రక్కకు తప్పుకున్నాడు కృష్ణమోహన్.

కదులమ్మా—. ఎందుకా కన్నీళ్ళు? మంచి పనులకు, మంచి మనుషులకు రాక్షసులు ఇలాగే విఘ్నాలు కలిగిస్తుంటారు. 'శ్రేయాంసి బహు విఘ్నాని, అని పెద్దలంటుంటారు కదా.

అందరూ తల్లిదండ్రులు తమ బిడ్డలు తమను సరిగా చూసుకోలేదని బాధ పడతారు. ఇదేమి కర్మమో, ఇదేమి విచిత్రమోగానీ నిన్ను డాక్టర్ దగ్గరకు తెసుకెళ్ళి వైద్యం చేయిస్తానంటే నాన్న ఇలా అడ్డుపడుతున్నాడు. ఇలాంటి వేదనల్ని బయట ఎవరికైనా చెప్పినా నమ్మరు. ఏమిటో ఇలాంటి

చెప్పుకోలేని బాధలచక్రాల మధ్య ఊహ తెలిసినప్పటినుంచీ నలిగిపోతున్నాను అని దుఃఖించి సాగింది రాధ.

ఐనా ఈ చిన్న వయసులో ఇంత భారం నెత్తినేసుకున్నా వెందుకమ్మారాధా అని సావిత్రి జాలిగా అంది.

నీకువైద్యం చేయిండచమే భారమనుకుంటే నీకు జరగరానిది జరిగి శాశ్వతంగా మాకు కనుమరుగైతే అప్పుడు ఇంతకన్నా చెయ్యిరెట్లు భారం మొయ్యాల్సి వస్తుంది. పిహెచ్.డి మానుకుని చిట్టిపాపలకు తల్లిసేవలు చేయాల్సివస్తుంది. నువ్వు ఆరోగ్యంగా బాగుంటేనే కదమ్మా ఈ ఇల్లు సవ్యంగా సాగేది, నా పిహెచ్ డి వర్కు పూర్తి అయ్యేది. ఈ పిల్లలకు వెలుగు జీవితాలు వచ్చేది. అందుకే కదమ్మా ఈ ప్రయత్నమంతా.

ఏంటోనమ్మా, భగవంతుడు నీకు ఇలాంటి మంచి మనసిచ్చాడు. "బుద్ధి గలిగి బతికితే భూమినేలుతారు' అనే సూక్తి చెబుతుంటారు పెద్దరు. నువ్వు భూమినేలగల్గినంతటి గొప్పదానివి అవుతావమ్మా ఈ రోజుల్లో అందరు కూతుర్లు నీలాగా వుండరమ్మా

ఇది నా కనీస ధర్మం కదమ్మా. పదినెలలు కష్టపడి మోసి, నరకయాతన పడి కని, పెంచి, పోషించి ఇంతటి మనిషి కావడానికి కారకురాలైన తల్లికి ఈ మాత్రం సేవ చెయ్యకపోతే ఈ జన్మకు పరమార్ధమేముంది. మీ అన్న, అక్క, నీ చేతిలో పెరిగిన వాళ్లు, చివరికి నాన్నకూడా పట్టించుకోకపోతే నేనుగాక ఇంకెవరు చేస్తారు? అంటూ రాధ సంభాషణ సాగిస్తుంటే మద్రాసుకు వచ్చేసింది బస్సు.

అమ్మా! మద్రాసువచ్చేసింది. ముందు నా స్నేహితురాలింటికి వెళ్లి స్నానపానాలుచేసి తర్వాత డాక్టర్ దగ్గరికెళ్లాం. అలాగే, పదమ్మా అంది సావిత్రి. రాధ తన స్నేహితురాలైన నిర్మల ఇంటికి తన తల్లిని పిలుచుకొని వెళ్లింది.

హలో నిర్మలా! బాగున్నావా! అమ్మకు ఆరోగ్యం సరిగాలేదు. ఇక్కడ డాక్టర్ దగ్గర వైద్యం చేయించాలని తీసుకొచ్చాను. పదిరోజులు వరకు ఇక్కడే వుండాల్సి వుంటుంది.

దానికేముందిలే రాధా! పదిరోజులు కాకపోతే ఇరవైరోజులుండు నాకెంతో సంతోషం.

సరే, ముందుస్నానాలు చెయ్యండి. తర్వాత భోజనాలు చేసి విశ్రాంతి తీసుకోవచ్చు. రేపు ఉదయం డాక్టర్ దగ్గరికెళ్దాం

అలాగే నిర్మలా!

రాధా! ఇక్కడి డాక్టర్ రామమూర్తిగారు చాలా బాగా చూస్తారు. ఆయన్ను చూస్తేనే చాలు రోగికి జబ్బు నయమైనంత సంతోషం కలుగుతుంది.

కొంతమంది డాక్టర్లకు భగవంతుడిచ్చిన వరం అది. డాక్టర్ అంటే భూలోక దేవుడు. వైద్యో నారాయణహరిః అని కదా ఆర్యోక్తి.

ఇలాంటి సూక్తులు నువ్వు చాలా సుందరంగా చెప్తావ్ రాధా! ఔనుగానీ, అమ్మకు ఫిట్స్ ఎప్పుడు మొదలయింది? ఏయే సమయాల్లో వస్తుంది? వస్తే ఎన్నిగంటలుంటుంది? దానికి ముందు వెనకల ఆమె పరిస్థితి ఎలా వుంటుంది? కుటుంబంలో అమ్మ ఎదుర్కొనే సమస్యలు అన్నీ డాక్టర్‌కి పూసగుచ్చినట్లుచెప్పు డాక్టర్‌కూడా అన్నీ పరీక్షలు జరిపి అసలైన జబ్బేమిటో తెలుపుతారు.

న్యూరోసర్జన్ డాక్టర్‌గారు రాధ తల్లిగారికి అన్ని వైద్యపరీక్షలు చేశారు. మీ అమ్మకు ఏ జబ్బూలేదమ్మా. శారీరకంగా అన్ని పరీక్షలూ జరిపాము. ఆమెకు మానసికి ఆందోళన చాలా అధికంగా వుంది. నలభై ఏండ్ల తర్వాత కూడా ఆమెకు ప్రసవ వేదనలవంటి కష్టాలు భరించవలసి రావడం ప్రమాదమైనవి. ఒంట్లో నరాలు బాగా బలహీనపడ్డాయి ఆమెకు ప్రశాంత వాతావరణం కావాలి. శారీరకంగా కూడా ఎక్కువగా పనులు చేయించకూడదు. అమె మనస్సును నొప్పించకుండా జాగ్రత్తగా చూసుకోవాలి శక్తిరావడానికి నేను రాసిచ్చిన ఈ మందులు, టానిక్కులు, ఇంజెక్షన్లు మాత్రం నాలుగు సంవత్సరాలు విడవకుండావాడాలి అరునెలలు పోయాక మళ్ళీ ఒకసారి వచ్చి కనిపించుండి అన్నారు డాక్టర్

అలాగే డాక్టర్ చాలాథాంక్స్, వెళ్ళొస్తామండీ అని రాధ, రాధ తల్లి సావిత్రి డాక్టర్‌గారికి నమస్కారాలు చేశారు.

ఇక ఇంటికెళ్దాం రండి అంటూ రాధను. ఆమె తల్లిని తన ఇంటికి తీసుకెళ్లి మరునాడు వాళ్ల స్వగ్రామానికి బస్సు ఎక్కించింది. నిర్మల

రాధ, రాధతల్లి సావిత్రి స్వగ్రామం చేరుకున్నారు. వారిని దూరం నుంచి చూసిన అమ్మలక్కలందరూ ఏదేదో గుసగుసలాడుతున్నారు. వాళ్లలో ఒకామె— ఒదినా! రాధ భలే పట్టుదల కలిగిన పిల్ల. పట్టుమని పాతికేండ్లు కూడాలేవు. ఎంత ఘనకార్యం చేసింది వాళ్ళనాయన, మనం అందరంకలసి ఎంతమూర్ఖంగా వద్దన్నా వినకుండా వాళ్ళ అమ్మను మద్రాసుకు పిలుచుకొనిపోయింది. అన్ని వేలు ఖర్చుపెట్టి వైద్యం చేయించి తీసికొస్తావుంది. నీకూ, నాకూవుండారు కూతుండ్లు దేనికి? బిడ్డంటే రాధ మాదిరిగా వుండాల, ఏమైనా సావిత్రి అదృష్టవంతురాలు. మంచికూతుర్ని కనింది' అనిపక్కింటి ఒదినకు చెబుతూ రాధను గొప్పగా ప్రశంసించింది.

ఆనాటి సాయంకాలం చెట్లమీద పక్షుల కిలకిలారావాలు, మెల్లగవీచే మలయ మారుతాలు. లేగదూడల అంబారావాలు రాధ ఔదార్యాన్ని, పట్టుదలను మధురంగా గానం చేశాయి



కోస్తావాణి
2-4-93

# 'పొదపల్లవం'



రాత్రి 11 గంటలయింది. ఇంట్లో అందరూ నిద్రపోయారు.

రాజశేఖర్, నీలిమ ఇద్దరూ పడుకోవడానికి తమ గదిలోకి వచ్చారు.

నీలిమ! తొందరగా బెడ్ వెయ్యావోయ్. నిద్రొస్తోంది అన్నాడు రాజశేఖర్ ఆవలిస్తూ.

అంత తొందరగా నిద్రొస్తేఎలా బాబూ అన్నది నీలిమ బెడ్‌వేస్తూ ఏం చెయ్యా లేవిఁటి అన్నాడు అతను. పాపం! ఏమీ తెలియదు అయ్యగారికి అంటూ వీపుపై చిన్న బోలుదెబ్బ వేసింది నీలిమ.

రాజశేఖర్ నీలిమను అమాంతంగా ఎత్తుకొని గిరగిరాతిప్పి బెడ్‌మీద విసిరేశాడు.

ఎంతదానేను నీకన్నా సన్నగా, చిన్నగా వున్నానే అనుకో ప్రియా! ఇలా రబ్బరు బంతిలాగా మరీ అంత తేలిగ్గా నన్ను ఎత్తేయడమేనా? అన్నది నీలిమ బుంగమూతి పెట్టుకొని ఓరచూపు చూస్తూ.

నీలిమ ఓరచూపుల పూలబాణాలు అతని హృదయాన్ని గుచ్చుకొని గిలిగింతలు పెట్టాయి. మత్తుగా నీలిమ చెంత పవ్వళించాడు.

నీలిమా! నువ్వెంత అందంగా వుంటావో తెలుసా!

ఊహుఁ, తెలియదు.

అయితే చెబుతాను విను.

నీముఖం అరవిందం. నీ కళ్లు కలువలు. నీ ముక్కు సంపెంగ. నీ చెక్కిళ్లు నిలువుటద్దాలు. నీ పెదవులు తలిరాకులు. నీ కంఠం శంఖం. నీ చేతులు మల్లితీగలు ఇకచాల్లే బాబూ నీ ప్రబంధ వర్ణన. మిగిలింది రేపు వర్ణిస్తువులే.

ఏమిటో నీలిమా! నిన్నుచూస్తూవుంటే అలా ప్రవాహరీతిగా వర్ణనలు వచ్చేస్తుంటాయ్.

అహాఁ, అలాగా!

నీలిమా! మనకు పెళ్లై రెండేళ్ళవుతున్నాగానీ నీపై వ్యామోహ దాహంతీర లేదు. నీ అందం రోజురోజుకు పారిజాత పుష్పంలా కొత్తకొత్తగా తేజరిల్లు తోందేకానీ తరగడం లేదు నీ వెప్పుడూ నిత్యవసంతంలా, నిత్యయౌవని అప్సరసలా శోభాయమానంగా రాణిస్తుండాలి.

నా అంద చందాలు ఇంకా నీ కంటికి తాజాగా భాసిస్తున్నాయంటే నీచలువే రాజా!

నువ్వు సౌందర్యరాశివే కాదు నీలిమా! సద్గుణరాశివి కూడా. నీలాంటి ప్రియ భార్య దొరకడం నా అదృష్టం.

కాదురాజా! అది నా భాగ్యం. 'పుణ్యంకొద్ది పురుషుడు, దానం కొద్ది బిడ్డలు' అంటారు వినలేదా?

ఆఁ, విన్నాను. కానీ పురుషుడికి కూడా పుణ్యం కొద్దే భార్య లభిస్తుంది నీలిమా!

సరేలెండి! ఇక పడుకుందాం నిద్రొస్తోంది. రేపు ఉదయాన్నే లేచి ఆఫీసు కెళ్ళాలిగా.

ఇంతకు ముందేమొ అప్పుడే నిద్రపోతేఎలా? ఇంకేమీలేదా? అని ప్రశ్నించావుగా ప్రియతమా! ఇప్పుడు తమరేమొ నిద్రపోవాలంటున్నారు. అప్పుడే నిద్రపోతే నేనూరుకోను.

ఇప్పుడవన్నీ ఎందుకులే, రేపటికి వాయిదావేద్దాం అంటూనే నీలిమ తామర తీగలాంటి తన చేతిని విశాలమైన రాజా వక్షస్థలంపై వేసింది. రాజాకు ఒక్కసారిగా ఒళ్ళు గగుర్పొడిచింది.

ప్రకృతీ పరమాత్మలు ఏకమైనట్లుగా నీలిమా రాజశేఖర్‌లు ఏకమైపోయారు, వారి ఆత్మలు భువి సీమ దాటి స్వర్గసీమలోని నందనవనంలో, మందాకినీ తీరప్రాంతాల్లో విహరించి వచ్చాయి. తనువులు అలసిసొలసి తేలిపోయాయి. మనసులు పరవశించి ప్రణయరాగం పాడాయి.

నీలిమా! ఏమిటోనోయ్ ప్రతిరోజూ మనం కలుస్తున్నా గానీ మన కలయిక పాతబడలేదు. వెగటు అనిపించలేదు. పైగా తొలికలయిక లాగే వింత వింత

అనుభూతులు కలుగుతుంటాయి. ఇది నీ గొప్పతనమే నీలిమా! నీ సహకారం, నీ ప్రోత్సాహంవల్లే నాకు అలా సరికొత్తగా అనిపిస్తుందేమో!

నాదేముందిలే రాజా! ఎందుకో నీ సుందర రూపాన్ని చూడగానే, నీసహృదయతను తలచుకోగానే నా మనసు ఉల్లాసంతో లేడిపిల్లలా చిందు లేస్తుంది. నీ నిర్మల హృదయమే నన్ను అలా ప్రోత్సాహపరుస్తుంది. అది నీ గొప్పతనమే సుమా!

సరేలేవోయ్. ఇద్దరం ఒకరి కొకరు ఇలా స్తుతించుకుంటూ పోతే తెల్లవారిపోతుంది. ఇక నిద్రలేక కళ్ళు ఎర్రబారి ఆఫీసులో కూర్చొని తూగవలసి వస్తుంది. ఈ రాత్రికి ఇదిచాలుగాని నిద్రపోదాం.

ఊఁ అంటూ నీలిమ పక్కకు తిరిగి ఒక చేతిని, ఒక కాలిని తమప్రేమ భర్త రాజాపై వేసి తృప్తిగా నిద్రపోయింది.

నిలిమ. రాజశేఖర్ ఇద్దరూ ఎం. ఎ.లో సహాధ్యాయులు. కులాలు వేరైనా మనసులు కలిశాయి. పెద్దలు వద్దన్నా ప్రతిఘటించి మనువాడారు. పెళ్లి అయ్యాక మూడు, నాలుగు సంవత్సరాలవరకు పిల్లలు వద్దనుకున్నారు. ఇద్దరూ ఉద్యోగం చేసి బాగా డబ్బు సంపాదించాకనే పిల్లల్ని కనాలనుకున్నారు. అందువల్ల ఈలోగా అమర ప్రేమికులైన రాధాకృష్ణుల్లా రసరమ్యంగా ప్రణయ సాగరంలో ఈదులాడి చివరి అంచులు చూడాలనుకున్నారు. అలాగే వారి జీవన ప్రవంతి సాగుతోంది.

పూర్వాద్రిపై సూర్యభగవానుడు రథయాత్ర ప్రారంభించాడు. విశ్వాన్ని అలుముకున్న చీకట్ల పొరలన్నీ పటాపంచులవుతున్నాయి. సమస్త జీవరాశిలో చైతన్య కాంతులు ప్రవేశించాయి. ఉదయాన్నే లేచి ఎవరి పనులు వాళ్లు చేసుకోవడానికి ఉద్యమిస్తున్నారు.

రాజా! తెల్లవారింది లెయ్యి.

ఊఁ— ఉండవోయ్

ఏ విఁటి రాజా! మరీ ఇంత బిలిపి అయిపోతున్నావ్!

నన్నువదులు, నాకు పనుంది!

నాకన్నా మించిన పనేమిటోయ్ నీకు?

ప్రస్తుతం నీకన్నా మించిన పనులే ఉన్నాయి!

ఇల్లూవాకిలి, వంటా వార్పూ పనులు చెయ్యాలి. ఇద్దరు తయారయ్యి ఆఫీసుకు వెళ్ళాలి కాదా!

సరే, వదిలేస్తున్నాలే!

నీలిమ వెళ్ళి హడావుడిగా పనులుచేసుకుంటూ వుంటే, రాజావచ్చి ఆమెకు సహాయం చేస్తున్నాడు

"ఆడుచు పాడుచు పనిచేస్తుంటే అలపూసొలపు లేదుగా' అంటూ ఇద్దరూ గొంతులు కలిపి కూనరాగాలు తీయడం ప్రారంభించారు.

రాజా! నీ కంఠం నీరూపంలాగే చాలాకమ్మగా, గంభీరంగా వుంటుంది.

లేదు నీలిమా! నీ స్వరమే నీ సుందర రూపంలా మధురంగా, లలితంగా వుంటుంది

సరే, ఇద్దరం ఉద్యోగాలు మానేసి యుగళగీతాలు పాడుకుంటూ వుందామా.

పొట్టలు నిండితేనే కదవోయ్ మనం పాడుకునేది. ముందు ఇది ముఖ్యం! తొందరగా బయలుదేరు నీలిమా!

ఇద్దరూ ఆఫీసుకు వెళ్ళారు. రాజశేఖర్ ఆఫీస్ సూపర్‌వైజర్. నీలిమ టైపిస్ట్. వీరిద్దరూ రూపంలో రతి మన్మథుల్లా, ప్రేమానుబంధంలో ఎండాయని జక్కువ పిట్టల్లా వుంటారు. "జంట" అంటే ఇలా వుండాలనిపిస్తుంది సహృదయులైన చూపరులకు. కానీ లోకంలో అందరూ ఇలాంటి దంపతుల్ని చూసి ఓర్వలేరు ఏదో ఒక రీతిలో విడగొట్టడానికి ప్రయత్నాలు పన్నుతుంటారు.

ఆఫీసులో పనిచేస్తున్న ప్రతిమ కొంత సమయం చూసుకొని నీలిమ దగ్గరికి వచ్చింది. నీలిమా! ఇది నీకు తెలుసా! ని రాజాకోసం "పూర్ణ" రోజూ ప్రాకులాడుతోంది. నీ భర్తపై నీకు నమ్మకం వుండచ్చు. కానీ స్త్రీగా అమె వచ్చి మీద పడుతున్నప్పుడు ఏ మగాడైనా వూరుకుంటాడా? ఇలా అంటున్నానని నన్ను ఏమీ అనుకోకు. నీ మేలుకోరి చెబుతున్నా

ప్రతిమా' ఇలాంటి అనుమానపు మాటలు ఇంకెప్పుడూ చెప్పవద్దని ఎన్నో సార్లు చెప్పాను. ఆ అమ్మాయి అలాంటిదే కావచ్చు. కానీ నా రాజా అలాంటివాడుకాడు చేయి చేయి కలిస్తేనేకదా చప్పుడొచ్చేది! నన్ను త్రికరణ శుద్ధిగా నచ్చి, మెచ్చి, శ్రీరామ చంద్రుడి చిత్రపటం ముందు కూర్చొని ప్రమాణం చేసి రాజా నన్ను వివాహమాడారు. అతను తప్పుడు మనిషి అయితే ఈవరకే తెలిసిపోయేది కానీ అతనిలో పరస్త్రీ కాంక్ష ఏకోశాన నాకు కనిపించలేదు. అతను అలాంటి తప్పులు ఎప్పుడూ చెయ్యరు. ఈసారికి మళ్ళీ నిన్ను క్షమించేస్తున్నా. ఇంకెప్పుడైనా ఇలా చెప్పావో ఊరుకోను.

సరే, నీకర్మ అంటూ లేచి మూతి తిప్పుకుంటూ వెళ్ళిపోయింది ప్రతిమ. ప్రతిమలాంటి ఆడవాళ్ళేకాదు. వేరేపని పాటల్లేని అలాంటి మగవాళ్ళూ ఈ సమాజంలో కోకొల్లలుగా వున్నారు. అసూయ ముందు పుట్టి ఆడది తర్వాత పుట్టిందనే లోకోక్తి వుంది కాని మగవాళ్ళకూ అసూయ అనంతంగా వుంటుంది అది మాటల్లోను, చేతల్లోను ప్రస్ఫుటమవుతుంది. అది అనుభవించిన వాళ్ళకు బాగా తెలుస్తుంది.

ఆఫీసులో మరో ఉద్యోగి ఉదయ్ వున్నాడు. అతనికి తన భార్య ఏ విషయంలోనూ సహకరించదు. పైగా విద్యావంతురాలుకాదు ఆమె కేవలం ఒక గృహిణి, తనకులేని సౌఖ్యాలు రాజాకు వున్నాయని, రూపవతి విద్యావతి గుణవతి అయిన భార్య రాజాకు దొరికిందని, వీరిద్దరూ అనన్యమనస్కులై, స్వచ్ఛమైన ప్రేమతో ఆనందంగా జీవిస్తున్నారని ఉదయ్‌కి విపరీతమైన అసూయ.

ఉదయ్ రాజా దగ్గరకు వచ్చి రాజా నీ మేలుకోరి ఒక విషయం చెబుతున్నా, నీ భార్యపై నీకు గట్టి నమ్మకమే వుండవచ్చు కానీ మన ఆఫీసులో నరేంద్ర ప్రతిరోజు నీలిమను చూస్తుంటాడు. ఆ చూపులో ఏదో అత్యాశ, దురాశ రెండూ తొణికిసలాడుతుంటాయి. ఆమెలోని ప్రతికదలికను గమనిస్తుంటాడు. ఇది ఎంతదాకా పరిణమిస్తుందో మనం వూహించలేం కాబట్టి ఎందుకైనా మంచిది నీలిమకు ఒకసారి హెచ్చరిక చేసి వుంచు.

ఏమిటి నీవంటుండేది ఉదయ్! మనుషులన్నాక చూడకుండా, మాట్లాడకుండా వుంటారా? అంతలో మాత్రానికి తప్పుపట్టి అనుమానిస్తూపోతే

మనశ్శాంతే వుండదు. అయినా నాచేత చెప్పించుకునేటంత అమాయకు రాలు కాదు నా భార్య. తనకు విద్యవుంది. విద్యకు తగిన వివేకంవుంది. ఆమెకు చట్టం తెలుసు, న్యాయం తెలుసు. ఎవరైనా వచ్చి పిచ్చి పిచ్చి చేష్టలు చేసినా, వెర్రివాగుడు వాగినా ఎలాంటి చర్య తీసుకోవాలో నా నీలిమకు బాగా తెలుసు. ఇలాంటివి చెప్పి ఇంకెప్పుడూ నన్ను కలతపెట్టకు సహనపరీక్ష చేయకు అని రాజశేఖర్ ఉదయ్‌ని గట్టిగా హెచ్చరించాడు.

సారీబాస్! అంటూ వెళ్ళిపోయాడు ఉదయ్

సతీపతు లిద్దరూ దృఢచిత్తులై, పరస్పరం విశ్వాసపాత్రులై వుంటే మూడో వ్యక్తి ప్రవేశించడానికి వీలుండదు. అప్పుడే దాంపత్య జీవితంలో అపార మైన అమృతా నందం పొంగి పొరలుతుంది.

రాజశేఖర్, నీలిమ ఇద్దరూ సాయంత్రం 5 గంటలకు ఆఫీసునుంచి బయలు దేరారు. ఆఫీసుకు వాళ్ళఇల్లు చాలా దగ్గర. ఇరవై నిమిషాలకంతా నడిచి చేరుకున్నారు ఇద్దరూ ఇంట్లోకి వచ్చి ఫ్యాన్ వేసుకొని సోఫాపై కూర్చు న్నారు.

రాజా! నేను వెళ్లి హార్లిక్స్ కలిపి తెస్తానుండు నువ్వొద్దులే నీలిమా. నువ్వు ముందే పువ్వులాంటి సుకుమారివి. ఎప్పటిలాగే నేనేవెళ్ళి హార్లిక్స్ కలిపి తెస్తాన్లే అంటూ వంటగదిలోకి వెళ్లాడు రాజశేఖర్.

ఇంతలో నీలిమ ఆలోచనా సాగరంలో నిమగ్నమయింది. రాజా ఎంత మంచి వాడు పెళ్లికాకముందు ఎంతగా ప్రేమించాడో, పెళ్లి అయ్యాక కూడా, ఇంతకాలం గడిచాక కూడా అంత శ్రద్ధగా చూసుకుంటున్నాడు నా ఆలో చనలకు, నా ఆశయాలకు ఏనాడూ అడ్డుచెప్పలేదు. పురుషదురహం కారంతో ఎప్పుడూ ప్రవర్తించలేదు. ఇలాంటి పుణ్యపురుషులు లోకంలో చాలా అరుదుగా వుంటారు. భగవంతుడా! నా రాజా మనసు ఎప్పుడూ ఇలాగే వుండేలా చూడుస్వామీ! అని లోలోపల అతని మమతాను రాగాల్ని తలచుకుంటూ దైవాన్ని వేడుకుంటోంది.

రాజా హార్లిక్స్ కలిపి రెండు గ్లాసుల్లో తెచ్చాడు ఏమిటి నీలిమా! ఏదో ఆలో చిస్తున్నట్టున్నావ్! నీ చెక్కిటిపై చెయ్యే చెబుతోంది నీవేదో ఆలోచిస్తున్నా వని.

ఏమీలేదు రాజా! దేవుడులాగా నన్ను చూసుకునే ఈ పతిదేవుడు నాచెంత నుంటే ఇంక ఆలోచించాల్సిందేముంటుంది చెప్పు!

ఆహా, నాకు దేవుడంత స్థానం ఇచ్చేస్తున్నావా—. నా సతి దేవతా అంటూ చిగురాకు వంటి మెత్తని ఆమెపాదాన్ని తన కళ్లకద్దుకున్నాడు రాజా.

ఇలాంటి పనులు చేసి నన్ను మరీ ప్రేమపిచ్చిదాన్ని చేసెయ్యకు నారాజా అంటూ తన రెండు చేతులతో రాజా తలను గట్టిగా పట్టుకొని ముద్దబంతి పువ్వుల్లాంటి అతని రెండు కళ్లపై ప్రేమావేశంతో పెద్దపెద్ద ముద్దులు పెట్టింది నీలిమ. నీలిమ కళ్లల్లోంచి ఆనంద బాష్పబిందువులు రాజాచెక్కిళ్ల పైరాలాయి.

తన సతినే ప్రేమదేవతగా ఆరాధిస్తూ నిండైన అనురాగసుధను క్రోలుతున్న రాజశేఖర్ అదృష్టవంతుడు అంతే మధురానుభూతిని పొందుతున్న నీలిమ అదృష్టవతి.



శుభం (మాసపత్రిక)

**5-2-1997**

# మౌనిక

మహర్షులకు మాటకన్నా లక్ష్యం ప్రధానం వాళ్ళ ధ్యాసంతా భగవంతుడిమీదే. సత్యసంశోధనమీదే, వట్టిమాటలంటే వాళ్ళకు గిట్టవు.

మౌనవ్రతం పాటించే మహర్షుల్లాగే లోకంలోకూడా కొంతమంది ప్రవర్తిస్తుంటారు. అది బాల్యం నుంచే ప్రస్ఫుటమవుతుంటుంది. వారి ఆలోచనంతా కర్తవ్యం మీదే. వాగుడు వ్యవహారమన్నా, కాకమ్మ కబుర్లన్నా వాళ్లకు ఒంటిపై చీమలు పారాడినట్లుగా వుంటుంది

ఎలాంటి వుద్యోగస్థులైనా, ఏ స్థాయి అధికారులైనా ముందుగా విద్యార్థులే, ఆవిద్యార్థి దశలోనే వారి భవిష్యత్ భవనానికి పునాదులేర్పడతాయి. విద్యార్థుల మాట, చేష్ట, నడక వీటినిబట్టే వారి భావి జీవితవైశిష్ట్యాన్ని అంచనా వేయచ్చు.

మౌనిక అందరికన్నా ముందుగా తరగతిగదిలో వచ్చి కూర్చుంటుంది. పుస్తకం తెరచి నిన్నటి పాఠాలు మరోసారి తిరిగి చదువుకుంటుంది తనకు అమూల్యమైన కాలాన్ని వ్యర్థం చెయ్యడం ఇష్టం వుండదు.

సాటి అమ్మాయిలందరూ కాకుల్లా మౌనికను పొడుచుకు తింటుంటారు. పుస్తకాల పురుగని, లోకం తెలియని పక్షి అని, మనతో కలవదని, ఇంకా వాళ్ల నాలుకలు ఎలా తిరిగితే అలా అంటుంటారు.

వీళ్లకెప్పుడూ ఇదేపని. వీళ్ళందరూ బడికి వచ్చేది చదువుకోసంకాదు. కేవలం కాలక్షేపం కోసం. పెద్దవాళ్ళ బలవంతాల కోసం అందువల్ల వీళ్ళు మౌనిక తత్వాన్ని అర్థం చేసుకోక వేధిస్తుంటారు.

ఏమే మౌనీ! నీకు మాతో మాట్లాడాలనిపించదా? ఎప్పుడూ చదువేనా? కాసేపు సినిమాలనీ, అవనీ, ఇవనీ మాట్లాడుతుండాలి అని పద్మిని మౌనికను ప్రశ్నిస్తూ హెచ్చరిక చేసింది.

నాకు మీపైన స్నేహభావమేవుంది. కానీ మీరు మాట్లాడే మాటలు నాకు ఎందుకో నచ్చుతం లేదు విలువైన కాలాన్ని చదువులకు వుపయోగిస్తే తరగతిలో టీచర్ అడిగే ప్రశ్నలకు బాగా సమాధానాలు చెప్పచ్చు. టీచర్ కూడా ఎంతో సంతోషిస్తారు పరీక్షల్లో మార్కులు కూడా ఎక్కువగావస్తాయి. మన ఇంట్లో వాళ్ళూ సంతోషిస్తారు. ఇక సినిమాలంటావా మా ఇంట్లో సినిమాలు చూడనివ్వరు. వాళ్ళకు తెలియకుండా దొంగచాటుగానైనా చూసి తీరాలనే కోరికా నాకులేదు. తరగతి పుస్తకాలు, దుస్తులు, ఫీజులు వీటికి తప్ప మా నాన్న నాకోసం ఒక్కపైసా కూడా ఖర్చుపెట్టరు. నాకు అత్యవసరమైన వన్నీ మానాన్న స్వయంగా తీసుకొచ్చిఇస్తారు. నా చేతికి డబ్బులుగా ఇవ్వరు. అని తన విషయమంతా స్పష్టంగా చెప్పింది పద్మినికి.

అంతలో రాణి అందుకొని దాన్ని ఎందుకు అడుగుతావే పద్మినీ, అది ఎప్పుడూ సర్వసంగపరిత్యాగిలాగో, మహాత్ముడు లాగో మాట్లాడుతుంది. దాని మాటలు వింటే మనకూ వైరాగ్యం వచ్చేస్తుంది. రావే! సినిమాకు టైం అయ్యింది వెళదాం. క్లాసుకు రేపు వెళ్ళవచ్చుగానీ అని నూరిపోసి పద్మినిని సినిమాకు లాక్కెళ్ళింది.

అమ్మయ్య! వీళ్ళ పోరు తప్పిందిరాబాబూ అనుకుని మౌనిక మళ్ళీ పుస్తక లోకంలోకి వెళ్ళింది. ఈ సంవత్సరం పదవ తరగతికాబట్టి ఇంకా పట్టుదలగా చదువుతోంది మౌనిక.

ఇంతలో తరగతి గదిలోకి సైన్సు టీచర్ రాజారావుగారు ప్రవేశించారు నిన్నటి పాఠాలకు సంబంధించి ఒక్కొక్కరినీ లేపి ప్రశ్నిస్తున్నారు. తరగతిలో ముప్పైమంది విద్యార్థులు ఎవ్వరూ మాస్టారు అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పలేదు.

చివరగా సైన్సు మాస్టారు మౌనికను లేపి ప్రశ్నించాడు. లేచి, చేతులు కట్టుకుని ఆయన అడిగిన ప్రశ్నకు సమర్థవంతంగా, సూటిగా సమాధానం చెప్పగలదని. అందుకే అందరినీ ప్రశ్నించిచివరిగా మౌనికను ప్రశ్నించాడు.

చూడండ్రా! వెధవల్లారా! ఈ పాప ఎంత చిన్నగా వుందో, ఎంత బాగా చదువుతుందో, మీరంతా ఏనుగుల్లా, గుజ్జాల్లా వున్నారు. ఏమి చెయ్యను?

ఎప్పటి పాఠాలు అప్పుడే చదువుకోవాలనే బుద్ధిలేదు మీకు. ఎన్నిసార్లు మంచిగా, మెల్లగా చెప్పాలి? ఈ సారికి క్షమించేస్తున్నాను. రేపటి నుంచి సరిగ్గా చదువుకొని రాకపోయారో మీచేత గోడకుర్చీ వేయిస్తాను జాగ్రత్త అని బెదిరించారు సైన్సు మాస్టారు తరగతిలో విద్యార్థుల్ని ఆరోజు చెప్పాల కున్న సైన్సు పాఠం చెప్పేసి గదిలోంచి వెళ్ళారు సైన్సుమాస్టారు

ఇక తోకతొక్కిన త్రాచుల్లా, తప్పతాగిన కోతుల్లా మౌనికమీదికి అసూయా ద్వేషాలతో విరుచుకుపడ్డారు సాటి విద్యార్థినీ విద్యార్థులు.

ఏమండీ మౌనికగారూ! ఇప్పుడు నీకళ్లు చల్లబడ్డాయా? నీ కడుపు నిండిందా? మాస్టారుచేత మమ్మల్ని నువ్వు తిట్టించావు నువ్వామాలాగా సమాధానం చెప్పకుండా ఊరుకుండుంటే మాకు ఈ తిట్లుండేవికావు. నీవేమో మంచిదానివనిపించుకోవాలని, బాహ్యలోకంతో సంబంధం వదలి పెట్టి పుస్తకాలతోనే మాట్లాడుకుంటూ వుంటావు. మేము అట్లా వుండలేం. నువ్వుగాని తరగతిలో లేకపోతే మాకు హాయిగా వుంటుంది అని రమణి వివేకం కోల్పోయి గొంతు చించుకొని మౌనికను అనౌచిత్యంగా కేకలేసింది.

ఇంతలో ప్రభ ముందు కొచ్చి ఎందుకు రమణీ, ఆ తల్లితో మాట్లాడ తావ్? నువ్వు ఎన్ని అన్నా ఆమె మాత్రం మనవైపురాదు. మహామునిలా విద్యాతపస్సును మాత్రం మానదు. తరగతిలో మనకు తిట్లూ తప్పవు అని మౌనికపై వ్యంగ్య బాణాలు విసరసాగింది.

గోడకైనా చలనం వస్తుందేమో కానీ ఆ అమ్మాయి వ్యక్తిత్వానికి మాత్రం చలనం రాదు. తుఫాను కూడా ఏమీచేయలేదు. మనమంతా ఎంత పట్టుదలగా మౌనికను కదిలించినా తాను మాత్రం మనమాట వినదు ఎం దుకు ఆ అమ్మాయిని అంతగా నొప్పించడం అంటూ రాజీని, పద్మినిని పిలుచుకొని హోటల్ కెళ్ళి పోయాడు రాజా.

ఇలా ఒక్కొకరు. ఒక్కొవిధంగా మౌనికను ఎత్తిపొడుపు మాటలు అనేసి పోతుంటే మౌనిక లోలోపల ఎంతో దిగులు చెందింది. కన్నీళ్ళు సుళ్ళు తిరిగాయి ఏమిటీ మనుషులంతా నేనేమిటో, నాపనేమిటో అని

నా పరిధిలో నేనుండి చదువుకుంటూ వుంటేకూడా అదేదో నేరమైనట్లు నా మీద రాక్షసుల్లా పడుతున్నారు. ఇలాంటి వాళ్ళతో కలసి ఎలా చదువు కోవాలి? కర్తవ్యాన్ని వదిలేసి వీళ్లు చెడిపోతున్నది కాక నన్నుకూడా చెడ గొట్టాలని చూస్తున్నారు అని తర్కించుకుంటూ పడ్డవాడు చెడ్డవారుకారు అనే లోకోక్తిని తలచుకుంటూ నెమ్మదిగా ధైర్యం తెచ్చుకొని ముందుకురు కుతున్న కన్నీళ్ళను కను రెప్పలతో తటపటాయించి ఆపుకున్నది.

ఇంతలో రెండో పీరియడ్ సోషియల్ మాస్టారు రంగపతి గారు గది లోకి ప్రవేశించారు. ఆయన వచ్చేసరికి తరగతి పలచబడింది. అందరూ అటూ ఇటూ వెళ్ళిపోయారు.

ఏమ్మా! మౌనికా! ఏమయ్యారు వీళ్లంతా అని అడిగారు మాస్టారు. ఎవరెవరు ఎక్కడికెళ్ళారో అంతా తెలిసినా కూడా మాస్టారికి చెబితే వాళ్లు వచ్చి దయ్యాల్లా మీదపడతారని భయపడి ఏమోసార్! నాకు తెలియదు అని తనకు వాళ్ళను గూర్చి ఏమీ తెలియనట్లు చెప్పింది మౌనిక.

సరేమ్మా, నీకొక్కదానికి ఏమి చెబుతాను కానీ నువ్వు ఏదైనా చదు వుకో. రేపు అందరూ వచ్చాక కొత్తపాఠం మొదలు పెడుతానన్నారు మాస్టారు. అలాగేసార్ అంటూ మౌనిక సోషియల్ పుస్తకం తీసుకొని చదువుకో సాగింది.

తరగతి గది ఖాళీగా వుండేసరికి ఎవరైనా లోపల వున్నారేమోనని వచ్చి తొంగి చూసింది తొమ్మిదో తరగతి చదువుతున్న రాధ.

మౌనీ! ఏంటీ నువ్వొక్కదానివే కూర్చొని చదువుకుంటు న్నావ్! అందరూ ఏమయ్యారు? ఈ రోజు క్లాస్ చెప్పలేదా మాస్టారు అని అడిగింది. రాధకు విషయమంతా చెప్పింది మౌనిక.

మౌనికకు అంత పెద్ద పాఠశాలలో ఒకే ఒక్క మంచి స్నేహితురాలు రాధ. రాధకూడా మౌనిక వయసే. చిన్నప్పుడు ఏదో జబ్బు చేసి సరిగ్గా పరీక్షలు వ్రాయలేక పోతే ఏడవ తరగతి తప్పింది. అందువల్ల రాధ ఒక తరగతి వెనక బడింది

రాధా! మనం ఒకరి జోక్యానికి పోకపోయినా కూడా ఇతరులు మనల్ని ఎందుకు బాధిస్తారో ఏమో! మనం ఎవ్వరినీ ఒకమాట అనం ఎవ్వరినీ మాటలతోగానీ, చేష్టలతో గానీ నొప్పించం ఎదుటివాళ్ళు నోరుండక, అజ్ఞానంతో నానా మాటలు అంటున్నాగానీ తిరిగి ఏమైనా అంటే ఎక్కడ బాధపడతారోనని సున్నితంగా ఆలోచిస్తాం కానీ మనపట్ల వాళ్లు ఇలా ఆలోచించడం లేదు. నాకైతే చాలా వేదనగా వుంది అని మౌనిక మనసు విప్పి రాధకు చెప్పుకున్నది.

ఏం చేస్తాం మౌనీ! భగవంతుని సృష్టిలో ప్రతి చరాచర వస్తువుల్లోను మంచి, చెడు అనే రెండు రకాలున్నట్లుగా మనుషుల్లోనూ వుంటారు. అందరూ మనలాగే వుండరు. అందరికీ అంత జ్ఞానం వుండదు. మానవత్వం అందరిలోనూ గుబాళించదు. మనమే వాళ్లను కేర్ చెయ్యకూడదు. వీలైనంతవరకు దూరంగా వుండాలి. అప్పుడే వాళ్లకు బుద్ధి వస్తుంది. దుష్టోదూర వర్జితః అన్నారు కదా పెద్దలు. నీకు తెలుసుకదా మౌనీ! చదువులేకనేకదా మన పెద్దవాళ్లు ఇంకా ఎంతోమంది సుఖశాంతులు లేక చీకటి బతుకులు బతుకుతున్నారు కాబట్టి మనకు అదుర్గతి పట్టకూడదు. చదువు ఒక్కటే మనకు సంతోషాన్నిస్తుంది జీవితానికి వెలుగును, విలువను ఇస్తుంది. ఈ మోసాల కలికాలంలో చదువే మనకు తోడూనీడా అవుతుంది. అందువల్ల ఆ చదువుపైనే దీక్షగా మనసులగ్నంచేస్తే ఈ గుంపుల అరుపులేవీ మన చెవిని పడవు. సరేనా! ఏమిటో, మౌని! అన్నీ నువ్వేనాకు చెప్పేదానివి. నువ్వు ఇలా దిగులు పడుతుంటే నాకు ఇంకా బాధగా వుంది. అంటూ మౌనికను ఓదార్చింది రాధ.

తలనొప్పిగా వుందంటూ మౌనిక రాధ భుజంపై తలవాల్చింది. భుజం మీద వద్దులే ఒడిలో తలపెట్టి పడుకో అంటూ తన ఒడిచాచి మౌనికను పండబెట్టుకున్నది రాధ.

కాసేపు అయ్యాక మౌనీ! భోజనం టైం అయిపోతోంది. ఇంటికి బయలుదేరుదామా అన్నది రాధ.

అలాగే అంటూ లేచింది మౌనిక. ఇద్దరూ వాళ్ళవాళ్ళ ఇళ్ళకు వెళ్లి భోజనం చేసి మధ్యాహ్నం రెండు గంటలకంతా బడికి వచ్చేశారు.

ఇలా రాధా మౌనికలు ఒకరి కొకరు స్నేహ సుగంధాలు వెదజల్లు కుంటూ, శ్రద్ధగా చదుపు కుంటూ కాలం గడప సాగారు.

పదవ తరగతి పరీక్షలు దగ్గరయ్యాయి మౌనీ ని పరీక్షలయ్యాకనే నేను మీ ఇంటికొస్తాను. నువ్వుబాగా చదివి పరీక్షలు వ్రాయి అని హెచ్చ రిస్తూ శుభాకాంక్షలు చెప్పింది రాధ

అలాగే అని చిరునవ్వుతోనే సమాధానం చెప్పింది మౌనిక. పరీక్షలు రానే వచ్చాయి. అన్ని పరిక్షలు చాలా బాగా వ్రాసింది మౌనిక. తానే స్కూల్ ఫస్టు వచ్చింది.

రాధ సంతోషానికి అవధుల్లేవు. ఎంత అదృష్టం మౌనీ! నేను అను కున్నట్లే నీకే అందరికన్నా ఎక్కువ మార్కులు వచ్చాయి. ఇంతకన్నా ఆనందం ఏముంటుంది చెప్పు అన్నది రాధ

అదంతా దేవుని దయ రాధా మనం బాగా వ్రాసినంత మాత్రాన మనకే ఫస్టు మార్కులు రావాలని ఏముంది? ఫస్టు మార్కులు వచ్చాయి, అంటే అది భగవంతుని చలువే అంటూ ఆ ఘనతను భగవంతునికే అప్ప గించింది మౌనిక. అలా అనడమే నీ ప్రత్యేకత అన్నది రాధ.

ఇన్నాళ్లూ ఓర్వలేక తలకొక్కమాట అంటూ మౌనికను పీడించిన కాలక్షేపం విద్యార్థులు, సరదా విద్యార్థులు, మౌనిక ముందు తలలు దించు కోక తప్పలేదు. కానీ మవునిక మాత్రం హాహాకారాలతో విర్రవీగకుండా. ఎగిరి కేరింతలు కొట్టకుండా ఎప్పటిలాగే వినయ విభూషితురాలై మవునంగా వుంది. నిండుకుండ తొణకదుకదా.



శుభం (మాసపత్రిక)
5-6-98

# విద్యార్థి



పిల్లలు చదువుకోవడానికి ఇల్లువదలి దూరంగా వెళ్ళుతున్నప్పుడు తమవంతు బాధ్యతగా కొంతమంది పెద్దలు కర్తవ్య ప్రబోధం చేసి, నీతి మాటలు చెప్పి పంపుతారు. ఇది కనీస ధర్మం.

బాబూ! పెద్ద చదువు చదువుకోవడానికి పట్నం వెళ్ళుతున్నావు. జాగ్రత్తగా చదువుకో నాయనా. ఎందుకంటే 'తా చెడ్డ కోతి వనమెల్ల చెరచు అన్నట్లూ చుట్టూ చీడపురుగుల్లాంటి వాళ్ళుచేరి చెరచడానికి ప్రయత్నిస్తారు ఎవరెన్ని ప్రయత్నాలు చేసినా వాళ్ళకు లొంగకుండా 'నువ్వేంటో నీ చదువేంటో' అంతవరకే వుండు అని సురేశ్ తల్లి సురేశ్ బయలు దేరుతుంటే హెచ్చరిక చేసింది. గురువులపట్ల భయ భక్తులతో, వినయవిధేయతలతో వుంటూ శ్రద్ధగా చదువుకో సురేశ్ అని సురేశ్ తండ్రి కూడా తనవంతు హిత బోధచేశాడు.

అమ్మా! నేను చిన్నప్పటినుంచి ఇలాగే నా పరిధిలో నేనుంటూ శ్రద్ధగా చదువుకుంటున్నాను. ఇకమీదట కూడా నా హద్దుల్లో నేనుంటూ జాగ్రత్తగానె చదువుకుంటాను. చదువుపై, కర్తవ్యంపై శ్రద్ధలేని వాళ్ళు ఎన్నెన్ని సమస్యలు సృష్టిస్తారో, ఎన్నెన్ని హింసా కృత్యాలు చేస్తారో, చెడగొట్టడానికి ఎంతగా ప్రయత్నిస్తారో, నేను కళ్ళారా చూశాను. అలాంటి వాళ్ళకు చాలా దూరంగా వుండి చదువుకుంటాను. నువ్వు దిగులు పడకుండా ధైర్యంగా వుండమ్మా! అంటూ సురేశ్ కన్నీరు తుడుచుకుంటున్న తల్లిని ఓదార్చి ఎం ఎ. చదవడానికి పట్నం వెళ్ళాడు.

సురేశ్ హాస్టలలో చేరాడు. గదిలో తనతో పాటు నలుగురు అబ్బాయిలున్నారు. రవి, రాజా పాలిటిక్స్ విద్యార్థులు. సురేశ్, ప్రకాశ్ హిస్టరీ విద్యార్థులు కాకుల మధ్య చిలకలా దురదృష్టవశాత్తు సురేశ్ వాళ్ళగదిలోచేరాడు. సురేశ్ క్లాసకు వెళ్లడానికి తయారవుతున్నాడు.

ఏరా సురేశ్! క్లాస్‌కు వెళ్ళతావా?

ఏం! నువ్వురావా? ప్రకాశ్ —

ఏంట్రా! చిన్న స్కూల్ పిల్లాడిలా క్లాసకు పోవడం? ఆదేంట్రా ప్రకాశ్! విచిత్రంగా మాట్లాడుతున్నావ్! మనంహాస్టల్‌లో చేరింది తినేసితిర గడానికా? క్లాసకెళ్లి చదువుకోవడానికా?

నువ్వు చాలా అమాయకుడిలా వున్నావ్ సురేశ్! మనం మగాళ్ళం మూతిమీద మీసం వున్నమగాళ్ళం. ఈ వయసులో బాగా ఎంజాయ్ చెయ్యాల్రా! ఆడపిల్లల్లాగా పుస్తకాలు పట్టుకొని క్లాసుకెళ్ళి కూర్చోకూడదు.

ఎంజాయ్ చెయ్యాలంటే ఎం.ఎ. నెపంతో హాస్టల్లో చేరి చెయ్యాలా? ఇంట్లో వుండే సినిమాలని షికార్లని తిరుక్కుంటూ ఎంజాయ్ చెయ్యొచ్చుగా, చదువు మీద శ్రద్ధ లేకుంటే కోర్సులో చేరడమే దండగ. నువ్వు చేరకుంటే ఈ సీటు మరెవ్వరికైనా శ్రద్ధ కలిగిన విద్యార్థికి దక్కేదికదా ప్రకాశ్.

నాకు చదువుమీద శ్రద్ధలేదుకానీ, సుఖంగా బ్రతకడానికి, సమాజం లో గౌరవాన్ని సంపాదించుకోవడానికి డిగ్రీ కావాలి. అంతేకానీ విజ్ఞానం కోసం నేను చేరలేదు. విందులు, విలాసాలతో ఎంజాయ్ చెయ్యడమే నాకు ముఖ్యం.

నువ్వు ఇంత నిస్సంకోచంగా, అసంగతంగా ఎలా మాట్లాడగల్గుతున్నావోగానీ, నీ మాటలు వింటుంటే నాకు చాలా వింత, విడ్డూరంగా వేదనగా వుంది ప్రకాశ్.

నీకు వేదనగా వుంటే నువ్వు క్లాస్‌కెళ్ళి బుద్ధిగా చదువుకో. అంతేకానీ నన్ను క్లాసుకు రమ్మని మాత్రం నీతిబోధ చెయ్యకు అని ప్రకాశ్ అనడం తో సురేష్ ఒక్కడే క్లాస్ కెళ్లాడు.

ఆ రోజున హిస్టరీ సార్ పద్మనాభంగారికి ఎందుకో "విద్యార్థి" లక్షణాల్ని గూర్చి చెప్పాలనిపించింది. తరగతికి నలభైమంది రావలసి వుండగా నలుగురు మాత్రమే వచ్చారు. తరగతికి వచ్చినవాళ్లందరూ బుద్ధిమంతులే. కానీ, తరగతికిరాని విద్యార్థుల్ని దృష్టిలో పెట్టుకొని పద్మనాభంగారు ప్రసంగించడం ప్రారంభించారు.

"విద్యను అర్థించేవాడు విద్యార్థి అవుతాడు. విద్య ఒంటపట్టాలంటే విద్యార్థి వినయ విధేయతలతో మెలగాలి. కానీ నేడు కొంతమంది విద్యార్థులు చేస్తున్నది, కోరుతున్నది తద్విరుద్దమే. గురువుల పట్ల ఎంతో వినయంతో, విద్యపై తదేక దీక్షతో వుంటూ చదువుకోవలసిన విద్యార్థులు కొందరు వ్యసనాల రొంపికి మరుగుతున్నారు. బుద్ధికలిగి చదువుకుంటూ గురువుల వాత్సల్యానికి పాత్రులైన సహ విద్యార్థుల పట్ల అసూయ ద్వేషాల విషజ్వాలలు క్రక్కుతున్నారు. ఉత్తమ గురువులనుంచి ఎన్నోరకాలుగా ఉపకారాలు పొందుతూనే అపనిందల శరాలు విసురుతున్నారు. తాము చెడేదికాక సహ విద్యార్థుల్ని చెడగొట్టడానికి ప్రయత్నిస్తున్నారు. ఇలా చేయడం చాలా తప్పు. విద్యార్థుల్లో ఈ దుస్థితి పోవాలి" ఏమంటావ్ సురేశ్ అన్నాడు పద్మనాభం

గురువుగారి వాక్యాల్ని శ్రద్ధగా వింటున్న సురేశ్— "మీరు చెప్పినవి నూటికి నూరుపాళ్ళు నిజం సార్. అందరూ మీలాగా మంచి, చెడుల్ని విశ్లేషించి చెప్పే ఉత్తమ గురువులే వుంటే ఈ దేశం ఎప్పుడో బాగుపడేది. కాని గురువులందరూ మీలాగే వుండరు సార్. విద్యార్థుల్లోని బలహీనతల్ని అజ్ఞానాన్ని, దురలవాట్లను పెంచి పోషిస్తూ తాత్కాలికంగా వాళ్లకు సంతోషాన్ని కలిగిస్తూ స్వార్థ ప్రయోజనాల్ని పొందుతుంటారు. మరి కొందరు సహోద్యోగుల కీర్తి ప్రతిష్ఠల్ని చూసి ఓర్వలేక విద్యార్థుల్ని చెడు ప్రచారాలకు సాధనాలుగా వాడుకుంటూ వుంటారు. అందుకే చాలావరకు విద్యార్థి లోకం ఇలా దిగజారిపోతోంది అని సురేశ్ ఎంతో వినయంగా, వివేకంగా గురువుగారికి విన్నవించుకున్నాడు.

చిన్నవాడివైనా ఎంతో లోతుగా ఆలోచించి వాస్తవాన్ని వెలికితీసిచెప్పావు సురేశ్. నాకు చాలా సంతోషంగా వుంది. కానీ నా దృష్టిలో విద్యార్థులైనా, పాఠాలు నేర్పే ఏ స్థాయి గురువులైనా వాళ్లవాళ్ళ విధ్యుక్త ధర్మాల్ని అంకితభావంతో. చిత్తశుద్ధితో నెరవేర్చాలి. మనం కోర్సులో ఎందుకు చేరాము. అని విద్యార్థి, మనం ఉద్యోగంలో ఎందుకు చేరాము అని గురువు ఇద్దరూ ఆత్మ పరిశీలన చేసుకోవాలి. ఎవరు కర్తవ్యాన్ని వదలి ప్రక్కదారిపట్టి దుర్మార్గంలో ఆలోచిస్తున్నారో ఎవరు ఇతరుల్ని వేధించి రాక్షసానందం

పొందుతున్నారో అలాంటి వాళ్లలో మంచి మార్పురావాలి. గౌరవనీయులైన గురువులమీద చెడ్డప్రచారాల రాళ్లు రువ్వుతూ ద్వేషించడానికి కంకణం కట్టుకుంటే విద్యార్థికే తీరనినష్టం. ఇలాంటి విద్యార్థుల వల్లనే విషాద మేఘాలు కమ్ముకుంటాయి. క్రోధాగ్ని కీలలు ప్రజ్వరిల్లుతాయి. ప్రశాంత వాతావరణం పూర్తిగా పోతుంది.

జాన్‌సార్! అనాలోచితమైన ఆవేశం వల్ల, అజ్ఞానం వల్ల, ఇతరుల దుర్బోధల వల్ల తమ చదువుల్ని తమ కాలాన్ని, శక్తిని వ్యర్థం చేసుకునే తత్వం చాలావరకు మా విద్యార్థుల్లోనే కనిపిస్తుంటుంది. ఉడుకురక్తంతో రెచ్చిపోతూ దుడుకు పనులు చేసే విద్యార్థులు క్రమేణా ఈమనస్తత్వాన్ని పోగొట్టుకోవాలి. చదువు మార్గంవైపు మనస్సును మళ్లించుకొని సంస్కారంగా ప్రవర్తించాలి లేకుంటే విద్యార్థిదశలో నష్టపోయినందుకు, ఇతరుల్ని చెడగొట్టి వేధించినందుకు తర్వాత పశ్చాత్తాపం చెందాల్సి వుంటుంది. అందుకే సార్ నేను అలాంటి వాళ్ళకు చాలా దూరంగా వుంటూ కర్తవ్యం చేసుకుంటూ వుంటాను.

సురేశ్! నువ్వుఎంతో అనుభవం వున్నవాడులా నా మాటల్ని అంత గొప్పగా సమర్థిస్తున్నావు. నీకింత ఆలోచన, అనుభవం ఎలా వచ్చింది? అడిగాడు పద్మనాభం.

మా అన్నయ్య కూడా ఒక విద్యా సంస్థలో అధ్యాపకుడే సార్. సాటి ఉద్యోగస్థులు చాపకింద నీరులా తనపట్ల పెట్టే కుట్రలను, కుతంత్రాలను, వాళ్ళ వల్ల కలిగే కష్టాల్ని, నష్టాల్ని, విద్యార్థుల్ని కీలుబొమ్మలుగా చేసుకొని వాళ్ళద్వారా పెట్టించే అవమానాల్ని, హింసల్ని చెప్పుకొని బాధపడుతుంటాడు. భగవంతుడికి నివేదించుకొని కన్నీరు కార్చుతుంటాడు. భరించరాని శిరోవేదనతో విలవిలలాడుతుంటాడు. "నీరు పల్లమెరుగు నిజము దేవుడెరుగు" "లోగుట్టు పెరుమాళ్ళకెరుక" అన్నట్లు మా అన్నయ్య పడే వేదన ఆ భగవంతుడికే ఎరుక. ఆయనకు కలిగిన అనుభవాల్ని దృష్టిలో

పెట్టుకొని మాట్లాడాను అంతేసార్.

ఏమైనా నువ్వొక విద్యార్థిగా వుండుకొని సంయమన దృష్టితో, వినయ విధేయతలతో, సత్య వివేచనతో మాట్లాడుతున్నందుకు నాకు చాలా ఆనందంగా వుంది సురేశ్. కామ, క్రోధ, లోభ, మోహాదులకు, వ్యసనాలకు గురి అయ్యే విద్యార్థులవల్ల ఒక్క విద్యా సంస్థకేకాక సమస్త లోకానికీ హాని జరుగుతుంది. విద్యార్థులు ఈ విషయాన్ని గూర్చి నిశితంగా ఆలోచించి సాధనచేసి సద్గుణాలను పెంపొందించుకోవాలి. సరే ఇంతటితో ఈ ప్రసంగం ముగిద్దాం. రేపటినుంచి సబ్జెక్టు చెప్పుకుందాం అంటూ పద్మనాభంగారు తరగతి గది నుంచి వెళ్లారు.

హిస్టరీ రెండో పేపర్ చెప్పే నీలకంఠంగారు వచ్చి అరో తరగతిలో నలుగురే వున్నారే! రేపు పాఠం చెప్పుకుందాంలే వెళ్ళండి అని చెప్పి తానూ వెళ్లారు.

ఈ సార్కన్నా పద్మనాభం సార్ ఎంతో మేలుగా వుంది. విద్యార్థులు ఎలా ప్రవర్తించాలో వివరిస్తూ నీతిబోధ చేశారు. గురువంటే అజ్ఞానపు చీకట్లను పారద్రోలి జ్ఞాన తేజాన్ని వెలిగించేవాడని అర్థంకదా ఈ నీలకంఠం సార్ ఒక్క నీతి వాక్యమైనా చెప్పకుండా వెళ్లార్రా! భలే మనిషిరా! అని సూర్యతేజ అంటే, పానీలేరా గురువుల్లో తప్పులు వెదకడమెందుకు? సానుకూలంగా అర్థం చేసుకోవాలి కానీ విరుద్ధంగా ఆలోచించకూడదు ఏదో పని వుండి వుంటుంది. అందుకే వెంటనే వెళ్లాడు అని విజయ్ నీలకంఠం సార్ మాటను సమర్థించాడు.

సురేశ్ క్లాసునుండిహాస్టల్ కెళ్లాడు. రవి, రాజాలిద్దరూ కలసి ఏరా సురేశ్! బాగా కలర్ వేసుకొని వచ్చావా? అన్నారు

కలర్ ఏంట్రా! అన్నాడు ఆశ్చర్యంగా సురేశ్

వీడిముఖానికి "కలర్" అంటేకూడా తెలిసినట్లు లేదుగురూ! అన్నాడురాజా

అదేదో వీడికి సూటిగా చెప్పేయ్రా అన్నాడు రవి.

కలర్ అంటే రంగురంగుల సీతాకోకచిలుకల్లాంటి అందమైన అమ్మాయిలు అని అర్థంరా సురేశ్.

అలాంటి అర్థాల నిచ్చే చదువులు నేనింకా చదవలేమురా మా పెద్దలు ఇలాంటి చదువుల్ని చదవనివ్వరు కూడా. అయినా రాజా! ఇవేం మాటలురా. మనకూ అక్కాచెల్లెళ్ళుంటారు కదా. మన వాళ్లను ఇతరులు ఇలాగే అంటుంటే మనకు బాధ కల్గదా.

చాల్లేరా నీ నీతులు! ఏ వయసులో ఆ ముచ్చట వుండాలా!

పదవాళ్ళతో ముచ్చటలేమిట్రా? వాళ్లేమైనా మన స్వంతమా?

మనస్వంతం కాదు కాబట్టే ఈ వ్యామోహం పరా అయినప్పుడే ఆసక్తి పెరుగుతుంది

ఏమోరా! నీ మాటలతో నేను ఏకీభవించలేను నీకూ. నాకూ బిందువుకూ సింధువుకూ వున్నంత అంతరం వుంది. నాకు తెలిసినంతవరకు పరా వస్తువైనా, పరస్త్రీఅయినా పాములాంటిది. రామాయణ, భారతాది గ్రంథాలు తెలిపే సూక్తి ఇదే కదా. "బాగుపడాలన్నా, చెడిపోవాలన్నా ఈ వయసే కారణమవుతుంది. కాబట్టి ఈ వయసులోనే బుద్ధికలిగి చదువుకొని బంగారు భవిష్యత్తుకు పునాది వెయ్యాలని నా భావన" అన్నాడు సురేశ్.

నువ్వు బాగా ఆరితేరిపోయావురా సురేశ్ వయసుకు మించిన జ్ఞానం ఎప్పుడు సంపాదించావేంటి?

నేను వయసుకు మించిన అతీత జ్ఞానం నాకుందను కోవడంలేదు. కర్తవ్యం చెయ్యడమనేది ప్రతి మనిషికి వుండాల్సిన కనీస జ్ఞానం చిన్నప్పటినుంచి మా పెద్దలు కర్తవ్య ప్రబోధం చేస్తున్నారు. మరోవైపు ఆయా తరగతుల్లో గురువులు ఏదో ఒక సందర్భంలో బోధిస్తూనే వుంటారు. ఆలోచిస్తే మనకూ చాలా విషయాలు తెలుస్తుంటాయి. విద్యార్థిగా మన కర్తవ్యం విద్య నేర్చుకోవాలి. విద్య నేర్పేగురువుల పట్ల వినయ విధేయతలతో మెలగాలి. ఉపకారం చెసే గురువుల్ని, ఇతర వ్యక్తుల్ని గౌరవించాలి కానీ శల్య పరీ

కలుచేసి లేనిపోని దోషాల్ని ఆరోపించి వేధించకూడదు. మనమూ చెడిపో కూడదు అనే విషయాల్ని నేను బాగా మననం చేసుకుంటూ వుంటాను. పెద్దల సాంగత్యం వల్ల, స్వంతంగా ఆలోచించుకోవడంవల్ల ఈపాటి కనీస జ్ఞానం సంపాదించుకున్నాను. అని జలపాత రీతిలో సురేశ్ తెలియచెప్పాడు.

ఒరే సురేశ్! నువ్వు తులసి మొక్కలా గంజాయి మొక్కల్లాంటి మా మధ్యలో వెలశావురా. నీ ప్రభావమే మా మీదపడింది. కనీసం మా ఇంట్లో పెద్దవాళ్లు కూడా ఎప్పుడూ ఇలాంటి మంచి మాటలు చెప్పలేదు. నీ మార్గంలోనే మేమూనడిచి ఉత్తమ విద్యార్థులుగా ప్రవర్తిస్తాము. అని ముక్త కంఠంతో అన్నారు రవి, రాజా, ప్రకాశ్ లు.

వేపచెట్టుకు తేనెపోసి పెంచినా తియ్యదనంరాదు. కొంతమందికి ఎంత బోధించినా దుర్మార్గులుగానే వుండిపోతారు. కొంత మందిలోనిదానంగా మార్పువస్తుంది. అది జన్మ స్వభావాన్ని బట్టి వుంటుంది.

తన కారణంగా వీళ్లలో ఈమాత్రం స్వల్ప పరివర్తన అయినా వచ్చినందుకు సురేశ్ ఎంతో సంతోషించాడు వాళ్ళను హృదయ పూర్వకంగా ప్రశంసించి మంచి వైపు ప్రోత్సహించాడు. "వినయ విధేయతలు సానుకూల దృక్పథం కల్గిన ఉత్తమ విద్యార్థే ఉత్తమ అధ్యాపకుడుకా గలడు. ఉత్తమ అధ్యాపకుడే చెడును ఖండించి మంచిని ప్రోత్సహించి ఉత్తమ విద్యార్థుల్ని తయారు చెయ్యగలడు తద్వారా దేశ ప్రగతికి సోపానం వెయ్యగలడు' అని తన అన్నయ్య తరచూ చెబుతుండే సువర్ణ వాక్యాల్ని స్మరించుకున్నాడు సురేశ్.



తెలుగు విద్యార్థి
(విద్యా సాంస్కృతిక మాసపత్రిక)
జూలై, 1998

# సిసింద్రీ చతుష్టయం



మనుషుల్లో రకరకాల వాళ్ళుంటారు. కొందరు ఎప్పుడూ సీరియస్‌గా వుంటారు. కొందరు మామూలుగా వుంటారు. కొందరు సరదాగా వుంటారు. అది వాళ్లవాళ్ల స్వభావాన్ని పరిస్థితుల్ని బట్టి ప్రవర్తిల్లుతుంది. ఏమైనా ఎవరికీ హాని కలిగించని స్వభావమే మంచిది.

కొన్ని గ్రామాల్లో ప్రాథమిక పాఠశాలలే వుంటాయి. హైస్కూల్ చదువుకోసం ప్రక్కనున్న టౌన్లకు వెళ్లి చదువుకోవలసి వుంటుంది. రఘు, రవి, కిశోర్, కిరణ్ వీళ్ళు నలుగురు రామ లక్ష్మణ భరత శత్రఘ్న సోదరుల్లా కలసి మెలసి వుంటారు బడికి వెళ్ళేటప్పుడు కూడా జట్టుగా వెళతారు జట్టుగా తిరిగి వస్తారు మంచి తెలివైన వాళ్లు అయితే పాఠాలు చెప్పే గురువులతో సహా అందరినీ అల్లరి పట్టిస్తూ ఆహ్లాదిస్తుంటారు ఆనందింప జేస్తుంటారు.

ఒరే, రఘు! తొందరగా రెడీ అవ్వరా! నీదే ఆలస్యం. నేను రవి, కిరణ్ ముగ్గురు ఎప్పుడో రెడీ అయిపోయాం. ఈవరకు స్కూల్‌బెల్ కూడా కొట్టేసుంటారు. ఆలస్యమైతే ఆ దుర్వాసముని అయ్యవారికి భలే కోపం వస్తుంది. అన్నాడు కిశోర్. అయ్యవారికి కోపంవస్తే రానీ లేరా, మంచినీళ్లు తీసుకెళ్లి చల్లేస్తే సరే, కోపం గీపం అంతా చల్లారి పోతుంది. భలేవాడివిరా, రఘు! బడికి ఆలస్యంగా వెళ్ళడం మన తప్పురా. ఆయనేదో తప్పుచేసినట్టు అంటావేంటి?

ఈ కాలంలో తప్పేవిటి? ఒప్పేవిటి? తప్పులు చేసినోళ్లే గొప్పోళ్లవుతున్నారు. ధీరంగా తలెత్తుకుని తిరుగుతున్నారు. ఎప్పుడూ వినయంగా, విధేయంగా, మంచిగా బతికేవాళ్ళను అందరూ తొక్కేస్తారు. కరిచేపామును చూస్తేనేరా అందరూ భయపడేది. కరవని పాముపైనేరా అందరూ రాళ్ళు వేసేది. కాబట్టి ఈ రోజుల్లో మంచికి, నీతికి విలువల్లేవు. ఆ అయ్యవారు మాత్రం మంచివారా? ఆయన మనం ఎంతబాగా చదివినా మనకుమాత్రం

మార్కులు ఎక్కువ వెయ్యరు రాసినంత వరకైనా వెయ్యరు. తనకు సిగరెట్లు తెచ్చిచ్చి, హోటళ్లకు పిలుచుకెళ్లి బాగా ఖర్చులు పెట్టేవాళ్ళకే ఎక్కువ మార్కులు వేస్తుంటారు. సరేలేరా. పెద్ద ఉపన్యాసం దంచేస్తున్నావ్! ముందు తొందరగా కదులు.

పదరబ్బా— పద

ఒరే రఘు! ఈ రోజు నీ ఆలస్యం వల్ల అయ్యవారు మనల్ని ఎండలో నిలపెట్టక మానరు. ఫస్టుబెల్ కొట్టి ప్రార్థన కూడా అయిపోయినట్లుంది ఫస్టు పీరియడ్ జరుగుతున్నట్టుందిరా.

కిశోర్! నువ్వన్నట్లు నిజంగా ఆలస్యమైతేనే మేలురా! అయ్యవారు మనల్ని ఎండలో నిలపెట్టుతారు అప్పుడు ఆయనకు తెలియకుండా దొంగ చాటుగా ఇంటికివచ్చి గోలీ ఆట ఆడుకోవచ్చు.

గోలీ ఆటపై నీకింత మోజు అయితే బడికెందుకురా రావడం? హాయిగా బడికి రాకుండా నిల్చిపోరాదూ!

బడికి రాకుండా నిల్చిపోతే అమ్మ బువ్వ పెట్టదురా!

అహఁ, కేవలం ఇంట్లో వాళ్ళపోరు కోసమే బడికి వస్తున్నావన్న మాట.

ఔన్రా కిశోర్!

కిరణ్! రాజారావ్ అయ్యవారు క్లాసులో పాఠం చెబుతున్నాగు

ఔన్రా రవి! భయంగా వుంది. అయినా అందరంవెళ్లి మన ఆలస్యానికి క్షమార్పణ వేడుకుందాం

రవి, కిరణ్, రఘు, కిశోర్ నలుగురూ వెళ్లి అయ్యవారికి కనిపించేలాగా తరగతి వాకిటనిల బడున్నారు.

ఏవంట్రా గాడిదల్లారా! ఇంత ఆలస్యమయిందేవిట్రా?

సార్! మీరే మమల్ని గాడిదలు అంటున్నారు. మరి గాడిదలు ఏం

పని చేస్తాయో మీకు తెలియదా సార్! వీపులమీద చాకి మూటలు మోసి ఊరంతా పంచేసి వచ్చేసరికి ఇంత ఆలస్యమయింది సార్! అన్నాడు రఘు హాస్య దోరణిలో.

ఆహాఁ, బడికి ఆలస్యంగా రావడం ఒక తప్పు అయితే, నేనన్న మాటలకు పెడర్థాలు తీసుకొని నాకే గాడిద పాఠలు చెప్తారంట్రా వెధవల్లారా అన్నారు అయ్యవారు.

వెధవల్లారా! అంటే అర్థమేవిఁటి సార్ అన్నాడు రఘు.

అదికూడా తెలియదట్రా?

ఊహుఁ, తెలియదు సార్, తెలిస్తే ఎందుకడుగుతాన్ సార్! అయితే చెబుతాను విను

చెప్పండి సార్.

వెయ్యేండ్లు ధనంతో వర్ధిల్లు అని అర్థంరా.

అలా వర్ధిల్లాలంటే ఏం చెయ్యాలి సార్.

బుద్ధిగా చదువుకోవాలా!

బడివాకిట్లో నిలబడి చదువుకోవాలాసార్?

రఘు! ఈ సారికి మన్నించేస్తున్నా. రేపటి నుంచిగాని మీ జట్టు ఆలస్యంగా వచ్చిందో ముందుగా నీ చేత గోడ కుర్చీ వేయిస్తా, నీవ్వు మరి పోకిరైపోతున్నావ్ జాగ్రత్త! ఊఁ నలుగురూ వచ్చి కూర్చోండి తరగతిలో.

అయ్యగారు, ఈ నలుగురు విద్యార్థులు వాదోపవాదాలు చేసుకుంటూ వుంటే తరగతిలో కూర్చున్న మిగతా విద్యార్థులందరూ ఒక్కొక్కరే మాయమయ్యారు వెనకాలవున్న తలుపు ద్వారం నుంచి.

ఏవఁయ్యార్రా వీళ్ళంతా! నేను మీతోమాట్లాడుతూ వుండే సరికి ఈ వెర్రివెధవులు కాకుల్లా పిలపిలా ఎగిరిపోయినట్లున్నారు.

చూశార్రా, దుర్ర కుంకల్లారా! మీరు ఆలస్యంగా రావడం వల్ల ఎంత పరిస్థితి వచ్చిందో. మీ మూలాన నేను మీతో మాట్లాడుతూ వుండిపోవడం వల్ల ఇదే సాకని వీళ్ళు ఇలా లేచిపోవడం జరిగింది. మీరూ, నేను ఈ రోజు పొద్దున్నే ఎవరి మొకం చూసొచ్చామో ఏమో ఈపూట! క్లాస్ జరిగే యోగం లేకపోయింది. ఛ— అంటూ అయ్యవారు తరగతి గదినుంచి నిష్క్రమించారు.

ఇలా సరదా అయ్యవార్లు స్వల్పమైన వాటికి కూడా పెద్దపెద్ద చర్చలు సాగించి లాగించి కాలం వ్యర్థం చేస్తుంటారు తాత్కాలిక వ్యంగ్య సంభాషణతో విద్యార్థుల్ని నవ్వించి పోతుంటారు పాఠాలు చెప్పడం వాయిదా పడుతుంటుంది.

రెండో పీరియడ్‌కి లెక్కల మాస్టారు కృష్ణకుమార్‌గారు వచ్చారు ఈలోగా తరగతి గదినుంచి ఎగిరిపోయిన విద్యార్థిపక్షులు ఒక్కొక్కరే వాలుతున్నారు.

ఎక్కడికెళ్ళార్రా పిట్టల్లారా!

మీరే అంటున్నారుకదసార్, పిట్టల్లారా! అని. మరి పిట్టలు ఎక్కడికెళ్ళతాయో మీకు తెలియదా సార్!

ఒరే రఘు! అయ్యవారికి తెలియదేమోరా, నువ్వే చెప్పేయ్ అన్నాడు కిశోర్.

పిట్టలు హాయిగా ఆకాశంలో విహరిస్తుంటాయి. నేలమీద నూకలు కనబడగానే రివ్వున వచ్చి వాటిపై వాలిపోతాయి.

వాలిపోయి, వలల్లో చిక్కుకు పోతాయి. తర్వాత కూరై బోయవాడి పొట్టలోకి కూరుకుపోతాయి. అనిఅయ్యవారు రఘు వాక్యాలకు వ్యంగ్యంగా ముగింపు పలికారు.

ఒరే, అందరూ లెక్కల పాఠాలు శ్రద్ధగా వినండి అంటూ పదహారు మూళ్ళు ఎంతరా అని అడిగారు అయ్యవారు. రఘులేచి పందొమ్మిది సార్ అన్నాడు. టకీమని.

విద్యార్థి అంటే వీడులాగా వుండాలి. చూశార్రా! రఘు పదహారో ఎక్కం ఎంత బాగా నేర్చుకున్నాడో! అంటూ లెక్కల అయ్యావారు వేళా కోళం చేశారు. తరగతిలో అందరూ చప్పట్లు కొట్టుకుంటూ పగలబడి నవ్వారు రఘు సమాధానానికి, అయ్యావారు వేసిన పరిహాసపు చురకులకు.

ఏవిట్రా, అలాపగలబడి నవ్వుతున్నారు? అవెధవ తప్పు చెబితే మీకంతగా నవ్వొస్తోందా! వుండండి మీపని చెబుతా అంటూ అందరినీ బెంచీల మీదకి ఎక్కించి అలాగే నిల్చోమన్నారు.

సార్! మేమిప్పుడు మీకన్నా చాలా ఎత్తులో వున్నాం. మీకన్నా మేమే పెద్దవాళ్ళం సార్ అన్నాడు రఘు పెద్దఫోజు కొడుతూ

అఁ, అఁ, చెట్ల కొనా కొమ్మలపై చాలా ఎత్తులో కోతులు కూడా కూర్చుంటాయ్. ఏనుగులేమో చెట్టకింద వుంటాయ్ ఏనుగులకేమైనా విలువ తగ్గిపోతుందా, కోతులకేమైనా విలువ పెరిగి పోతుందా? అంటే మేము కోతులమా సార్ అన్నాడు రఘు.

నోరు ముయ్యంఁడా అన్నారు అయ్యావారు.

నోరుమూసుకుంటే అన్నం ఎట్లా సార్ తినేది

ఒరే రఘు! మీలాంటి పొగరు బోతులు అన్నం తినకుంటేనే మంచిదిరా.

మరి ఎట్లా సార్ బతికేది?

మీలాంటి తుంటరులు బతక్కపోతే ఏమంట నష్టం ఈ దేశానికి, లోకంలో మాలాంటి తుంటరులుంటేనే కదసార్ బుద్ధి మంతులకు విలువొచ్చేది!

నువ్వు మాటలు బాగా నేర్చావురా రఘు! కష్టపడి నువ్వు "లా" చదివి లాయర్ అయిపోరా.

అప్పుడు నేను మీ కేసునే మొట్టమొదటిగా చూస్తాన్ సార్!

అ మొకం చూడు! అప్పుడే స్కూల్ చదువు, కాలేజ్ చదువు అంతా పూర్తి అయ్యి "లా" చదివేసినట్లు లాయర్ అయిపోయినట్లు నా కేసు కోసం ఎదురు చూస్తున్నట్లు! ఏం మాట్లాడతావ్ రా! అంటూ, ముందు ఈ పాఠం వినండి అంటూ ఏదో కొంత పాఠం చెప్పేసరికి టైం అయిపో యింది. లెక్కల అయ్యవారు తిరగతి గది నుంచి వెళ్లిపోయారు.

రెండు పీరియడ్లు అయి పోయాక పదేహేను నిమిషాలు విరామం వుంటుంది. రఘు సోషల్ సార్ ఫోటో గీచి అందరికీ చూపించాడు. ఆ సోడా బుడ్డి కళ్ళద్దాలు, బానపొట్ట, భుజంపై కండువ, గోచి పంచకట్టు. ఉంగ రాల జుట్టు, చూరకత్తుల మీసాలు చూసి ప్రతి విద్యార్థి కడుపుబ్బ నవ్వు తున్నారు.

కిరణ్ మాత్రం ఏమిటో బాధగా వున్నాడు, ఏమిట్రా కిరణ్! ఎందు కిలా దిగులుగా వున్నావ్ అన్నాడు రఘు.

ఏమిటోరా! నువ్వుమరీ అల్లరైపోతున్నావు. నువ్వు నీ వాక్చమత్కా రంతో అందంనీ నవ్వించడం బాగానే వుంది. కానీగురువు రూపాన్ని గీచి ఇలా పరిహాసం చేయడమే నాకు నచ్చలేదురా!

ఇది పరిహాసం కాదు కిరణ్! జస్ట్ సరదా అంతే, అయినా ఆ సార్ అలాగే వుంటారుగా!

దీనివల్ల నీకెంత కాలం వ్యర్థమవుతోందో, ఎంత చదువు నష్టమవు తోందో ఆలోచించావా? మన జట్టులో అందరూ బాగా చదివే వాళ్ళే నువ్వే చదువుల్లో వెనకబడివున్నావు! నీ స్నేహితుడుగా నేను ఎంతో బాధ పడు తున్నాను. వచ్చే సంవత్సరం పదో తరగతి పరీక్షలుంటాయి. ఈ సంవత్స రం పబ్లిక్ పరీక్షలు లేకపోయినా, ఈ తొమ్మిదో తరగతి పాఠాలు కూడా బాగా చదువుకోవాలి కదా. ఇంకనైనా నీ అల్లర్లు కట్టిపెట్టి, పెద్దవాళ్ళ కష్టాన్ని, నీ భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని బాగా చదవరా.

అలాగే కిరణ్! నా కర్తవ్యన్ని గుర్తుచెసి, నీతి మాటలు చెప్పినందుకు చాలా థాంక్స్‌రా.

అది మిత్ర ధర్మంరా అన్నాడు కిరణ్

సాయంత్రం నాలుగు గంటలయింది నలుగురూ కలసి ఇంటికి బయలుదేరారు రఘు మౌనంగా నడుస్తున్నాడు. రవి, కిశోర్‌లు రఘులోని పరివర్తనను గమనించారు.

ఏవిట్రా రఘు' అప్పుడే అంత బుద్ధిమంతుడివైపోయావు! నీ అల్లరి రోగానికి ఎవరు మందు వేశారేవిటి? అని రఘు పూగించి మరి అడిగారు.

ఇదిగో వీడే ఆ మందు వేసిన వైద్యుడు అన్నాడు రఘు కిరణ్‌ను చూపిస్తూ.

ఈ సిసింద్రేనా అంటూ అందరూ కిరణ్‌ని తమాషా చేశారు. అదే విట్రా నన్ను సిసింద్రీ అంటున్నారు! అన్నాడు కిరణ్

సిసింద్రీ కాకుంటే 'సివంగి' అంటాం లేరా అన్నారు రవి, కిశోర్‌లు. కాదురా, మన జట్టు పేరే సిసింద్రీ చతుష్టయం అని పెట్టుకుంటే సరి అన్నాడు రఘు.

తక్కిన ముగ్గురూ భలే, అంటూ చప్పట్లు కొట్టారు.

ఇలా పరిహాస ప్రసంగాలు చేసుకుంటె వూర్లోకి వచ్చేశారు. ఈ సిసింద్రీ చతుష్టయం అందరూ బైబై చెప్పుకుంటూ వాళ్ళవాళ్ళ ఇళ్ల కెళ్ళారు. అప్పుడే విశ్వ మిత్రుడైన సూర్య భగవానుడు ఆకాశంలో రథయాత్ర చేసి చేసి అలసిపోయి తన గృహమైన పశ్చిమాద్రి గృహలోకి ప్రవేశించాడు.



సచిత్ర నేటి భారతం,
(జాతీయ సమాచార మాసపత్రిక)
అక్టోబర్, నవంబర్, 1997.

# సాహసం

గ్రామాల్లో ఏ విషయమైనా ఆనోటా ఈనోటా పడి తంతివార్తకన్నా వేగంగా ప్రచారమై తెలిసిపోతుంది.

పక్కవూర్లో సుబ్బారాయుడు కూతురు రాజి బాయిలో దూకేసిందంట చేన్లో మడక దున్నుతావున్న రాజి మేనమామ ఆ పిల్లను లేవదీసుకొని. రావడానికి తానుకూడా దూకి అట్లాగే చచ్చిపోయినాడంట అని రంగమ్మ తన పక్కింటి సుబ్బమ్మకు చెప్పింది.

సుబ్బమ్మ ముక్కుమీద వేలేసుకొని నోరు తెరచు కొని ఆశ్చర్యంగా ఆ వార్త విని అట్లాగే నిలబడి పోయింది.

ఒదినా! ఏంది అట్టాగే వుండిపోయినావ్! నిజవేఁ ఈ ఇంత సంగటన ఎట్లాంటోళ్ళకైనా బాధ కలిగిస్తాది. మనం ఏం సేద్దాం సెప్పూ! అంతా ఆ దేముడి మాయ. ఆయన ఎట్టా అనుకుంటే అట్టా జరగతంది. అని చెప్పి సుబ్బమ్మను మామూలు స్థితికి తీసుకొచ్చింది రంగమ్మ.

అయినా రాజి ఎందుకు బాయిలో దూకేసినట్టు అని అడిగింది సుబ్బమ్మ.

ఆపిల్ల నాయన సుబ్బారాయుడు దాన్నిఏదో ఒకసాకు సేసుకొని దినమ్మూ చింతబర్రలతో కొట్టేవాడంట ఒకనాడు ఆయునపెట్టే ఇంసలు తట్టుకోలేకపురుగు మందుకూడా తినేసిందంట. ఆవూళ్ళోవాళ్ళు ఎట్లానో తెలుసుకొని ఆ పిల్లను ఆసుపత్రికి ఎత్తుకొనిపోయి డాక్టర్ దగ్గర మందులు, సూదులు ఇప్పించి బతికించి నారంట. అయినాకూడా ఆ కటీనపు తండ్రి మళ్లా వాన్ని కొట్టడం వదల్లేదంట. అందువల్ల ఆ చిత్రహింసలు పడలేక రాజి ఈ పని చేసింది అని చెప్పింది రంగమ్మ.

ఆ పిల్ల బావిలో దూకేస్తే దాని మామ దాన్ని లేవదీసుకొని రావడానికి బావిలో దూకినాడు. ఆయన చచ్చిపోయినాడు. కన్న తండ్రి అమాదిరి చౌరవ సెయ్యలేకపోయినాడు కదా. ఎంత విచిత్రంగావుండాది! ఇదొక కత మాదిరిగా వుండాది ఇంటావుంటే అన్నది సుబ్బమ్మ.

ఔను ఒదినా! ఇట్టాంటి సంగటన ఎక్కడ జరగదేమో అనిపిస్తుంది. కానీ అ వూళ్ళో జరిగింది కదా. ఇంతకూ ఒదినా! అ సుబ్బారాయుడు సాలా సెడ్డ మనిషిగా వుండాడు. పైగా భలే కుళ్ళుమనిసంట కూడా ఇట్టా రోజూ కొట్టతావుంటే రాజి తనకు తానే చస్తుందని, పెండ్లిండ్లకు, వాటికీ వీటికీ కర్చులు తప్పిపోతాయని ఆ కర్ముడి ఆలోచనేమో అందరు ఇదే సెప్తా వుంటారు. అ వూళ్లో. ఆయన తన పెండ్లాన్ని కూడా ఈ మాదిరిగానే రోజూ పోరు పెట్టేసరికి ఆమెకూడా ఉరిపోసుకొని చచ్చిపోయిందంట. వోడికేం పోగాలం వచ్చిందో ఏమోగానీ ఒదినా, పెండ్లాన్ని, కూతురిని పొట్టన పెట్టు కున్నాడు. వోడేం బాగుపడతాడులే. వోడు చచ్చేనాటికి గొంతులో నీళ్ళుపోసే దిక్కుకూడా లేకుండా సేసుకున్నాడు అంటూ రంగమ్మ సుబ్బారాయుడు చేసిన దుర్మార్గ పనులకు తట్టుకోలేక పెళ్ళాం, కూతురు చావులకు కారకు డైన సుబ్బారాయుడికి మెటికలు విరిచి మరి శాపం పెట్టింది.

నిజమేం రంగా! నువ్వన్నట్టు ఇట్టాంటి కటినపు మనుసులు సివర్లో సాలా ఇక్కట్లు పడతారు. ఇంతకూ సుబ్బారాయుడి బావమరిది జగ్గన్న సాలామంచోడు. తనకు పెండ్లాం బిడ్డలుండారనే ఆలోశనకూడా వదలి చెల్లెలు కూతురిని లేవదీసుకోని రావడంకోసం తానూ బాయిలో దూకి చచ్చి పోయినాడు. పాపం! ఆయన ఇల్లల్ని, బిడ్డల్ని ఎవరు సూసుకుంటారు? ఒక్క దుర్మార్గుడివల్ల ఎన్ని పేణాలు పోయినాయి? ఎన్ని జీవితాలు కష్టాల పాలయినాయి? అంటూ సుబ్బమ్మ చాలా దిగులుగా అంది.

ఇంక ఆ దేముడే వోళ్ళ కుటుంబానికి దిక్కు. ఒక పాణం కాపాడ్డా నికి పోయి తాను పాణం పోగొట్టుకున్నాడు జగ్గన్న. ఆ పున్నెమే ఆయన కుటుంబాన్ని కాపాడతంది అని రంగమ్మ సుబ్బమ్మతో అంటూవుండగా పక్కింటి చెంగయ్య వచ్చాడు.

నీకు తెలుసా సెంగన్నా ఈ విసయం! అంటూ రంగమ్మ ఆయనకు అంతా చెప్పింది. ఎందుకు తెలియదమ్మా! అన్నీ తెలుసు! నిన్నంతా నేను అక్కడే వుండి అన్నీ చూసినాను. అన్ని విషయాలు అక్కడోళ్లు నాకు సెప్పినారు అన్నాడు రంగమ్మతో.

ఈలోగా రంగమ్మకు ఒక ఆలోచన మెదిలింది. ముందు రాజి బాయిలో దూకేసింది వెంటనే ఆ పిల్లను బతికించుకొవడానికి వాళ్ల మామ బాయిలో దూకేసినాడు. ఇద్దరూ చచ్చిపోయినారు ఆ రెండు శవాల్ని ఎట్లా పైకి తీసినారు? ఎవరు ఆ సాహసం సేసివుంటారు? అని వివరంగా తెలుసు కోవాలనిపించింది. రంగమ్మకు. వెంటనే చెంగయ్యను అడిగింది. చెంగయ్య చెప్పడం మొదలు పెట్టాడు

రంగమ్మా! ఆ ఘోరం చెప్పడానికి నోరు రావడం లేదమ్మా, మామూ లుగా ఒక మనిషి బావిలో పడి చచ్చిపోతేనే లేవతీయడానికి ఎవరూ ముం దుకురారు. మధ్యలో చచ్చిపోయినవాళ్ళు దయ్యమై పట్టుకుంటారేమోనని కొందరు భయపడతారు. తమ ప్రాణం కూడా తీసుకొని పోతారేమోనని కొంతమంది భయపడతారు.

అలాంటిది రెండు శవాల్ని బావిలోనుంచి ఎత్తడానికి ఎవరూ ముందు కురాలేదు. అందరూ బావి చుట్టూ మూగినారు. వాళ్ల బంధువుల్లో కొందరు ఏడ్చేవాళ్ళు ఏడుస్తున్నారు. కొందరు సుబ్బారాయణ్ణి తిట్టేవాళ్లు తిట్టుతు న్నారు. కానీ ప్రస్తుత కర్తవ్యం శవాల్ని పైకి తీసి వాటికి కర్మలు చెయ్యా లికదా? అయినా ఉదయం నుంచి సాయంత్రం దాకా బావిలోనే వున్నాయి శవాలు అని చెంగయ్య ఏకదాటిగా విషయం చెబుతూవుంటే రంగమ్మ మధ్యలో అడ్డుపడి ఆ వూర్లో కోదండయ్య ముందుకొచ్చి శవాల్ని లేవదీసి నాడని ఇన్నాను సెంగన్నా నిజమేనా? అని అడిగింది.

నిజమేనమ్మా! అదే చెప్పబోతున్నా అంటూ ఆ వూర్లో కోదండయ్య మనకూ బాగా తెలుసుకదా ఈ చుట్టువున్న వూర్లల్లో ఎవరికి ఏ కష్టమొ చ్చినా దేవుడిలా ముందుకొచ్చి కాపాడుతుంటాడు. ఆయన అంతకుముందు రోజున ఎక్కడికో పనిమీద వెళ్లి వుండి సరిగ్గా ఆ సాయంత్రం మూడు గం టలకు ఇంటికివచ్చాడంట. ఇంటికి రాగానే ఈ వార్త తెలిసి పరుగుపరుగున బావి దగ్గరికెళ్ళి పరిస్థితి గమనించాడు. బావికి పైన అడ్డంగా పొడవైన తాటి దూలం పెట్టించాడు. దానిపై నిలబడి బావిలో పడిన వస్తువుల్ని లేవదీసే ఇనుప పాతాళభేరిని బావిలో వేసి గాలించాడు. ఆ పరికారానికి తగులు కున్న పీనుగును అతి కష్టంగా తాటి దూలంపై నిలబడుకుని చేది గట్టున

పడేశాడు. అలాగే రెండో శవాన్ని కూడా కోదండయ్య గట్టుకు చేర్చాడు అని చెంగన్న చెబుతుంటే రంగమ్మకు గుండె పట్టనంత ఆశ్చర్యం కలిగింది.

తాటిదూలంపై నిలబడి కోదండయ్య ఒక్కడే అంత బలంగా ఆ రెండు శవాల్ని ఎలా లేవదీసివుంటాడో! ఆ సమయంలో కాలుజారి తాను బాయిలో పడిపోయుంటే ఆయన ఇల్లాలు, బిడ్డలు ఏమయ్యేవారు! ఆయన ఇవన్నీ ఆలోసించుకున్నట్టు లేదు అని రంగమ్మ అంటూవుంటే చెంగన్న పరోపకారం చేసేవాళ్ళు అవన్నీ ఆలోచించుకోరు రంగమ్మా! ఉపకారం చేసేటప్పుడు మంచి మనుషులకు మామూలు శక్తికన్నా వెయ్యిరెట్లు శక్తిని అధికంగా ఇస్తాడు ఆ భగవంతుడు. ఇంక చావు భయాలంటావా! అని వాళ్లకు వుండనే వుండవు. పుట్టినవాళ్ళు ఎప్పుడో ఒకప్పుడు గిట్టక తప్పదు. కాబట్టి ఒకవేళ మేలుచేస్తూ చచ్చిపోతే అది గొప్పేకదా. ఎదుటివాళ్లకు మేలుచేయ్యాలనే బుద్ధి కలగడమే ఒక వరం అని ధార్మిక వాక్యాలు ప్రవాహరీతిలో ఉపన్యసించసాగాడు చెంగన్న

నిజవేఁ సెంగన్నా మంచిమాటలే సెప్పావు. కోదండయ్యకు ఆ దేముడే బలాన్ని, తెలివిని ఇచ్చివుంటాడు ఆయన ముందే సాలా మంచి మనిషి. ఆ దేముడు మంచి మనుసుల గుండానే మంచిపనులు సేయిస్తుంటాడు. ఎక్కడోళ్ళక్కడ బిక్కమొకాలేసుకొని సూస్తావుంటే కోదండయ్య ముందుకొచ్చి ఈ సాగసం సెయ్యడం గొప్ప సంగతి సెంగన్నా అని కోదండయ్యను పొగిడింది రంగమ్మ.

అంతా మౌనంగా వింటూ అక్కడి విషయాల్ని అంతర్నేత్రంతో చూసుకుంటూ అంతర్మథనం గావించు కుంటున్న సుబ్బమ్మ ఒక్కసారిగా తేరుకొని నిట్టూర్పు విడిచి ఈ లోకంలోకి వచ్చింది.

ఏం ఒదినా ఇంతసేపూ కూకొని తూగతావుండావా అని అడిగింది రంగమ్మ. లేదు రంగా! మీరు మాటాడు కొంటున్నదంతా కళ్లుమూసుకొని మనసుతో సూసుకొంటా వుండినాను. ఆ కోదండయ్య ఎంత గొప్ప మనిషి! పరాయి వాళ్ళకోసం ఎంత సాగసం సేసినాడు. అని అంది సుబ్బమ్మ.

ఔను ఒదినా! కొంతమంది తమ మనసుల్నే తాము పీడించి పీక్కు తింటారు సుబ్బారాయుడి మాదిరిగా. కొంతమంది తనోళ్ళకోసం తాము ప్రాణాలు పోగొట్టుకొంటారు జగ్గన్న మాదిరిగా. ఇంక కొదండయ్యా మాదిరి కొంతమంది మనుసులు ఎదుటోళ్ళకు సాగసంతో మేలు సేయడం కోసరమే బతుకుతారు అని సుబ్బమ్మతో రంగమ్మ రకరకాల మనుషుల జీవిత ధ్యేయాల్ని విశ్లేషించి విశదం చేసింది.

ఇంతలో పక్కనున్న చింతచెట్టు తొర్రలోంచి రెండు పచ్చని చిలుకలు వెలుపలికి వచ్చి కోదండయ్యా సాహసకృత్యాన్ని రామ, రామ అనే రమ్యమైన పలుకులతో ప్రస్తుతిస్తున్నట్లనిపించింది. బహుశ అవి రాణి జగ్గన్నల ఆత్మలు కాబోలు.



శుభం (మాసపత్రిక)
డిసెంబర్, 1997

# సు మ ధు ర



జీవితంలో మొదటినుంచీ ఇతరులవల్ల అనేక కష్టాలు, నష్టాలు దుర్భర అవమానాలు ఎదుర్కొన్నవారు చాలా వరకు నెమ్మదిగా, మౌనంగా ఎక్కువ సమయం ఏకాంతంగా గడపాలనుకుంటారు. అలాంటి వాళ్లు ప్రశాంత వాతావరణాన్ని, ఆలయ ప్రాంగణాన్ని కోరుకుంటారు. లోకుల కాలక్షేపం కబుర్లంటే వాళ్ళకు కాకుల గోలలాగా, కీచురాళ్ళ కీలలాగా తోస్తుంది.

సుమధుర ఆఫీసునుంచి వచ్చి అర్ధగంట అయింది.

ఏమిటి సుమా! రెండు రోజుల నుంచి నాతోసరిగా మాట్లాడటంలేదు? నామీద ఏమైనా కోపమా! అడిగింది పక్కింటి స్నేహితురాలు సుచిత్ర.

అయ్యో, అదేమీలేదు సుచీ, డ్యూటి వర్క్ ఎక్కువగా వుంది, పైగా నాలుగు రోజులనుంచి తలనొప్పి తీవ్రంగా వుంది అంతే. నా శ్రేయస్సును కోరే నీమీద నాకేముంటుంది చెప్పు!

నాకు తెలుసు సుమా! నీ మనస్సు ఎంతో నిర్మలమయింది ఓపిక వుండి మాట్లాడాలనిపిస్తే మాట్లాడుతావు. లేకుంటే పడుకొని సంగీతంవింటూ విశ్రాంతి తీసుకోవడమో, పుస్తకాలు చదువుకోవడమో, రాసుకోవడమోచేస్తావు నీవు ఒకరి జోక్యానికి పోవు. నీ పరిధిలో నీవుంటూ చాలా సున్నితంగా ప్రవర్తిస్తావు అన్నట్లు — సుమా! అంత తీవ్రంగా తలనొప్పి ఎందు కొచ్చింది? ఇంటినుంచి ఉత్తరం ఏమైనా వచ్చిందా?

బాగా ఊహించావు సుచీ! నిజమే ఇంటి నుంచి ఉత్తరం వచ్చింది.

విషయమేమిటో చెప్పుసుమా!

అవన్నీ పునశ్చరణ చేసుకొని మళ్లీ చెబితే తలనొప్పి మరీ ఎక్కువై పోతుంది. వారం రోజులు ఆఫీసుకు సెలవుపెట్టి పడుకోవలసి వస్తుంది.

అయితే వద్దులే. నీకు చెప్పాలనిపించినప్పుడే చెప్పుదువులే నీకు మనసెలాగో బాగలేదంటున్నావు కదా. ఇద్దరం వేణుగోపాల స్వామి గుడికి వెళ్దాం బయలు దేరు అన్నది సుచిత్ర.

ఇద్దరూ సాయంత్రం ఆరుగంటలకు వేణుగోపాల స్వామి ఆలయానికి వెళ్లి స్వామిని దర్శించుకొని, తీర్థం తీసుకొని ఆలయం ముందున్న అరుగుపై కూర్చున్నారు.

సుమధుర హృదయ పద్మం భగవంతునిమీద అనురక్తితో పరవశించి పోయింది. తత్ఫలితంగా ఆమె పద్మ నేత్రాల నుండి మకరంద బాష్ప బిందువులు ఒక్కొక్కటే జాలువార సాగింది. ఆకాశం వైపు చూస్తూ ఏదో ఆలోచిస్తున్న సుచిత్ర ఒక్కసారిగా సుమధురం వైపు తిరిగింది. ఆమె కళ్ల నుంచి కారుతున్న కన్నీళ్లకు ఆశ్చర్యం, ఆవేదన చెంది సుమా! ఎందుకీ కన్నీళ్లు? నీవు నీ బాధలన్నీ మరచి కాసేపైనా ప్రశాంతంగా వుంటావని గుడికి తీసుకొస్తే ఇలా కన్నీళ్లు కార్చవచ్చా అంటూ కన్నీళ్ళు తుడిచింది సుచిత్ర.

ఇవి మామూలు కన్నీళ్లు కావు సుచీ! భక్తి అనుభూతి ధారలు. విష్ణు లీలల్ని విన్నా, విష్ణుమహిమల దృశ్యాల్ని తిలకించినా, తలచు కొన్నా నా శరీరమంతా ఆనందంతో పులకించి పోతుంది. కళ్లల్లో ఇలా కన్నీరు నీలి మేఘాలనుండి వర్షధారల్లా కురుస్తుంది. ఈ ఆనంద తన్మయత్వం వల్లనే నేను మనిషిగా బ్రతుకుతున్నాను. లేకుంటే నేను చిన్నప్పటినుంచీ ఇంటా బయటా ఎదుర్కొంటున్న కష్టాలకు ఏ పిచ్చిదాన్నో, ఏ రోగినో అయిపోయి వుండేదాన్ని.

సుమా! అలాంటి మాటల అనద్దు. నేను వినలేను నీకు భగవంతుడు అందరికీ లభించని అరుదైన సుందరరూపాన్ని, సుమధుర రూపాన్ని సుమధుర కంఠస్వరాన్ని సౌజన్య హృదయాన్ని, అత్యున్నత విద్యను, అంతటి ఉద్యోగాన్ని త్యాగశీలాన్ని, వరాలుగా ప్రసాదించాడు. నీవుకూడా భగవంతుడిమీదనే భారంవేసి మనసా వాచా కర్మణా అయన్నే నమ్ముకొని కర్తవ్యం చేసుకుంటున్నావు. చదువు పరంగా, సేవలపరంగా ఎంతోమందికి ఉప

కారాలు చేస్తున్నావు. సంపాదనంతా నీకంటూ ఏమీ మిగిల్చు కోకుండా నీ వాళ్ళ కోసం ధారపోస్తున్నావు. ఇంతటి దాతృత్వబుద్ధి అందరికీ రాదుసుమా! నీకు అన్నిటికీ భగవంతుడే అండగా వుంటాడు నీవు నిశ్చింతగా వుండు.

అలాగే వుంటున్నాను సుచీ! లేదంటే నేను సంపాదించే లక్షలాది ధనం నా వాళ్ళు సద్వినియోగం చేసుకోవడం లేదనే నా బాధంతా. నేనూ అనుభవించక, వాళ్ళనుంచీ సత్ఫలితాలు కనిపించకపోతే నాకష్టం, నా ఔదార్యం అంతా బూడిదలో పోసినా పన్నీరే కదా.

నిజమే సుమా! నీ ఆవేదనలో ఆలోచనలో ఎంతో అర్థం వుంది. నీ తర్వాతి పిల్లలందరూ నీఅంత చదువులు చదువుకొని, నీ అంతటిస్థాయిలో ఉద్యోగాలు చేస్తూ ప్రత్యేక వ్యక్తిత్వంతో పదుగురికి ఉపయోగపడే రీతిలో బ్రతకాలని నీవు కోరుకున్నావు. కానీ చెడు సాంగత్యాలవల్లనో, స్వార్థపరుల పన్నాగాల వల్లనో, ఓర్వలేని వాళ్ళ దుర్బోధల వల్లనో, అజ్ఞానం వల్లనో వాళ్లు ఎందుకో అలా వక్రమార్గం పట్టారు. నీవు వాళ్ళకు దూరంగా వుండ టంబట్టి మరీ భయం లేకుండా పోయి కర్తవ్యం ప్రక్కకు నెట్టి ప్రవరి స్తున్నారేమోనని పిస్తుంది సుమా!

నేను దూరంగా వుండక తప్పదు కదా సుచీ! ఉద్యోగం మన వూళ్లోనే వస్తుందా! అయినా నేను అన్నీ సమకూర్చి పెట్టుతుంటే ఎవరి బాధ్యతలు వాళ్ళు నిర్వహించాలి. ఎవరి కర్తవ్యం వాళ్ళు చెయ్యాలికదా. ఇప్పటికి సంవత్సరాలు తరబడి వేలాది గంటలు నయాన భయాన మా వాళ్ళకు చెప్పిచెప్పి విసుగెత్తిపోయాను. ఇంక నావల్లకాదు. అందుకే నా బాధంతా ఆ కృష్ణపరమాత్మ పాద పంకజాలపై పెట్టి సంకీర్తనా చార్యుడు అన్నమయ్య చెప్పినట్లు "నిటన్ ముంచుము పాలన్ ముంచుము నీచిత్తము నా భాగ్యము" అని విన్నవించుకున్నాను

నిజమే సుమా! ఒక్కోసారి మనల్ని పరీక్షించడానికి భగవంతుడు మనం కోరుకున్నదానికి విరుద్ధంగా చేస్తుంటాడు. నీవు మంచి నిర్ణయమే తీసుకున్నావు. ఇలాంటి ఆలోచనలు పరిపక్వత చెందిన ఏ జ్ఞానికో, భక్తుడికో గానీ రాదు.

చాలాసార్లు అనుకున్నవి జరగకపోతే ఏ మనిషైనా వైరాగ్య దిశగా పయనిస్తాడు. నిజానికి ఈ వైరాగ్యమే శాశ్వతం కూడా. అలా అని కర్తవ్యం మానడం కాదు.

ఔను సుమా! నీలో ఎంత అధ్యాత్మిక చింతనవుందో అంత కర్తవ్య శీలత కూడా వుంది. నీవు ఎంత సనాతనంగా వుంటావో అంత అధునికం గానూ వుంటావు.

సుచీ! నీలా నన్ను సరిగ్గా అంచనా వేసినవారు చాలా తక్కువ. నిజమే నేను భక్తురాలిని. కానీ మూర్ఖాచారాలకు, ఛాందస కట్టుబాట్లకు చాలాదూరం అందుకే కదా 'దుష్టోదూర వర్జితః' అన్నట్లు భర్తను అర్థం తెలియని కపటుడు, క్రూరుడు, స్వార్థపరుడు అయిన మనిషికే చట్ట బద్ధంగా దూరమయింది!

ఏమైనా సుమా! యుఆర్ వెరీడేర్. అలాగే వుండాలి నీతి, నిజాయితీ మానవత్వం, దయలేని ఏ బంధాన్ని అయినా ఎంత పోరాటం చేసి అయినా, ఎంత ఖర్చుపెట్టి అయినా విదిలించు కోవడమే శ్రేయస్కరం. పూల పొద రింటిలో సుఖంగా, హాయిగా బ్రతకగలం కానీ ముళ్ళ పొదలో బ్రతక లేముకదా. నీవు చాలా మంచి పనిచేశావు. చెడు మనుషులతో, చెడు విష యాలతో రాజీపడని నీ ధైర్యానికి, నీ సాహసానికి నా జోహార్లు సుమా! నీవు వ్యక్తివికావు శక్తివి అనిపిస్తుందినాకు కానీ నీవు ఏమీ అనుకోనంటే నాదొక చిన్న సలహా. నీకు బాధ కలిగిస్తే నన్ను క్షమించు.

అదేదో చెప్పుసుచీ! నిజానికి అతిగా జోక్యాలు చేసుకొని, ఉచిత సల హాలు చెప్పేవారంటే నాకు చాలా కోపం. కాని నీవు నా మేలు కోరేవానివి కాబట్టి ఆత్మీయంగా చెప్పచ్చు.

నీవు మరొక ఆలోచన ఎందుకు చెయ్యకూడదు?

అంటే మరో పెళ్లిని గూర్చా నీ ఉద్దేశం!

అవును.

ఎందుకు చేసుకోవాలి?

తోడుకోసం, నీడకోసం

ఆ వ్యక్తికి జరారుజలు, మృత్యువు వుండవా?

ఎందుకుండవు!

అలాంటి వ్యక్తి నాకు తోడేమిటి?

ఒక్కరే బ్రతకడం కష్టం కాబట్టి!

ఒక జంటలో మృత్యువు ముందు ఎవర్ని కబళిస్తుందో చెప్పలేం. ఆలా అయితే అప్పుడేమిటి?

ఇలా నీవు వేదాంత ధోరణిలో ప్రశ్నిస్తే నీ ముందు నేనే ఓడిపోతాను

అందుకే ఇలాంటివి నాకు ఎప్పుడూ చెప్పద్దు ప్లీజ్.

నాకింక తీరిక, ఓపికలేదు ఇన్నాళ్లుగా ఎవరు తోడుగా వుండి కాపాడుతున్నారో ఇంకనూడా ఆ జగత్పతే కాపాడుతాడు. అదృఢ విశ్వాసం నాకుంది.

సారీ సుమా! ఇంకెప్పుడూ ఇలాంటి సలహాలివ్వను...

పోనీలే సుచీ! మనం స్నేహితులం. మన మధ్య అభిప్రాయ భేదాలు వద్దు. నీవు నీ భర్తతో, పిల్లలతో హాయిగా, సుఖశాంతులతో జీవించు అంతే చాలు.

సుమా! నీ జ్ఞానం, నీ భక్తి, నీ తెలివి, నీ త్యాగం, నీ జాగ్రత్త అందరికీ రావు యుఆర్ వెరీగ్రేట్ లేడీ. నీవు కుటుంబ జనాభాని, తద్వారా దేశ జనాభా పెరుగుదలను దృష్టిలో పెట్టుకొని పెళ్లయి ఒక సంవత్సరం ఒకే ఇంట్లో వున్నాగానీ సంతాన ప్రయత్నం చెయ్యలేదు. నీ మూలాన ఎన్నోతరాల జనాభా అరికట్టబడింది. ఈ రకంగా నీవు మీ కుటుంబానికే కాక దేశానికి కూడా ఎంతో త్యాగం చేశావు. పిల్లల్నికంటే తోపుట్టువులు కొరగానివారైపోతారని, సంపాదన రెండు వైపుల వారికీ అందించలేమని దూరదృష్టితో ప్రవర్తిం

చావు. ఇలా కన్నతల్లిదండ్రులే ఆలోచించరు. అనాలోచితంగా బిడ్డల్ని కని వారిని కష్టాల పాలు చేస్తుంటారు.

సుచీ! ఇంక ఆ విషయాలేవీ వద్దు. స్వాతంత్ర్య సమర పోరాటంలో భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజు వంటి ఎందరో దేశభక్తులు భావిభారత పౌరుల స్వేచ్ఛా జీవితాలకోసం బ్రిటిష్ వాళ్ల చేతుల్లో హింసలు అనుభవించి ప్రాణత్యాగాలు చేశారు. బలి, శిబి వంటి చక్రవర్తులు, కందుకూరి దంపతుల వంటి సంఘ సంస్కర్తలు, శ్రీ మహావిష్ణువు మనకోసం ఎన్నెన్నో కష్టాలు అనుభవించారు. వారందరిని గూర్చి చిన్నప్పుడు పాఠాల్లో చదువుకున్నాం. చేయగల్గిన వాళ్లు అవసరమనుకున్నప్పుడు ఈ మాత్రం చేయకపోతే ఈ జీవితానికి అర్థం, పరమార్థం ఏముంది చెప్పు!

ఇలా మాట్లాడటం నీ వినయానికి నిదర్శనం. మహాత్ములు ఎప్పుడూ తమను తాము తగ్గించుకునే మాట్లాడుతారు. నీవు అంతే సుమా!

అలా అనడం నామీద నీకున్న అభిమానం అంతేగానీ నాగొప్పేమీ లేదు. సుచీ!

ఇలా వేణుగోపాలస్వామి ఆలయం అరుగుమీద సుచిత్ర సుమధుర సంభాషణ సెలయేటి గలగలలా సాగింది. రాత్రి ఎనిమిది గంటలు కావచ్చింది. అమ్మా గుడితలుపులు మూసేయాలి అని హెచ్చరిక చేశాడు పూజారి. ఎక్కువసేపు కూర్చోవడం వల్ల తిమ్మిర్లు పట్టిన కాళ్లను ఒత్తుకుంటూ "గోపాలా" అంటూ ఇద్దరూ మెల్లగా పైకి లేచారు. చేయి చేయి పట్టుకొని ఇంటివైపు నడవసాగారు. సుమధుర మనసుమాత్రం గోపాలుని కరకమలాల్లోని వేణువును వదలిరాలేదు.



శుభం (మాసపత్రిక)
మార్చి, 1998

# సు రు చి ర



ఈ లోకంలో చాలామంది అనుభవించడానికే పుడతారు. కొంతమంది త్యాగం చేయడానికి పుడతారు. కేవలం తనవరకే అనుభవించిన వాళ్ళ ఉనికి బ్రతికినంతవరకే వుంటుంది. త్యాగమూర్తుల ఉనికి ఆ చంద్రార్కం నిలచివుంటుంది.

సురుచిర విశ్వవిద్యాలయంలో హిస్టరీ లెక్చరర్‌గా పని చేస్తోంది. ఒక రోజు మధ్యాహ్నం భోజనం చెయ్యకుండా కుర్చీలోనే కూర్చొని టేబుల్‌పై తలవాల్చి పడుకోనుంది.

కొంతసేపయ్యాక ప్రక్క డిపార్ట్‌మెంట్‌లోంచి పొలిటిక్స్ లెక్చరర్ మాలిక వచ్చి — సురు! సురు! అని రెండుసార్లు పిలిచింది తన ప్రియ నేస్తం సురుచిర ! ఉలకక పలకక పడుండేసరికి తన రెండు చేతులతో ఆమె తలను పైకి లేపింది. కళ్ళనుండి కుండిపోతగా కన్నీళ్ళు ఆమె చెక్కిళ్లపై కారుతుంటే మాలిక ఆశ్చర్యపోయింది.

ఏమయింది సురు? ఎందుకు కన్నీళ్లు!

ఏమీలేదు మాలికా!

ఏమీలేకపోతే కన్నీళ్ళెందుకు వస్తాయి సురూ?

ఆనందం ఎక్కువై...

'నీ వ్యంగ్య భాషకట్టిపెట్టి అసలు విషయమేమిటో చెప్పకపోతే నా మీద ఒట్టే' అంటూ మాలిక తన చేతిలోని కర్‌చీఫ్‌తో సురుచిర కన్నీళ్ళు తుడిచింది. చెదిరిపోయిన తలజుట్టును సవరించి సురుచిర చేతిని తన చేతి లోకి తీసుకుని వీపుతట్టి, సురూ! ప్లీజ్ విషయం చెప్పు అని ప్రాధేయ పడింది.

మాలీ! నా కడుపులో జ్వలిస్తున్న దుఃఖాగ్ని నీవల్లకాక ఇంకెవ్వరి వల్ల చల్లారుతుంది చెప్పు! అంతా వివరంగా చెబుతాను. మొన్న ఎవరో పెద్దచెల్లి బేబికోసం పెళ్లిచూపులకు వచ్చారు. వాళ్ళు 'అమ్మాయి బాగుంది. మాకు ఇంకేమీ అక్కర్లేదు. పెళ్లిఖర్చులు భరిస్తేచాలు. నగలు పెట్టగలిగితే మీ అమ్మాయికి పెట్టుకోండి' అని చెప్పారు.

అబ్బాయి ఏం చదివాడు? ఉద్యోగం ఏమిటి? ఎలా ఉంటాడు? అని ఉత్కంఠంగా ప్రశ్నించింది మాలిక.

"అవన్నీ తర్వాతి విషయాలు. అసలు పెళ్లిమాటలు ఎత్తేస్తామతే లేదు. మా వాళ్ళకు. మా ఇంటిపెద్దలు తమ ధర్మాలువదిలేసి పరధర్మాలు నెరవేర్చే మనుషులు. పొలాల్లో పంట మీద వచ్చే ఆదాయాన్ని దాన ధర్మాలకు, కీర్తి ప్రతిష్ఠలకు ఖర్చులు పెడతారు. ఇంటినిండాపదిమంది బిడ్డల్ని కన్నారు. కాన్నీ వాళ్ల భవిష్యత్తును గూర్చి కించిత్తునూడా ఆలోచించిరు. ఆడపిల్లలకు కావలసిన కనీస వస్తువులు కూడా పట్టించుకోరు. అలాంటిది వాళ్ళు ఆడపిల్లలకు పెళ్లిచేయడం నేను ఊహించలేను వాళ్ళు మాత్రం ఈ సంబంధం వదులుకోకూడదని, ఊర్లో ఇరుగు పొరుగు, బంధుజనాలు చెప్పిన మాటలకే విలువిస్తూ పెళ్లి చేసేయాలని పట్టుపట్టారు" అని ఆక్రోశ ఆవేదనలతో వివరించింది సురుచిర.

ఇదా సంగతి! ఈ మాత్రానికి ఇంతగా కుమిలిపోవడందేనికి? నీకిష్టం లేకుంటే చెల్లి ఇంకా చదువుకోవాలని, ఇప్పుడే పెళ్లిచేసే ఆలోచనే లేదని చెప్పేస్తేసరి.

మాలీ! నీకు నా ఇంటి పరిస్థితుల్ని, మా వాళ్ల మనస్తత్వాల్ని గూర్చి ఎంత చెప్పినా మళ్లీ కొత్త వాళ్ళలా ఏమీ తెలియనట్లు ప్రశ్నిస్తుంటావు. కందుకూరి వీరేశలింగం దంపతులు అంత పెద్దమూర్ఖ సమాజాన్ని ఎలా సంస్కరించి చక్కబెట్టారేమోగానీ నేను మాత్రం మా ఇంటి మనుషులనే ప్రగతి మార్గంలోకి మళ్లించలేకపోతున్నాను. ప్రతి చిన్న పనీ పోరాటం చేస్తేగానీ జరిగేటట్లులేదు.

నీవు కాబట్టి నిలబడ్డావుగానీ నాబోటిదైతే అసలు బ్రతికేదాన్నే కానేమో సురూ!

ఆ పరిస్థితే వస్తే మనసున్న ఏమపినిషైనా ఈ పాటిగా నిలబడక తప్పదు మాలీ. నా తర్వాత ఐదుగురు అమ్మాయిలు, నలుగురు అబ్బాయిలున్నారు. ఈ వరకు వాళ్ల చదువులే పూర్తి కాలేదు. చదువు, సంపాదన, పెద్దల ఆస్తులు ఏవీ లేకుండా అమ్మాయిల పెళ్ళిళ్లు నేను కలలో కూడా భావించుకోలేను. ఈ వరకు పెద్దచెల్లికే డిగ్రీ పూర్తికాలేదు. దానికి లక్ష్యం మీదే గురిలేదు. జీవితమంటే ఒక అవగాహన, మంచీ, చెడుల వివేచన లేదు. పెళ్లంటే అదికూడా ఊరేగుతోంది. పెళ్లి అంటే సినిమాలో లాగా హీరో హీరోయిన్‌లుకలసి సరదాగా డ్యూయెట్లు పాడు కొంటూ ఆడుకోవడం అనుకొంటోంది. ఎంతమంది అమ్మఅమ్మమ్మల, అక్కా చెల్లెళ్ళ పెళ్లి జీవితాలు బుగ్గిపాలై పోలేదు! ఎంతమంది అబలలు నాలుగు గోడల మధ్య చీకటికోనలో మురిగిపోవడం లేదు! ఇలాంటి దుర్భర పరిస్థితుల్ని ఎదుర్కొనేశక్తి సామర్థ్యాలున్నాయా అనే ఆలోచనే లేదుదానికి.

మరినీవు క్లాసు తీసుకోకపోయావా ఆ అమ్మాయికి?

ఒక క్లాసేమిటిమాలీ! ఇక్కడ విద్యార్థులకెన్ని క్లాసులు చెబుతున్నానో అంతకన్నా ఎక్కువ క్లాసులే తీసుకుంటాను రోజూ దానికి.

ఏమంటుంది మరి!

ఏదో అస్తవ్యస్తంగా మాట్లాడుతుంది. వాటికొక అర్థం ఏమీ వుండదు ఆ వేశం తప్ప. అది ఏమన్నా కూడా ముందు కావాల్సింది చదువే ఆపైన ఉద్యోగం. ఆ తర్వాతే పెళ్లిమాట ఎత్తాలి. ఏది జరిగినా దానంతట అది భరించుకోగల్గాలి. ఆ స్థాయికి దాని వ్యక్తిత్వం ఎదిగాకనే ఏదైనా, ఈలోగా మిగతా ఆలోచనలు రావడం దానికి, మాకు ఎవ్వరికీ మంచిదికాదు. మాలీ! డబ్బుతోపాటు అదృష్టం కలసి వచ్చిన అమ్మాయిలకు పెళ్ళంటే "నూరేళ్ళపంట" కావచ్చు కానీ చాలీచాలని ఆతుకుల బ్రతుకులుసాగించే నిర్భాగ్యులైన అమ్మాయిలకు అది "నూరేళ్ళతంట" అవుతుంది ఎంతో

మంది పాటి స్త్రీల పెళ్లి జీవితాల్ని గమనిస్తే జైలు జీవితంలో నైనాకాస్త సుఖం, స్వేచ్ఛ ఉంటుందేమో కానీ పెళ్లి జీవితంలో మాత్రం అవి శూన్య మనిపిస్తుంది నాకు.

సురూ! నీవు కొన్ని తరాల ఆడవాళ్ళ వైవాహిక దుర్భర జీవితాల్ని చిన్నప్పటినుంచీ క్షుణ్ణంగా చదివేశావు. నీకు ఏది మంచిదో ఆలోచించుకొని, పెళ్లి వద్దనుకొని గట్టిగా ఒక నిర్ణయం తీసుకున్నావు. అందుకు నాజోహర్లు కానీ మొదటినుంచీ మీ పెద్దలు బంధువుల బాధ్యతల్ని అదనంగా నెత్తినె సుకొని నిన్ను సుఖ శాంతులతో పెంచలేకపోయారు. బంధు జనాలు నేర్పరి తనంతో వాళ్ళ వాళ్ళ కార్యాలు నెరవేర్చుకొని పారిపోయారు. మీ కుటుం బానికి ఏ మాత్రం సహాయపడలేదు కదా కృతజ్ఞతగా కూడా ప్రవర్తించడం లేదు. మీ పెద్దవాళ్లు ఇప్పటికైనా నీ విషయంలో పశ్చాత్తాపం పొందడం లేదు. కనీసం ఇప్పుడైనా నిన్ను అన్ని సౌకర్యాలమధ్య సుఖశాంతులతో బ్రతకనివ్వడం లేదు. నీ అనుమతి లేకుండా కార్యాలకు పూనుకొంటూ నిన్ను బాధ పెట్టుతున్నారు. బాధ్యతలన్ని నీవిగా, హక్కులన్నీ వాళ్ళవిగా చేసుకుంటున్నారు—అంటూ కళ్ళల్లో నీళ్లు పెట్టుకొంది మాలిక.

నన్ను గూర్చి నీవైనా ఇంతలోతుగా ఆలోచించి కన్నీళ్లు కార్చుతు న్నందుకు నీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియడం లేదు మాలీ!

సరేలే! ఇప్పుడు మీ వాళ్ళకు తీర్చుతున్న ఋణాలు చాలదూ!

మాలీ! మనిషిపుట్టాక ఎన్నో మంచి పనులు చెయ్యాలి. విష్ణుమూర్తి, దేవతలు, దధీచి మహర్షి, శిబి చక్రవర్తి, బలిచక్రవర్తి, స్వాతంత్ర్య సమర వీరులు, సంఘసంస్కర్తలు మొదలైన ఎందరో పుణ్యమూర్తుల గూర్చి చిన్నప్పుడు పాఠాల్లో చదువుకున్నాం కదా. వారిలో నేను అణువంతైనా కాను. మనం అనుభవించేస్తే ఏముంది గొప్ప! మనవల్ల పదిమందీ చదువు కొని వెలుగు జీవితం గడుపుతూ ఆరని రత్నదీపాల్లా ప్రకాశిస్తుంటే అదేకదా జన్మకు పరమార్థం. మాలీ! నా బాధంతా ఒక్కటే. పిల్లల అలనాపాలనా నేను చూసుకుంటూ వాళ్ళను చదివిస్తుంటే లోకం పీడపడలేక వాళ్ళను పెళ్లి పేరుతో చదువు లక్ష్యాన్ని దెబ్బతీస్తున్నారు మాపెద్దలు. బంధువులకు,

ఇరుగు పొరుగు వారికి మా ఆడపిల్లలు చదువుకోడం నచ్చదు. అసూయతో సూటిపోటు మాటలంటూ వేధిస్తుంటారు. ఒకప్పుడు నా చదువు, పెళ్లి విషయాల్లో లోకాన్ని, బంధువర్గాన్ని, నిలదీసి ప్రశ్నించిన మా వాళ్ళు ఇప్పుడు ఇంతగా బేలలైపోతుంటే నాకే ఆశ్చర్యంగా వుంది. నా సంపాదనతో పాటు, నా ఒంట్లోని సర్వశక్తుల్ని ధారపోసి వాళ్ళకు చెబుతున్నాగానీ "చెవిటి వాళ్ళకు శంఖం ఊదినట్లు" వ్యర్థమవుతోంది అంటూ సురుచిర తన రెండు చేతులతో గట్టిగా తలపట్టుకొని వేదనతో ఒక్కసారిగా నిట్టూర్పు విడిచింది.

"అయితే ఈ రోజు సాయంత్రం నీతోపాటు మీ ఇంటికొచ్చి మీవాళ్ళ చెవుల్లో నేను విష్ణుశంఖం ఊదుతాలే" అనిసునిశిత హాస్య ధోరణిలో సురుచిరకు ధైర్యం చెప్పింది మాలిక.

ఇంకనైనా అన్నం తినమ్మా అంటూ మాలిక సురుచిర గడ్డం పట్టుకుని మరీ వేడుకొంది.

ఆమె ఓదార్పు సురుచిర చిగురాకు పెదవులపై చిరునవ్వుల మల్లె పూలు పూయించింది. ఆమెదోసెడేసి కళ్ళల్లో కన్నీళ్ళస్థానంలో వెన్నెలసోన చిలికించింది. తనకోసం కాక తనవాళ్ళ బాగుకోసం, సాటి మనుషుల బ్రతుకులకోసం కన్నీరు కార్చే ఆమె త్యాగహృదయానికి ఊరట కలిగించింది.



నేటిభారతం

అగస్టు, 1997

# సౌభాగ్య



"పుణ్యం కొద్ది పురుషుడు, దానంకొద్ది బిడ్డలు" అంటారు పెద్దలు. ఒక్కొక్కసారి అది నిజమే అనిపిస్తుంది. లోకంలో కొన్ని ప్రేమ జంటల్ని చూస్తుంటే, కొన్ని దంపతుల జంటల్ని చూస్తుంటే ఎంతో ముచ్చటేస్తుంది. కొన్ని జంటల్ని చూస్తుంటే పెళ్లే వద్దనిపిస్తుంది.

సౌభాగ్య సుమన్‌లు ప్రేమ వివాహం చేసుకున్నారు. ఇద్దరూ డిగ్రీ కాలేజ్‌లో లెక్చరర్లుగా పనిచేస్తున్నారు. స్నేహితుల్లాగా సరదగా వుంటారు. సాయంత్రం కాలేజి నుంచి ఇంటికి రాగానే సుమన్ సోఫాలో కూలబడ్డాడు.

సౌభాగ్య కూడా కూలబడితే టీ ఎవరు పెడ్తారు? అందుకని ఎంత అలసట్టైనా స్త్రీగా పుట్టినందుకు తప్పదుకదా అనుకుంటూ, అందులోనూ తన ప్రియభర్త అంటే ఆమెకు ఎంతో అపురూపం కాబట్టి వంటింట్లోకి వెళ్లి "టీ" చేసి తెచ్చింది. సుమన్‌కి అందించింది. తానూ తీసుకొంది. ఎంత మంచిదానివి సౌభాగ్యా! నీలాంటి భార్య దొరకడం నా అదృష్టం అన్నాడు సుమన్. ఆఁ ఏమీలేదు. విసుక్కోకుండా ఇంటిపనులు చేస్తున్నానని, ఇంకా ఇలాగే చెయ్యాలని ముఖస్తుతి చేస్తున్నావు అంతే అంది సౌభాగ్య బుంగ మూతిపెట్టి.

వెంటనే నీ ముక్కుమీద కోపం నీముఖానికే అందం నీ బుంగమూతి కందం, నా ముందరి కాళ్ళ బంధం" అంటూ సుమన్ పాటపాడే సరికి సౌభాగ్య ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ లోపలికెళ్లింది డ్రస్ చేంజ్ చేసుకోవడానికి.

తలుపు దగ్గరకేసి డ్రస్ చేంజ్ చేసుకుంటూ వుంటే సుమన్ చప్పుడు లేకుండా మునిగాళ్ళమీద నడిచొచ్చి వెనకనుంచి సౌభాగ్యను గట్టిగా కౌగిలించుకున్నాడు.

సౌభాగ్య పెద్దగావుకేక పెట్టేసరికి "నేనేనోయ్" అన్నాడు సుమన్ మీ చిలిపి చేష్టలకేమిలెండి, దేనికైనా వేళాపాళా వుండద్దా! అంటూ ప్రేమగా

చీవాట్లుపెట్టి ప్లీజ్, వెళ్ళండి అంటూ అతన్ని తోసింది సౌభాగ్య సుమన్ ఉసూరుమంటూ వెళ్లి సోఫాలో కూర్చున్నాడు. సౌభాగ్య డ్రస్ చేంజ్ చేసుకొనివచ్చి సుమన్ ప్రక్కన కూర్చుంది. సుమన్ ఆమె భుజంపై చేయివేసి, చెంపకు చెంప ఆనించికబుర్లాడు తున్నాడు.

అప్పుడే సుమన్ స్నేహితుడు విజయ్‌వచ్చాడు. ఏవిట్రా ఇద్దరూ తీరిగ్గా కూర్చున్నారు! మిమ్మల్ని చూస్తుంటే చిలకా గోరింకలు, లైలా మజ్నూలు, సలీం అనార్కలీలు, రతీ మన్మధులు గుర్తొస్తుంటార్రా జంట అంటే మీలాగా ఉండాల్రా అన్నాడు విజయ్. మీజంటకేమయిందిరా. మీరు ఇలా ఉండటం లేదా? అన్నాడు సుమన్.

సరే, మీరు మాట్లాడుతూవుండండి, నేను వెళ్లి వంట చెయ్యాలి అంటూ సౌభాగ్య వంటింట్లోకి వచ్చేసింది. అరటికాయ కర్రీ చేద్దామనుకుంది. అరటికాయ నారతీసి చాకుతో కట్‌చేస్తుంటె వేలుకసక్ అని కోసుకుంది. రక్తం బొటబొటకారింది సౌభాగ్యకు కళ్లు తిరిగే పరిస్థితి ఏర్పడింది.

చాకు అక్కడ పడేసి ఏవండీ! వేలు తెగింది తొందరగా రండి అని అరచింది.

విజయ్ ఏదోపని వుందని ముందే వెళ్లిపోయాడు. పేపర్‌చదువుతున్న సుమన్ సౌభాగ్య కేకవిని లోపలికి పరుగెత్తాడు.

అయ్యో! ఎంత పని చేశావ్ భాగ్యా! అంటూ్లాత్ చింపి తడిచేసి ఆమె వేలుకు కట్టాడు సుమన్. పెళ్ళయ్యి రెండేళ్ళవుతున్నా కుడా తొలి రోజుల్లో ఎలా వున్నాడో సుమన్ ఇప్పుడూ అలాగే ఉంటున్నందుకు సౌభాగ్య ఎంతో సంబరపడిపోతోంది. సుఖాల్లో ఎంత ఉత్సాహం చూపిస్తాడో, కష్టాల్లోనూ అంతలాలనగా చూసుకుంటాడు సుమన్. ఇలాంటి మానవత్వం దయా హృదయం వున్న మంచి భర్త తనకు దొరకడం "తొలి జన్మపు నోము ఫల"మను కొంటుంది సౌభాగ్య.

సౌభాగ్య ఏదో ఆలోచిస్తోందని తెలుసుకొని సుమన్ ఓయ్, ఏవిటి ఏదో ఆలోచిస్తున్నావ్, తలనొప్పిరాదూ, అంటూమెల్లగా డీ కొట్టాడు ఆ(

అంటూ ఉలిక్కిపడి, ఏమిలేదండీ నా అదృష్టానికి ఆశ్చర్యపోతున్నాను అంది సౌభాగ్య. ఏమిటా అదృష్టం? అడిగాడు సుమన్.

మీకన్నా ఇంకేముంటుందండీ నాఅదృష్టం. అంది అలా అనుకోవడం నీ మంచితనం భాగ్యా! సరేలే అంటూ నీరసంగా ఉన్న సౌభాగ్యను పట్టు కెళ్లి బెడ్‌పై పండబెట్టి రెస్ట్ తీసుకోమని చెప్పి. తాను వంటగదిలోకి దూరాడు సుమన్.

సౌభాగ్య వదిలేసిన అరటి కాయల్ని కట్‌చేసి అప్పుడప్పుడూ అల వాటు ప్రకారంగా వంట వస్తువులన్నీ సమకూర్చుకుని వంటరెడి చేశాడు సుమన్. వంటపని పూర్తయిపోయింది భాగ్యా' రా భోజనం చేద్దాం అని ఆమెను పట్టుకొని పోయాడు సుమన్.

ఈలోగా పక్కింటి నాలుగేళ్ల కుర్రోడు వాళ్ళ అక్కగౌను వేసుకొని మొకానికి ఒత్తుగా పౌడర్ పూసుకొని కళ్లకు కాటుకంతా పులుముకొని, నొసలిపై తిలకం రుద్దుకొని బాల బఫూన్‌లా వచ్చాడు. వాణ్ణి చూడగానే సౌభాగ్య సుమన్‌లు ఫక్కుమని నవ్వుకున్నారు. ఇదేమి పగటి వేషంరా బాబూ, అమ్మ ఇంట్లో లేదా అంది సౌభాగ్య.

లేదు ఎక్కలికో ఎల్లింది. అప్పులు నేనుపూచుకొనేచా అన్నాడు ఆ తొక్కు పలుకుల చిట్టోడు. వాణ్ణి ఎత్తుకొని పోయి వాళ్ళఅమ్మకు చూపించ బోయింది సౌభాగ్య. సమయానికి ఆమెలేదు. కొంతసేపటికి వచ్చింది. నీ ముద్దుల చిన్న కృష్ణుడు వేషం చూడమ్మా అంటూ వాణ్ణి వాళ్ల అమ్మకు అప్పగించి వచ్చేసింది సౌభాగ్య.

డైనింగ్ టేబుల్ దగ్గర తాను సుమన్ కూర్చొని ఇద్దరూ ఒకరికొకరు తినిపించుకుంటూ భోజనం పూర్తిచేశారు. మళ్లీవచ్చి సోఫాపై విశ్రమించారు. సుమన్‌కి సంగీతం అంటే చాలా ఇష్టం. అందులో పాత సినిమా పాటలంటే మరీ చెవికోసుకుంటాడు.

క్యాసెట్‌పెట్టి, టేప్ రికార్డర్ ఆన్ చేశాడు సుమన్. "నిలువవె వాలు కనులదానా, ఒయ్యారి హంస నడకదానా" అనే పాటవచ్చింది. తాను ఆ

పాటతో గొంతుకలిపాడు. సుమన్. అతనుపాడుతుంటే నోరారనవ్వుకుంటోంది పాట పూర్తయింది.

భాగ్యా! నీవెంత అందంగా వుంటావో తెలుసా! చాలామంది స్త్రీలు వయసు పెరిగేసరికి అందం కోల్పోతుంటారు కానీ నువ్వు మాత్రం రోజు రోజుకూ ఇనుమడిస్తున్నావ్. నువ్వు గతంలో గంధర్వ కాంత అయ్యుంటావు భాగ్యా! నీ కళ్లు నీ ముఖసరస్సులోని రెండు పెద్ద చేపల్లాగా, బాగా విచ్చిన రెండు తామరపువ్వుల్లాగా వుంటాయి. నీ పైదవులు సన్నటి చిగురాకుల్లా అరుణకాంతుల్ని వెదజల్లుతుంటాయి నీ చెక్కిళ్లు నిలువుటద్దాల్లా శ్వేతకాంతుల్ని ఈనుతుంటాయి. అని సుమన్ సౌందర్య స్తోత్రం చేస్తుంటే ఇక చాల్లే చిలిపిచేష్టల శ్రీవారూ ఈ పొగడ్తలు! రేపటికి కొంచెం వుండనీ అంటూ అతని నోటిపై చేయి పెటింది. అయితే ఇప్పుడేం కేమి చేయమంటావ్ సుదతీ ఇప్పుడు అన్నాడు సుమన్.

సౌభాగ్య వలపు చూపులు విరజిమ్ముతూ, కొంటెగా అతని బుగ్గ నొక్కుతూ, పాపం ఏమీ తెలియదు అబ్బాయిగారికి అని వ్యంగ్యంగా ఎత్తిపొడిచింది. వెంటనే తెనాలి రామకృష్ణుడి స్టైల్లో "హా! తెలిసన్, నా చెలి కౌగిలి పిలిచెన్ జాగేల చేసెదన్" అంటూ సౌభ్యాను అమాంతంగా లేవదీసుకొని బెడ్‌మీద పడేసి బయట తలుపు గొళ్లెం పెట్టి రావడానికి వెళ్లాడు సుమన్.

ఈలోగా సౌభాగ్య ఒక తమషా చేయాలనుకుంది. బెడ్‌మీద నుంచి లేచి దుప్పటి కప్పుకొని మంచం కిందదాక్కుంది చిన్న పిల్లలాగా.

సుమన్ తలుపు గొళ్లెం పెట్టి వచ్చేలోగా సౌభాగ్య బెడ్‌పై లేదు. బాత్ రూంకి వెళ్లిందేమో, వస్తుందిలే అని తాను పడుకున్నాడు. ఎంతకూ రాలేదు సౌభాగ్య.

మంచం కిందవున్న సౌభాగ్య ఎలుకలాగా అతని చేతిని చురుక్కుమని బరికి మళ్లీ ముడుచుకొని దాక్కుంది అదేమిటోలే అనుకొని చెయ్యి

రుద్దుకొని మామూలుగానే పడుకున్నాడు సుమన్. మళ్లీ అతని చెయ్యి బరికింది సౌభాగ్య. ఈసారి ఏమిటో చూద్దాం అనుకొని కిందకి చూసాడు సుమన్.

ఇంకెవ్వరు తన చిలిపిచేష్టల సింగారబొమ్మ సౌబాగ్య. ఇకచూసుకో, ఒయ్! దొంగ! నువ్వు బాత్‌రూంకివెళ్లావను కుంటున్నాను ఇక్కడ దాక్కున్నావా! చిన్నదానా! ఉండు నీపని చెబుతానంటూ సుమన్ కిందకి దిగివచ్చి సౌబాగ్యను రెండు చేతుల్తో పట్టి ఎత్తుకున్నాడు. చిన్న పిల్లను తిప్పినట్లు పరదగా గిరగిరా తిప్పి బెడ్‌పై పండబెట్టాడు సుమన్.

సౌబాగ్య సుమన్‌ల మనసులు అంబర వీథుల్లో ఆనంద డోలికల్లో ఉయ్యాలలూగసాగాయి.



కోస్తావాణి
29-9-1996

# సౌహార్దం



భారతి హైదరాబాదు సెక్రటేరియట్‌లో స్టెనోగా పనిచేస్తోంది తాను వాళ్ల స్వగ్రామం వెళ్లి రెండు సంవత్సరాలు దాటింది

ఒకరోజు కలలో తనకు అమ్మానాన్నలు కనిపించారని, వెళ్లిచూసి వస్తానని వాళ్ళ అక్కకు చెప్పింది. అలాగే వెళ్లి చూసిరామ్మా అని నీలవేణి మరుసటిరోజున తన చెల్లెల్ని రైలెక్కించింది. భారతికి రైలెక్కింది మొదలు మనసంతా తనవూరి వాళ్ళవూసులుమీద పువ్వుమీద తేటిలాగా తిరుగాడు సాగింది. రైలు కన్నా ముందుగా మనసు పరుగులు తీస్తోంది. ఉదయం 6 గంటలకంతా రైలు తిరుపతి చేరుకుంది. అక్కడినుంచి వాళ్లవూరు పది కిలోమీటర్ల దూరంలో వుంది. రిక్షాలో ఆర్టీసి బస్టాండ్ చేరుకుంది భారతి అక్కడ వాళ్ళవూరు జనాలందరూ గుంపులు గుంపులుగా కూర్చొని లోకాభి రామాయణం మాట్లాడుకుంటున్నారు. భారతిని చూడగానే ఆకాశం నుంచి చుక్క ఊడిపడినంత ఆశ్చర్యం కలిగింది వాళ్ళకు.

ఊరు జనాల్లో పావని అనే అమ్మాయి భారతికి చిన్ననాటి నేస్తం. చాలా సరదాపిల్ల. ఆ అమ్మాయికి పదహారేండ్లకే పెళ్లిజరిగిపోయింది. ఇద్దరు పిల్లలుకూడా. భారతిని చూడగానే పావని గబగబాలేచి ఆత్రంగా వెళ్లి వాటే సుకుని, ఒసే బారాదానా! బాగుండావా! ఏమే వూరికి వొచ్చేదే మానేసినావే! మమల్ని నువ్వు మరచి పొయ్యుంటావులే నీలక్క బాగుండాదా! అక్కను ఒక్కదాన్నే పెట్టేసి ఒచ్చేసినావా! భయంలేదా అక్కడ! అంటూ వసపిట్ట లాగా ఒకే ధారగా వాగసాగింది. పూత మెరుగులులేని పావని స్వచ్ఛపు మాటలు భారతిని గిలిగింతలు పెట్టాయి. ఇలాంటి కపటం లేని మాటలు విని ఎంతకాలమయిందని లోలోపల మురిసిపోయింది భారతి. కృతకమైన నగరవాసులకు, నిసర్గమైన పల్లె వాసులకు మధ్యవుండే తారతమ్యం ఇదే. వాళ్ళ మనసులు కాగితాలపూలు. వీళ్ళ మనసులు అడవిమల్లెలు. పావని గుక్క తిప్పుకోకుండా ఒక్క వూపులో మాట్లాడిన తర్వాత కొంత ఎడం వచ్చింది. అప్పుడు భారతి నేను బాగున్నాను. అక్కకూడా బాగానేవుంది.

నువ్వు బాగున్నావా! నేను మిమ్మలి ఎలా మరచిపోతాను? అందులో నిన్ను మరీను! "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అన్నాడు కదా శ్రీ రాముడు. ఇక ఏంటి సంగతులు అంటూ మన స్నేహం తడి ఆరని చందన గంధం లాంటిది అని భారతి చెబుతుండగా బస్సురానే వచ్చింది.

అందరూ ఎవరి లగ్జేజి వాళ్లు ఎత్తుకొని హడావుడిగా వెళ్లి కిటికీలనుంచి టవళ్ళు, పంచులు విసిరేసుకుంటూ సీట్లు రిజర్వు చేసుకుంటున్నారు. పావని, భారతికూడా ఎలాగో తోసులాడుకుంటూ బస్సు ఎక్కి సీటు సంపాదించుకొని ఒక్కచోటే కూర్చున్నారు.

ఇప్పుడు వాళ్ళకు మాట్లాడుకోవడానికి మంచి ఛాన్సు దొరికింది బస్సులో కూర్చున్నది మొదలు పావని భారతి చేతినిలాక్కొని తన ఒడిలో పెట్టుకొని మనసారా ఏవేవో మాట్లాడేస్తూవుంది.

ఏవేఁ, బారూ! నువ్విప్పుడు ముందుకన్నా లావుగా, తెల్లఁగా మల్లి పువ్వుమాదిరిగా వుండావే. నేను సూడే, సేన్లోపడి ఎండల్లో వానల్లో పనులు చేసి బొగ్గులాగా అయిపోయినాను. నేనుకూడా నీ మాదిరిగా సదువుకోనుంటే నీడపాటిన సుఖంగా బతుక్కునేదాన్ని. మా వాళ్లయినా నన్ను నాలుగుతన్ని సదివించలేకపోయినారు. సేద్యం సేసేమనిషికిచ్చి పెండ్లి సేసిచారు. పిల కాయల్ని కూడా కనేసి ముసిల్దాన్నయి పోయినాను. నువ్వుమాత్రం ఇంకా పిల్లమాదిరిగానే వుండావే. నీపనే సుఖం అంటూ తన ఆవేదనంతా వెళ్ళ బుచ్చుకుంది పావని.

పావని చిన్నప్పుడు సరిగ్గా చదివేదికాదు. ఎప్పుడూవాళ్ళను, వీళ్ళను ఏడిపిస్తూ, నవ్విస్తూ కాలక్షేపం చేసేది. ఇప్పుడేమో చదువుకోలేదని దిగులు పడుతోంది. నీళ్ళుపోయాక గట్టేసి ఏం లాభం? పావనిని గత కాలం బాధ నుంచి మళ్లించడం కోసం భారతి సంభాషణ మార్చింది.

పావనీ! మనం ఐదోతరగతి చదివేటప్పుడు హరి, రవి, రాజా, వశిష్ట వీళ్ళందరూ మనల్ని భలే ఆటపట్టించేవాళ్ళుకదా. మనం నీళ్లబావికెళ్లి పంపు నుంచి నీళ్ళు పట్టుకుంటూవుంటే వాళ్ళు వెనకాలే వచ్చి చచ్చిన పామును ఒకదాన్ని కట్టెతో తెచ్చి నీవీపుపై పడేసి దెమదెమా పరుగెత్తేసే

వాళ్ళు. అప్పుడు నువు ఓయమ్మో! అయ్యో! కుయ్యో! నాయనో! అంటూ అగడం చేసి, నీళ్ళ బిందిని బావిలో వేసేశావు గుర్తుందా! ఇంకొక రోజేమో ఆ కొంటెకాయలు మనం మామిడి చెట్టుకింద కూర్చొని వానా గుంటలు ఆడుతూ వుంటే ఎండిపోయిన తొండను ఒకదాన్ని పట్టుకొన్ని నానెత్తిపై విసిరేసి దౌడుతీశారు. అప్పుడు నేను బెదిరిపోయి నిన్ను గట్టిగా అదిమిపట్టుకొని కళ్ళుమూసుకొనేశాను. అవన్నీ ఇప్పుడుతలచుకొంటే ఎంతహాయిగా వుంది అన్నది భారతి.

ఔనే బారూ! నువ్వు ఎంతైనా పెద్దసదువు సదువుకున్న దానివి. సిన్న సిన్నవి కూడా బాగా గుర్తు పెట్టుకుంటావు అని పావని మెచ్చుకుంటూ వుండగా బస్సు ఊరు దగ్గరికి రానే వచ్చింది. ఇద్దరూ బస్సుదిగారు. కొంత దూరం గెనాలమీద నడవాలి. బస్సుదిగిన వాళ్ళు బారులు సాగి నడుస్తున్నారు. ఏడేండ్ల పిల్లవాడు గెనం మీద నుంచి జర్రున కాలుజారి పడ్డాడు. మోకాలికి, మోచేతికి కొద్దిగా దెబ్బలు తగిలాయి. కొందరు వాడు పడ్డాడని బెళ్ళున నవ్వుకుంటూ పోతే, కొందరు వెధవ, ముందు చూసి నిదానంగా కదరపోవాలి అంటూ వాణ్ణి దాటుకొనేసి కడపులో ఆకలికి పేగులు గోల పెడుతున్నాయేమో, పెద్ద పెద్ద అడుగులు వేసుకొంటూ పోతున్నారు. వీళ్ళ స్వార్థబుద్ధులు భారతి మనసును కలచివేసింది. కిందపడిన బిడ్డను లేవదీసి దుమ్ముదులిపి చెయ్యిపట్టుకొని నిదానంగా నడిపించుకొని పోతుంది భారతి. భారతి వెంట పావని కృష్ణుడి వెంట సుదాముడిలా నడచిపోతోంది. పావని వూరు మిట్టమీద కంద్రిగ దగ్గరపడింది. బారూ! మా యింటికొచ్చి కొంచెం కూడు తినేసిపోదువురా! మా ఇంట్లో పెరుగంటే నీకు శానా ఇష్టం కదా అని అడుక్కుంది భారతిని.

ఇప్పుడొద్దులే, ఇంటికెళ్లి అమ్మా వాళ్ళను చూసేసి స్నానపానాలు ముగించుకొని, కొంతసేపు నిద్రపోయి సాయంత్రం గానీ, రేపు ఉదయాన్నే గానీ వస్తానని చెప్పి భారతి వాళ్ళవూరువైపు మళ్లింది. అక్కడ పల్లెలు కొంత కొంత ఎండతో నదీతీరంలో అక్కడక్కడ మెరుస్తున్న ఇసుక దిబ్బల్లా కనిపిస్తాయి దూరానికి.

భారతి, భారతితోపాటు పక్కింటి పిల్లవాడు మెల్లగా నడుస్తున్నారు. వాడి పేరు మధు. భారతి వాళ్లకు మధు వాళ్లు చాలా సన్నిహితంగా వుం టారు. ఇద్దరివీ ప్రక్కపక్క ఇండ్లే. వాళ్ళవూరు పానకం కొంచెం కొంచెం సూర్యోదయ విన్యాసంలా కనిపిస్తోంది. మధుకు కథలంటే మహాఇష్టం. పెద్దవాళ్లు కనిపిస్తేచాలు కథలు చెప్పమని పోరు పెట్టేస్తాడు. అందులోను నవ్వించే కథలంటే వాడికి ఇంకా ఇష్టం.

భారతక్కా మనవూరికి పానకం అనే పేరెందుకు వచ్చింది? పానకం అంటే బెల్లం నీళ్లు కదా అన్నాడు. మధు, ఔన్రా! బాగా చెప్పావు. బెల్లం నీళ్ళవల్లే మనవూరికి "పానకం" అనేపేరు వచ్చింది అంటూ బెల్లం ఎలా వస్తుంది అని వాణ్ణీ ప్రశ్నించింది భారతి. వాడు నవ్వుకుంటూ "చెరుకు లోంచి" అని టకీమని చెప్పాడు. ఇక అసలు విషయంలోకి అడుగుపెట్టింది భారతి

మన వూళ్లో మా తాతవాళ్ళు చెఱకు దండిగా పండిచే వాళ్ళంటా. చెరుకు తోటను కొట్టి చెక్కర మిల్లుకు పంపించ కుండా మావాళ్లే బెల్లం ఆడించేవారంట. ఆ బెల్లం ముద్దలు మా యింటి నిండా ఎప్పుడూ స్టాక్ వుండేదట. ఎండాకాలంలో దారినిపోయ్యే ప్రతి ఒక్కరు మా పందిట్లో కూర్చొని అలసట తీర్చుకునే వాళ్ళంట. అప్పుడు మా నాన్నమ్మ, జేజెమ్మవాళ్లు బెల్లం కొట్టి నీళ్ళలో కలిపి పానకం చేసి వాళ్ళకిచ్చేవాళ్ళంట. అప్పుడు పట్టుమని పదిఇండ్లుకూడా లేవంది, పానకం తాగినవాళ్లు పోతూపోతూ త్రేన్చుతూ ఆదందంగా పానకం పానకం అనే వాళ్ళంట. అప్పటినుంచీ మన వూరికి పానకం అనేపేరు వచ్చిందని చిన్న ప్పుడు చిన్నప్పుడు తనకు తాత చెప్పిన కథను వీడికి చెప్పింది భారతి. అట్టాగే భారతక్కా అంటూ వాళ్ళ ఇల్లురాగానే ఎగురుకుంటూ వెళ్లాడు రఘు.

మధువెళ్లాక మరో నాలుగడుగులు ముందుకు నడచి తన ఇంటికి వెళ్లింది భారతి. భారతిని చూడగానే వాళ్ల అమ్మ కన్నులు నక్షత్రాల్లా మెరిసిపోయాయి. చేస్తున్న పనిని వదలేసి చేతులు కడుక్కొని లోపలికి వెళ్లి మంచినీళ్లు తెచ్చింది భారతికి. ఏమా! బాగున్నావా! ఇన్నాళ్ళకు గుర్తొ చ్చామా అన్నది వాళ్ల అమ్మ. లేదమ్మా! తీరిక దొరకడం లేదు. ఊపిరాడని

పనులువల్ల రాలేకపోయానంటూ, ఔనూ! నాన్న, అన్న, చెల్లెళ్ళు ఎక్కడె క్కడికెళ్ళారు? అని ప్రశ్నించింది భారతి.

చేను దగ్గరికెళ్ళారమ్మా అని చెప్పింది వాళ్ళ అమ్మ.

దేనికైనా హద్దువుంటుంది కానీ అమ్మ ప్రేమకు హద్దు వుండదు. ఆమె అప్యాయంగా హడావుడిగా భారతికి ఇష్టమైన వంటకాలు, తియ్యని పిండి వంటలు చేసిపెట్టి దగ్గరకూర్చొని మరీ బలవంతంగా తినిపించింది. అమ్మ చేతి వంటకం తినీ ఎంతకాలమయింది అనుకుంటూ ఆత్రంతో అన్నీ ఘటోత్కచుడిలా బాగా తినేసి కుంభ కర్ణుడిలా పడి నిద్రపోయింది భారతి. ప్రయాణపు ఒడలిక అంతా వదలిపోయింది. భారతికి పావనిని కలవాలని పించింది. మరునాటి ఉదయాన వాళ్ల వూరికెళ్లింది పావని మేఘాన్ని చూసిన మయూరంలా సంబరపడిపోయింది. ఇద్దరూ ఇంటి ప్రక్కనున్న చింత చెట్టుదగ్గర ఒకరిచేయి నొకరు పట్టుకొని కూర్చున్నారు.

బారూ! మళ్లీ ఎప్పుడెల్తావు ఐదరాబాదుకి అని అడిగింది పావని. పది రోజులు తర్వాత అన్నది భారతి. ఇంతలో భారతి ఆలోచనల పవనాలు చిన్ననాడుపావని బడిలో చేసిన అల్లరి చేష్టల తోటల మీదికి ప్రసరించాయి.

ఒకసారి అయ్యవారు ఒడిలో పాఠం చెబుతుంటే తన జడను. లత జడను కలిపి పావని ముడేసింది. నోట్‌బుక్‌లో అయ్యవారి అద్దాలముఖం, లావుపాటి బొజ్జవేసి దానిపై నిలువు నామాలు పెట్టి వాళ్ళకు చూపించింది. వాళ్ళను రెచ్చగొట్టి నవ్వించింది. తాను మాత్రం నోరునొక్కుకొని సైలేంట్‌గా కూర్చున్నది. అయ్యవారు లతను, భారతిని బయటికి వెళ్లమని అరుస్తూ కళ్లు ఊరిమి చూశాడు.

ముడిపడిన జడలతో వాళ్ళు గుంజుకుంటూ వెళ్ళుతుంటే అయ్యవారితో సహా స్కూల్ పిల్లలందరూ కడుపు ఉబ్బేలా నువ్వుకున్నారు. ఇలా పావని చిన్నప్పుడు చిలిపి చేష్టలు చేసి చదువును బాగా నిర్లక్ష్యం చేసింది. ఇప్పుడేమో ఇంతగా బాధపడుతోంది అని భారతి ఆలోచిస్తుండగా పావని

'ఏంటే' మాట్లాటకుండా చూసున్నావ్' అంటూ వీపుమీద పెద్దబోలు దెబ్బ వేసి ఈ లోకంలోకి తెప్పించింది భారతిని. అబ్బ! అంటూ భారతి ఉలిక్కి పడి "ఏమీలేదే నిన్నుగూర్చే ఆలోచిస్తున్నాను" అన్నది. ఇంతలో ఇంట్లోంచి దుబ్బ చెక్కిళ్ల పాలబుల్లోడి కేకలు వినబడ్డాయి. సంటోడు లేచినట్లుంది, ఇప్పుడే వస్తానునుండు అంటూ లోపలికెళ్లింది పావని. అరమరలు లేని బాల్యస్నేహం ఆ సాహార్దం ఎంత మధురమో కదా అనిభావించుకో సాగింది భారతి.



కోస్తావాణి
21-9-1996

# సౌజన్యం



మీ కోసం కాదురా నేనీ ప్రశాంత జీవితాన్ని ఏర్పరచుకున్నది నేను చట్టబద్ధంగా, పిన్నల పెద్దల మధ్య ఈ సమాజంలో బాధ్యతాయుతంగా బతుకుతున్న మహిళనురా! భయమూ, భక్తిలేకుండా, సిగ్గూ, ఎగ్గూ లేకుండా కూటిముద్దల కోసం కుక్కలు ఎగబడినట్లు ఎగబడతారెందుకురా? ఎవరిచ్చార్రా మీకు హక్కు? మీ ఇళ్లల్లో మీమీ భార్యలపై, తల్లులపై, అక్కలపై, చెల్లెళ్ళపై, కూతుళ్ళపై మీలాగేవీధి కుక్కలు ఎగబడితే ఏం చేస్తార్రా? ఏదో మీరంతా నన్ను పోషించి, రక్షించి, భద్రంగాదాచి పెట్టుకున్నట్లు మీదమీద పడతారెందుకురా? అని నా మనసు సింహంలా గర్జిస్తుంటుంది. కోపం, ఆవేదన, అధిక్షేపజ్వాలలు ఒక్కోసారి నాగుండె గోళంలో ప్రజ్వరిల్లుతుంటాయ్ మాధవ్. కానీ ఏం చెయ్యను! ఈచదువు, ఈఉద్యోగం, ఈచట్టం నన్ను కట్టి పడేశాయి.

నీలో సున్నితత్వం, ఎదుటి మనిషిపై అపారమైన జాలి చాలావరకు తగ్గాలి. గతకాలంలో నువ్వు ఎదుర్కొన్న, ప్రస్తుతం ఎదుర్కొంటున్న అవమానాలకు సమస్యలకు, కష్టాలకు నీమంచితనమే మొదటి కారణమని పిస్తుంది రవళి.

అంటే మంచితనాన్ని చంపుకోమంటావా? మాధవ్

అలాఅని నేను అనను

మరేంటి?

ఎదుటి మనిషితత్వాన్ని, మోసాన్ని సూక్ష్మంగా పసికట్టగలగాలి. నీ విలువను నువ్వే అందరికన్నా బాగా తెలుసుకోవాలి. నువ్వు చదువును, ఉద్యోగస్థాయిని దృష్టిలో పెట్టుకొని మాట్లాడవు. కేవలం మానవ ధర్మం, మిత్రధర్మం, మనిషి అనే భావనలతో ఆప్యాయతా మకరందాన్ని జాలు వార్చుతూ లలితంగా మాట్లాడతావు. స్వార్థపరులు, కుత్సితులు దీన్ని అవకాశంగా, అలుసుగా తీసుకొని మితిమీరి ప్రవర్తిస్తుంటారు. వాళ్ళ బుద్ధుల

తోనే నిన్ను కూడా అంచనా వేస్తుంటారు అక్కడక్కడా వెళ్లి చెడ్డప్రచా రాలు కూడా చేస్తుంటారు. తాచెడ్డ కోతి వనమెల్లా చెరుస్తుంది కదా.

నిజమే మాధవ్! నేను అప్పుడప్పుడూ ఆత్మవిమర్శ చేసుకుంటూ వుంటాను. కఠినంగా వుండాలని ప్రయత్నిస్తూనే వుంటాను కానీ సమయం వచ్చేసరికి మళ్లీదయ చూపకుండా వుండలేక పోతున్నాను. ఎందరో మహ నీయులు మానవత్వం, దయ, పరోపకారం అలవరచుకోవాలని, సాటి మని షిని గౌరవించాలనే కదా ప్రబోధించారు. నీతి, ధర్మ శాస్త్రాలు కూడా అదే చెప్పాయి. అలాంటిది నాలో సహజంగా వచ్చిన ఈ సద్గుణాల్ని ఎలా పోగొట్టుకోవాలి మాధవ్!

కాలపరిస్థితుల్ని బట్టి, మనుషుల మనస్తత్వాన్ని బట్టి సమయాను కూలంగా పోగొట్టుకోక తప్పదు మరి నువ్వు దురాశాపరులపట్ల, పాలుతాగి విషం కక్కే పాముల్లాంటి మనుషుల పట్ల కఠినంగా వుండటానికి తప్ప కుండా సాధనచేసి తీరాలి.

ఇలాగే ప్రయత్నిస్తాను మాధవ్!

రవళీ! ఆనాడు మన భారత దేశప్రజలందరూ ఏకమై పరదేశీయుల్ని తరిమివేయడానికి ఎంత పోరాటం చేశారో. అలాగే నువ్వుకూడా నీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం,కర్తవ్యపాలన కోసం ఒంటరి పోరాటం చేసి ఆదుష్టుణ్ణి చట్టరీత్యా వదిలించుకొని నిలబడ్డ ధీరురాలివి. ఇదంతా బయటి వాళ్ళకేమి తెలుస్తుంది! నువ్వేగుర్తుపెట్టుకొని గట్టిగా జాగ్రత్త వహించాలి. ఇక ఏవ్యక్తి వచ్చినా అంతే కీడెంచి మేలెంచమంటారు కదా పెద్దలు నేను పురుషుణ్ణి అయివుండికూడా పురుష బుద్దిని గూర్చి నిజం చెబుతున్నాను కేవలం నీ రూపాన్ని చూసి, నీ ఉద్యోగం, సంపాదనను చూసేవస్తారుకాని, నిన్ను ఉద్ధరించాలని కానీ, నిన్ను లాలించి, ఊరడించాలని కానీ, నీలోని శక్తి సామర్థ్యాల్ని వెలికి తీసి నీవేమిటో లోకానికి నిరూపించాలని కానీరారు, ఇంకా మీ కుటుంబంలో స్పర్ధలు రగిలించి, ఐక్యతను చెడగొట్టి నాశనం చేయడానికే వస్తారు కాలం కూడా చాలామారిపోయింది రవళీ. ఎంతసేపూ

డబ్బు, రకరకాల స్వార్థసుఖాలు, దురహంకారం ఇవే చూసుకుంటున్నారు చాలామంది మగవాళ్లు.

ఎవరో వస్తారని, ఏదో చేస్తారని నేనెప్పుడూ ఎదురుచూడలేదు మాధవ్ కానీ నేను ఆశావాదిని. ఈదేశం, ఈ భూవలయం పుణ్య పురుషులకు గొడ్డు పోయిందా అని తర్కించుకుంటాను ఎవరైనా వచ్చి ఆత్మీయంగా మాట్లాడితే ఇతను మంచివాడై వుండవచ్చు కదా అని మాత్రం అనుకుంటాను. పైగా ఎన్నో పనులు ఎంతో మందితో ముడిపడివుంటాయికదా. అందువల్ల కట్టెకొట్టె తెచ్చె అన్నట్లు బండగా వ్యవహరించలేను. స్వచ్ఛంద స్నేహ భావంతో, మానవతా దృక్పథంతోనే మాట్లాడుతాను అంతే. ఇంక ఏ విధ మైన మలిన కాంక్షలు నాలో ప్రవేశించవు

ఆ విషయం నాకు బాగా తెలుసు రవళీ అయితే నేనడిగిన ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పు! నీకు పనులు ముఖ్యమా? నీ వ్యక్తిత్వం, నీ సిద్ధాంతాల ఆచరణ ముఖ్యమా?

నాకు వ్యక్తిత్వ సంరక్షణే ముఖ్యం మాధవ్! అమ్మా నాన్నలు, మా తాత చిన్నప్పుడే దీని విలువ ఏమిటో బాగా తెలియజెప్పారు. వారు దాతృత్వంలోను, వ్యక్తిత్వంలోను ఎంతో గొప్పపేరు గడించారు. ఎందరో మహానుభావుల జీవిత చరిత్రలు కూడా వ్యక్తిత్వమే ముఖ్యమని ప్రబోధించాయి. ఆ ప్రాతిపదిక మీదనే నేనూ నిలబడి జీవిస్తున్నాను. ఈ నా చదువులు ఇంటిపెద్దల ప్రోత్సాహంతో. స్వయం కృషితో సాధించుకున్నవే. ఈ నా ఉద్యోగం నా ప్రతిభా విశేషాల్ని గుర్తించి ఇచ్చిందే. స్త్రీ శరీరాన్ని ప్రతిఫలంగా కోరే దుర్మార్గులు అని తెలిస్తే వాళ్ళవల్ల జరిగే పనుల్ని కూడా వదులుకుంటాను. గతంలో ఎన్నో పనుల్ని, పదవుల్ని కూడా వదులుకున్నాను. ఎన్ని కష్టాలనైనా, ఎన్ని నష్టాలనైనా భరిస్తాను కానీ రోషాభిమానాల్ని వదులుకోను మాధవ్. అవేకదా స్త్రీకైనా పురుషుడికైనా అమూల్యాభరణాలు!

నీ దృఢత్వానికి, నీ చిత్తశుద్ధికి నా జోహర్లు రవళీ. నీ ఆత్మవిశ్వాసం, నీధైర్యం నీకెప్పుడూ వజ్రాయుధాలై తోడు నీడగా వుంటాయి. గురువులు

పెట్టే చదువుల పరీక్షల్లో నెగ్గితేనే విద్యార్థులకు పట్టాలు వస్తాయి. నువ్వూ అంతే లోకులు పెట్టే ఈ వ్యక్తిత్వ పరీక్షల్లో చివరిదాకా గట్టిగా నిలబడి విజయం సాధించాలి. అప్పుడు వాళ్ళకు వాళ్లే చెంపలు వేసుకుంటారు. క్షమార్పణలు వేడుకుంటారు. కాయలున్న చెట్టుకే రాళ్ళ దెబ్బలన్నట్లు అన్ని విధాలా ప్రయోజకురాలి వైన నీకే అడుగడుగునా అసూయాపరుల, స్వార్థపరుల వేధింపులు ఎదురవుతుంటాయి అన్నిటినీ ఎదుర్కొని ప్రవాహానికి ఎదురీది నిలిచినప్పుడే కదా నీవేమిటో నిగ్గుతేలేది! అని రవళికి కొండంత ధైర్యాన్ని నూరిపోశాడు మాధవ్.

మాధవ్ తన నిర్ణయాలను బలపరచి ప్రోత్సహిస్తుంటే రవళి సంబర పడిపోయింది. ఆమెకళ్ళల్లో ఆనందాశ్రువులు సన్నజాజుల్లా జలజలరాలాయి. గుండెకుంపటిలో రగిలే చింతల నిప్పు రవ్వలు చల్లారి పోయాయి. నిజమైన శ్రేయోభిలాషి, ఆత్మీయ మిత్రుడు సౌజన్య హృదయుడు అంటే నీలాగా వుండాలి మాధవ్. నువ్వునా భాగ్యానివి అంటూ ఏదైనా పాటపాడు మాధవ్ అన్నది రవళి. కావిరంగులు వెదజల్లే అసంధ్యా సమయంలో పచ్చని చెట్లమీదుగా మంద మారుతం వీస్తుంటే మైమరపుతో మధ్యమావతి రాగం ఆలపించాడు మాధవ్. రవళి మానసమరాళం ఆనంద సరసిలో హాయిగా ఓలలాడింది.



శుభం (మాసపత్రిక)
మార్చి, 1998

# స్ఫటికం



ఏ పుట్టలో ఏ పాముందో, ఏ మనిషిలో ఏమోసముందో యోగికైనా తెలియాలి. బ్రహ్మకైనా తెలియాలి. సామాన్య మనుషులు ఎలా పసిగట్ట గలరు? అనుభవం అయితే తప్ప! విమలా మనోహర్‌లు విశ్వవిద్యాలయంలో ఒకరికొకరు పరిచితులు. విమలకు ఉద్యోగం వచ్చాక ఆ పరిచయం స్నేహంగా మారి, ప్రేమగా పరిణమించి వివాహంగా రూపుదాల్చింది. అయితే మనోహర్ తన ధూర్తగుణాన్ని పైకి పొక్కనివ్వకుండా అద్భుతంగా ప్రేమ నాటకం ఆడి విమల మనసును దోచుకున్నాడు. సంవత్సరం అయ్యాక తన ఇంటికి తీసుకెళ్ళాడు.

అమ్మా! "అన్నావదినావాళ్లు వచ్చారే" అని సంబరంతో పరుగెత్తి వచ్చి చెప్పింది మనోహర్ చెల్లి వాణి

ఔనా! అంటూ ఇంట్లోపలినుంచి హడావుడిగా మనోహర్ తల్లి సుజత వాకిట్లోకి వచ్చి, కొడుకు కోడల్ని చూసింది.

ఏన్నాయనా బాగున్నారా! అంటూ ఇద్దర్నీ లోపలికి పిలుచుకెళ్లింది. ఏరా బాగున్నారా! అని మళ్లీ అడిగింది.

బాగున్నామమ్మా. ఇదగో చూడు మీ వరాల కోడల్ని ఎలావుంది?

బంగారు బొమ్మలా వుందిరా నా కోడలు. నువ్వు అదృష్టవంతుడివి. మేమూ అదృష్టవంతులం. చక్కటి అమ్మాయిని, అందులో మన కులం లోనే తెలివిగా ఏరికోరి పట్టుకున్నావ్.

ఔనమ్మా! చదువుకోసం వెళ్లి చదువుతోపాటు ఈ సుందరాంగిని కూడా చేజిక్కించుకొని వచ్చాడు నీకొడుకు. నీలాగే మా స్నేహితులు, మా మాస్టార్లు అందరూ కూడా నేను అదృష్టవంతుణ్ణి అని ఒకే పొగిడేస్తున్నారు. లేకుంటే నాలాంటి మామూలు మనిషికి ఇంత అందాల రాశి దొరకడం ఏంటి? ఇక ఈమె ఏ కులమైనా ఇష్టమే కానీ ఒకే కులం అయింది అంతే.

అదీ మంచిదే. ఈ అమ్మాయిలో అందమొక్కటేనా! చాలామంచి అమ్మాయని. ఆప్యాయంగా చూసుకుంటుందని కూడా ఉత్తరాల్లో రాసే వాడివి కదా నువ్వు.

మీ కోడలికి. సకలసద్గుణాలూ ఉన్నాయమ్మా. మంచి గాయని కూడా పాటల పోటీల్లో బహుమతులన్నీ తనకే.

ఏదమ్మా, ఒక పాటపాడు అంది సుజాత.

అమ్మా! ముందు వదినా వాళ్లను స్నానం చేసి భోజనం చెయ్యనీవె. మళ్లీ పాటలు పాడుకోవచ్చు, కబుర్లాడు కోవచ్చుకాని. రావదినా అంటూ వాణి విమలా చెయ్యిపట్టుకొని పిలుచుకెళ్లింది.

"ఓరేమనూ! చికెన్ చెయ్యమంటావా" అని అడిగింది సుజాత వద్ద మ్మా మీ కోడలు చికెన్ కాదుకదా, కోడిగుడ్డుకూడా తినదు. నన్నూ తిన నివ్వదు.

అదేంటమ్మా ఎందుకు తినవు? అడిగింది సుజాత

ఎందుకో అత్తయ్యా అమూగ జీవాలపై ఒకవైపు జాలి, మరోవైపు మాంసాహారంపై రోత కలిగి ఐదేండ్ల క్రితమే మానేశాను. అతన్ని మానేయ మని చెప్పాను.

సరేనమ్మా, మీకు కాయలకూరే చేస్తాను నువ్వెళ్లి స్నానంచేసిరా.

అలాగే అత్తయ్యా అంటూ విమల వెళ్లి స్నానం చేసి తనకు బాగా నచ్చిన ఆరంజ్ కలర్ చీర కట్టుకొని వచ్చింది. విమలా! ఈ చెంగావి చీరలో నువ్వు అప్సరసలా ఉన్నావోయ్ అమ్మ భోజనం వడ్డించింది పద వెళ్దాం.

ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు.

ఏదో తోచినట్లు చేశానమ్మా. ఈ పల్లెటూరి వంటలు నీకునచ్చుతాయో లేదో.

అలాంటిదేమీ లేదత్తయ్యా! నేను ఎలావున్నా సర్దుకుంటాను. అయినా ఈ వంటకాలన్నీ చాలా బాగున్నాయ్. ఈ దొండకాయ వేపుడు, బీరకాయ

పచ్చడి బాగా రుచిగా వున్నాయ్ అత్తయ్యా. చాలాబాగా చేశారు.

ఏమోనమ్మా, మీరు చదువుకున్నోళ్లు. నేను పెద్దగా చదువుకోలేదు.

చదువుకున్న మాలాంటి వాళ్ళం' మీలాంటి వాళ్లు చేసి పెట్టితే తిని వాళ్ళమే కానీ మీ అంత బాగా చెయ్యలేం అత్తయ్యా. మీ అనుభవం ముందుమేమెంత చెప్పండీ ఇంకా నాకు వంట చేయడం సరిగ్గారాదు. చిన్న ప్పటినుంచీ మాఅమ్మ నన్ను చదువుకోమని చెప్పడం తప్ప వంట దగ్గరికి ఎప్పుడూ రానివ్వలేదు.

తనకేమ్మా! వంట వచ్చిన వాణ్ణి నేనున్నాననే ధైర్యం. ఈ మధ్య గారెలు చేస్తున్నప్పుడు నూనెబొట్లు చేతిమీద పడి బొబ్బలు కూడా లేచాయి తనకు. అప్పటినుంచీ ఎందుకొచ్చిన బాధ అనుకొని నేనె చేసేస్తున్నా వంటా వార్పూ.

పోనీలేరా. చేస్తే తప్పేముందిగాని. ఈ రోజుల్లో ఆడపనీ, మగపనీ అనే తేడాలు పెట్టుకుంటే ఎలా జరుగుతుంది? మీరిద్దరూ పెద్దచదువులు చదువుకున్నారు అమ్మాయి వుద్యోగం చేస్తూంది నీకు రేపో మాపో వుద్యోగం రాకపోదు. ఒకరికొకరు సహాయం చేసుకోవాలి కదా.

సరేలేమ్మా! మీ అత్తాకోడళ్ళు కలసిపోయి నన్ను ఆడించేటట్టున్నారు.

ఇలా తల్లీ కొడుకులు ముచ్చటించుకొంటూ వుంటే మనోహర్ తండ్రి రఘురాం పొలం పనులు చూసుకొని ఇంటికొచ్చాడు.

అరే' ఎప్పుడొచ్చారు మీరు.

ఇంతకుముందే నాన్నా, ఎక్కడినుంచి వస్తున్నారు?

పొలాల దగ్గర్నుంచి బాబూ. ఏమ్మాబాగున్నావా?

బాగున్నాను మామయ్యా! వెళ్లి కాళ్లూ చేతులు కడుక్కొని రండి. మీరు భోజనం చేద్దురు.

ఏరామనూ! మీ వివాహం బాగా జరిగిందా. ఏంటో మా పరిస్థితులు

సరిగ్గా లేకపోయాయి. మా కళ్ళతో మీ పెళ్ళిచూసే భాగ్యం మాకు లేక పోయింది. ఏమైనా మీరిద్దరూ అన్యోన్యంగా సుఖంగా వుంటే చాలని ఆ దేవుణ్ణి వేడుకున్నాంబాబూ.

మీ కొడుకు, కోడలు వచ్చారా వదినా' కొత్తకోడలు ఎలా వుందేటి? అడిగింది పక్కింటి సుబ్బలక్ష్మి.

ఉదయాన్నే వచ్చారు లక్ష్మి! రా, చూద్దువుగాని, తినబోతూ రుచు లెందుకు?

వస్తున్నా నొదినా అంటూ సుబ్బలక్ష్మి వచ్చి పెద్దకళ్ళు చేసుకొని వింతగా చూసింది కోడల్ని.

అచ్చం దొర బిడ్డలా సుందరంగా వుంది వదినా మీ కోడలు కట్నం ఎంతిచ్చారేంటి?

ఇక ప్రత్యేకమైన కట్నం ఏంటమ్మా! ఆమె నా కట్నం. ఇదిగో ఈ పెద్ద కలర్‌ఫోటో చూడు ఇదే ఆమె నాకిచ్చిన ప్రేమకట్నం. అదే పెళ్ళి కట్నంకూడా అన్నాడు మనోహర్. ఎంతబాగుందిబాబూ ఈ బొమ్మ! చంద మామదిగొచ్చినట్లు, తామరపువ్వు విరబూసినిట్టు వుంది. ఎన్ని లక్షలైనా దీని ముందు దిగదుడుపే. నువ్వుఎంత అదృష్టవంతుడివి. పువ్వులాంటి ఈ అమ్మాయిని మాత్రం పువ్వుల్లో పెట్టుకొని జాగర్తగా బాగా చూసుకో నాయనా. ఇంక కట్నం, గిట్నం అనే మాటలెందుకులే.

మావాడికి ఇంకెక్కడైనా అయ్యుంటే కనీసం రెండు లక్షల రూపా యలైనా కట్నం ఇచ్చుండేవాళ్లు. వాడేమొ ఈ అమ్మాయిని మెచ్చి పెళ్లి చేసుకున్నాడు అని కొంచెం నిష్ఠూరంగా అన్నాడు రఘురాం.

కట్నంగా ఏమీ ఇవ్వలేకపోయినా, అమ్మాయి సంపాదించే జీతమే మనకట్నం అంటూ మెల్లగా జీతానికి ముడిపెట్టింది సుజాత.

అవన్నీ ఇప్పుడెందుకులే. వెళ్లి మంచం వేసేయమ్మా! పడుకోవాలి అలసటగావుంది అన్నాడు మనోహర్.

వెళ్లిపడుకోండి నాయనా మంచం వేశాను.

కమాన్ డార్లింగ్

నువ్వెళ్లిపడుకో. నేను వాణీతో ముచ్చట్లాడి తర్వాతవస్తాను

వాణీతో ముచ్చట్లాడాల్సింది ఇప్పుడుకాదు విమలా, రేపుతెల్లవారితో. ఇప్పుడు మాత్రం ఈటైంనాది. ప్లీజ్ రావోయ్.

అబ్బ, చెబితే వినవుకదా! పదస్వామీ.

హమ్మయ్య. దేవిగారు కరుణించారు. "చేతికిచిక్కావే పిట్టా—నిన్ను చచ్చినా నేనొదిలిపెట్టా" అనేపాట పాడుతూ మనోహర్ విమలా నడుంపై చెయ్యివేశాడు.

పిట్టాలేదు, పెట్టాలేదు బుద్ధిగా పడుకోమనూ

నాకు మనసేం బాగాలేదు

ఇంతలోగా మనసుకేమయింది డియర్?

మనసుకేమైనా కావడానికి ఎంతసేపు పట్టుతుందిలే ఏంటో నాకేదో దిగులుగావుంది.

సరే, మనసుకథ రేపువుదయం చూద్దాంగానీ ఇప్పుడు మాత్రం నన్ను కరుణించుదేవీ!

మనసులో బాధ పెట్టుకొని నేనేపనీ చెయ్యలేను. ఇప్పుడు నన్ను కదిలించకు మనూ. మనం భోజనం చేసేటప్పుడు మీ నాన్నగారు ఏమన్నారో గుర్తుందికదా

ఏమన్నారేంటి?

మీవాళ్ళు ఎలాంటి మాటలన్నా నీ చెవికి సోకవులే. నీకు ఇంకెక్కడైనా సంబంధం చూసుంటే కనీసం రెండు లక్షలరూపాయలైనా కట్నం వచ్చేదని పక్కింటి సుబ్బలక్ష్మిగారితో అన్నారు మీనాన్నగారు. అప్పుడు మీ అమ్మగారు కూడా ఏమన్నారోతెలుసా! ఇప్పుడు మాత్రం ఏమయిందండీ, మన కోడలి నెలనెలా జీతాలు లక్షలకట్నం లెక్కేకదా అన్నారు మీఅమ్మ

నాన్నలు. అలా మాట్లాడినప్పటినుంచీ నాతలచుట్టూ సూదులు గుచ్చేసినంత బాధగావుంది వాళ్ళమాటలు తలచుకుంటే నా భవిష్యత్తుఎలా వుంటుందో నన్న ఆందోళనగా వుంది.

వాళ్లు పెద్దవాళ్లుకదా. పైగా ఈ పల్లెటూళ్లో వాళ్ళూ, వీళ్ళూ అడుగుతుంటే అలా ఏదో అనుకుంటారులే. ఆ మాటల్ని నువ్వు పట్టించుకోకు.

ఏంటోమనూ! ఈ క్షణానికైతే ఇలా ఓదార్చుతున్నావు కానీ నువ్వు కూడా మున్ముందు మీ అమ్మా నాన్నలతో ఏకమైపోయి నన్ను ఏంచేస్తావో ఒకవేళ అలా జరిగితే మాత్రం నేను కన్న బంగారు కలలన్నీ నీటి బుడగల్లా పగిలిపోయినట్లే. నా జీవితాశయం చాలావరకు దెబ్బతింటుంది. నీ మాటపై, మీపెద్దల మాటలపై ఎంతో నమ్మకం పెట్టుకొని, మాపెద్దలు నిరాకరించినా సాహసించి నిన్ను పెళ్లిచేసుకున్నాను. నన్నుమాత్రం మీరు డబ్బు దురాశతో అన్యాయం చెయ్యకండి బాబూ.

అలా ఏం జరగదులే విమలా! నిన్నువదలి ఒక్కక్షణమైనా బ్రతకలేనని నీకు తెలుసుకదా నువ్వు మరీ దీర్ఘదర్శివి. ఇంక ఈ ఆలోచనలు వదిలేయ్ ఏదీనీకు ఇష్టమైన "మధురాతి మధురం— మనప్రేమ మధువు" అనే పాట పాడవూ.

ఊహుఁ

అమ్మాయిగారిని అడుక్కుంటేగాని పాడరు ఏం చెయాలో చెపుమా!

ఏం చెయ్యమన్నా చేస్తావా! అయితే "నను భవదీయదాసుని మననంబున" అంటూ శ్రీకృష్ణుడు సత్యభామను ప్రాధేయపడుతూ చెప్పిన పద్యం చెప్పు చూద్దాం.

బాబోయ్! నీలాగా నాకు పద్యాలు, శ్లోకాలు రావు డియర్. నేను సైన్సువాణ్ణి కదా ఏగెలీలియోనుగూర్చో. ఏమేడం క్యూరీని గూర్చో చెప్పమంటే చెబుతాను.

అమ్మోయ్! మీసైన్సు నాకొద్దు. అందులో విజ్ఞానం తప్ప రసానందమే వుండదు.

అది మనలో వుంది

ఏయ్ మనూ! ఆగు

ఇప్పటికే టైం పన్నెండు గంటలయింది ప్రియా! ప్లీజ్ అని ప్రాధేయ పడ్డాడు మనోహర్. పెద్దల మాటలకు గాయపడినా మనసును బలవంతంగా ఒప్పించక తప్పలేదు విమలకు, ఇద్దరూ తర్వాత హాయిగా నిద్రపోయారు. తెల్లవారగానే వాణి తలుపుతట్టింది. విమల లేవబోయింది.

ఏయ్ విమలా! ఒళ్ళంతా నొప్పులుగా వుంది. కాసేపు పడుకుందాం రావోయ్.

మీకెందుకుసార్ ఒళ్ళునొప్పులు? నాకే ఒళ్ళంతా పూనమైపోయింది.

పరవాలేదులేమేడం. మళ్ళీ సెట్ రైట్ అవుతుందిగాని అన్నాడు మనోహర్. అంతలో వాళ్ళఅమ్మ సుజాతవచ్చి తలుపుతట్టింది విమలా! లెండమ్మా పొద్దెక్కింది.

ఆఁ లేస్తున్నా మత్తయ్యా

స్నానం చేసి రండమ్మా టిఫిన్ చేద్దురుగాని. వాణీ - అన్నావాళ్ళకు టిఫిన్ పెట్టు.

వదినా! రండి టిఫిన్ రెడీ.

మనూ! మీ అమ్మగారు పెసరట్టు చాలాబాగా చేశారు కదూ.

ఉఁ, నువ్వు చెయ్యలేకపోయినా చేసిన వాళ్ళను బాగా మెచ్చుకుంటావ్ విమలా నీలోని గొప్పగుణాల్లో ఇదొకటి.

పెసరట్టు అమ్మ చెయ్యలేదు వదినా, నేనేచేశాను. నన్ను పొగడవూ అని బుంగమూతిపెట్టి అడిగింది వాణి.

అమ్మదొంగా! నువ్వుచేశావా. చదివేది పదో తరగతి అయినా ఎంత బాగా చేశావే పెసరట్టు అంటూ విమల వాణి నుదుటిపై ముద్దుపెట్టింది.

థాంక్స్ వదినా పెసరట్టు చేయడం అమ్మ నేర్పించింది.

విమలా! త్వరగా రెడీ అవ్వు— అలా— పచ్చటి పొలాల గట్లపై లీలగా—హేలగా విహంగాల్లా విహరించి, ప్రేమ వాహినిలో ఓలలాడి వద్దాం అన్నాడు మనోహర్ కవితాత్మకంగా.

అబ్బో సైన్సు అయ్యగారికి కవిత్వం పొంగి పొరలుతుందే! అంటూ పరిహాస ప్రశంస చేసింది విమల.

నిన్ను చూస్తూంటే కవిత్వమేకాదు విమలా! కావ్యాలే రసగంగలా ఉప్పొంగి పరవళ్ళు తొక్కుతాయి.

అహాఁ! తమరు రసాయన శాస్త్రంలో డాక్టరేట్ కదా. అందుకేనేమో ఆ సంబంధంగా నీ హృదయ కూపంలో రసభావాలు పూరి పైకుబుకు తున్నాయి

ఇలా ఇద్దరూ సరససల్లాపాలు చేసుకుంటూ వెళ్ళి సముద్రతీరంలో ఇసుక దిబ్బపై కూర్చున్నారు. మనోహర్ మనసు ఒక్కసారిగా ఎందుకో విమల జీతంవైపు గడియారం పెద్దముల్లులా తిరిగింది విమలా! ప్రతినెలా వచ్చే నీ జీతం డబ్బుల్లో కొంత సేవ్ చేసిపెట్టి ఫ్లాట్ కొందాం సరేనా!

నీ ఐడియా బాగానేవుంది. అదేదో తమరికి వుద్యోగం వచ్చాక ఆ పని చేద్దాం. కానీ మనం మనవరకే ఆలోచించుకొని జాగ్రత్తపడితే నా తర్వాతి చిన్నవాళ్ళు ఎలాపైకొస్తారు? వాళ్ళను చదివించాలి. మా అమ్మనాన్నల కష్టార్జితం ఆ పొలంలో పండేవి కనీస అవసరాలకేచాలదు. పిల్లలు బాగా చదువుకొని తమ స్వశక్తిమీద నిలబడేలా మనం చేయూతనివ్వక తప్పదుమనూ.

వాళ్ళకర్మకొద్దీ వాళ్లు బ్రతకుతారులే. ముందు మన బ్రతుకుల్ని గూర్చి, మనకు పుట్టబోయే పిల్లల్ని గూర్చి ఆలోచించు.

అదేంటి మనూ! నువ్వుచాలా విచిత్రంగా మాట్లాడుతున్నావ్? నీ మాటల్లో కరుకుదనం తొంగి చూస్తోంది. నువ్వేమన్నావ్ పెళ్ళిముందు? "మనకు పిల్లలుకూడా అక్కరలేదు. నీఇష్టమే నాఇష్టం ఉన్నవాళ్ళను

ఉద్ధరించుకుంటేచాలు. మనం ఒకరికొకరు సహకరించుకుంటూ జీవితంలో ఏదైనా గొప్ప ఘనకార్యాల్ని చేయాలి అని నాఆశయాన్ని బలపరచావుకదా. రామాలయానికి పిలుచుకొనిపోయి మరీ ప్రమాణం చేసి చెప్పావు. మరచి పోయావా? ఆ మాటలన్నీ ఒక్కసారి గుర్తుతెచ్చుకో. నువ్వేనా ఇలా అంటున్నావ్ సరేలేవోయ్. అవి అప్పటి మాటలు. ఇవి ఇప్పటి మాటలు. ఎప్పటికప్పుడు మారాలికదా అని విమలా సున్నిత మనస్సును నొప్పించాడు మనోహర్.

ఇదా నీ లైఫ్‌పాలసీ?

ఊఁ ముమ్మాటికీ అంతే

సరదాగా మాట్లాడుకొంటూ విహారానికెళ్లిన ఈ జంటలో భేదాభిప్రాయాలువచ్చాయి. విమల అక్కడినుంచి లేచి ఇంటివైపు నడవసాగింది. మనోహర్ కూడా వెంటవచ్చాడు.

ఇంతధైర్యంగా, ఇంత కఠినంగా ఎలా అనగల్గుతున్నావ్ మనూ. నువ్వు బ్రతక నేర్చిన వాడివి. ఎంతైనా మగవాడివి. అందులోను తాళికట్టిన మగ వాడివికదా. భరించేదేమీ లేకపోయినా భర్త పదవి పొందిన వాడివి.

ఔను, నేను నీభర్తని.

అంతేధీమాతో హక్కుతోపాటు బాధ్యతలు కూడా భరిస్తే సంతోషిస్తాను. భరించలేకపోయినా అడ్డుపడకుండావుంటే అంతేచాలు అందివిమల. తనకునచ్చని విధంగా మాట్లాడుతున్న మనోహర్‌పై కొంచెం కోపంతో విమల అంతకన్నా ముందుగా త్వరత్వరగా నడవసాగింది.

ఆగు విమలా! నేనూ వస్తున్నాగా ఇంటికి. అంతకోపంగా వెళ్ళిపోతే ఎలా? "నీముక్కుమీద కోపం నీ ముఖానికే అందం, నీ బుంగమూతికందం నాముందరి కాళ్ల బంధం" ఎలావుంది విమలా నాపాట అన్నాడు మనోహర్.

ఏడ్చినట్లుంది. ఈ తాత్కాలికపు కవ్వింపులకేమి తక్కువలేదులే ఈమగవాళ్లకు.

ఇంకేమి తక్కువయిందోయ్ నాకు?

బుద్ధి.

నేను డాక్టరేట్ నోయ్!

నేనూ డాక్టరేట్ నే. బుద్ధి అంటే అర్థం నీకంతవరకే తెలుసులాగుంది. మనసు, సంస్కారం, వివేచన కూడా వుండాలి. మనం ఇంటికెళ్ళగానే మా చెల్లాయికి వెయ్యిరూపాయలు ఎం. ఒ. చెయ్యాలి. హాస్టల్‌లో ఫీజుకు, ఇతర ఖర్చులకు కావాలని నిన్న లెటర్ రాసింది.

ఈసారికి వాళ్లు ఎలాగో సర్దుకుంటారులే. తర్వాత పంపచ్చు.

ఇంకెవరైనా వున్నారేంటి? పంపేవాళ్ళు. మా పెద్దలు పరుల బాధ్యతలు నెత్తినేసుకొని కార్యాలు చేశారు. వాళ్ళంతా స్వార్థపరులు. ఇతరుల నుంచి లాక్కోవడం తప్ప పెట్టడం తెలియదు. ఇలాంటి వాళ్ళు మాకుం డేది. ఎలా సర్దుకుంటుంది? ఏంటి అలా ఉగ్రంగా చూస్తున్నావ్ మనూ. ఎం. ఒ. మాత్రం చెయ్యక తప్పదు. సంపాదించి నిన్నుకూడా పోషిస్తున్నాను కదా. నా జీతం డబ్బులు పంపడానికి నీకభ్యంతరం ఏంటో నాకర్థం కావడం లేదు.

నీది, నాది ! ఏంటి? నువ్వేన్నా దానివి అయినప్పుడు నీడబ్బూనాదే అని గట్టిగా అరవసాగాడు మనోహర్.

నువ్వెంత అరచిమాట్లాడినా నాకేంభయం లేదు. మా చెల్లాయికి డబ్బులు పంపించి తీరాల్సిందే. నువ్వు పంపక పోయినా నేనే వెళ్లి ఎం ఒ. చేసి వస్తాను.

డబ్బులుండేది నాదగ్గర. నే నివ్వకుంటే ఎలా పంపిస్తావ్?

అవి నాడబ్బులు. ఎలా తీసుకోవాలో నాకు బాగాతెలుసు. అవసరంగా కయ్యానికి కాలుదువ్వకు. చూసే వాళ్ళకు చాలా హీనంగా వుంటుంది. కొంత మానవత్వం కలిగి మసలుకుంటే మంచిది.

విమలా మనోహర్‌లు ఇలా గట్టిగా వాదోపవాదాలు చేసుకుంటూవుంటే సుజాతకు వినిబడి ఆమె వేగంగా వచ్చింది.

ఏంట్రా! రచ్చలాడు కుంటున్నారు?

ఏమీలేదులేమ్మా. నువ్వెళ్ళు అంటూ మనోహర్ విమల తన చొక్కా లోంచి డబ్బులు తీసుకుంటూ వుంటే లాక్కోబోయాడు

ఊఁహుఁ నేనివ్వను. అమ్మాయికి ఫీజుకట్టకుంటే పేరు తీసేస్తారు. చదువుకు భంగం కల్గించడం చదువుకున్న వాళ్ళకు తగనిపని అని విమల డబ్బులాక్కుంటుంటే మనోహర్ విమల చెంపపై ఈడ్చి ఒక దెబ్బకొట్టేసి మరో దెబ్బ కొట్టడానికి చెయ్యి ఎత్తుతుంటే ఆగు ఎంత దౌర్జన్యం? నేను కూడా నీలాగా ఈడ్చి అంతకు రెట్టింపుగా కొట్టగలను. కాని కొట్టితే నా ప్రత్యేకత ఏముంది? నిన్ను మంచి మనిషి అని నమ్మి ఎంతో పోరాటం చేసి పెళ్లి చేసుకున్నందుకు ఈ దెబ్బ పడాల్సిందే. సంవత్సరమైనా కాలేదు అప్పుడే అంతదాకా వచ్చావా. ఇలాగైతే సాగినట్టే ఈ సంసారం.

సాగకుంటే ఏమవుతుందే? నేను తాళి కట్టిన మగవాణ్ణి నువ్వు నా పెళ్ళానివి. చెప్పినట్లు చెయ్యి చచ్చినట్లు పడివుండు లేకుంటే రచ్చకెక్కి ఊరంతా చాటింపు వేస్తాను. నువ్వు వుద్యోగం చేసేచోట కూడా నిన్నుగూర్చి చెడ్డప్రచారాలు చేసి నిన్ను రకరకాలుగా హింసించి అవమానించి, అవమానింపచేస్తాను.

"చెడపకురా చెడెదవు" అనే ఏతివాక్కు కూడా నీ మొకానికి తెలిసినట్టులేదు "నీరు పల్లమెరుగు నిజము దేవుడెరుగు" అంటారు పెద్దలు. ఆ భగవంతుడికి తెలుసునేనేంటో. నాలో ఏ తప్పు లేనప్పుడు ఊరంతా ఏం చెయ్యగలరు? ఉద్యోగం చేసేచోట అంటావా. వాళ్ళకూ బాగా తెలుసు నేనేంటో, నా పరిధి నేనుదాటనని, ఎవ్వరినీ పల్లెత్తి ఒక్కమాటైనా అనననీ, సంస్కారంగా ప్రవర్తిస్తానని. లేదంటే పై అధికార్లకు చెప్పి ఇబ్బందులు కలిగించి వేధిస్తావు తాత్కాలికంగా. ఒకప్పటికి నువ్వెంత దుర్మార్గుడివో వాళ్ళకే తెలిసివస్తుంది. ఎందుకింత నీచానికి ఒడిగట్టుతావ్?

అప౧ నోరుముయ్యవే.

మీ అమ్మా, అమ్మమ్మలు; మా అమ్మా, అమ్మమ్మలు అందరూ నోరుమూసుకునే పడి బ్రతుకుతున్నారు. ఎందుకో తెలుసా? వాళ్ళభర్తలు అంతతిండీ, బట్టా ఇచ్చి పోషిస్తూ రక్షించుకుంటున్నారు కనుక. కానీ నేను అలాపడి వుండటానికి కుదరదు. నేను చదువుకున్న ఆధునిక స్త్రీని. ఉద్యోగ బాద్యతలు, కుటుంబ బాధ్యతలు, బంధాలు. ఇంకా సామాజిక బాధ్యతలు అన్నీ నా చుట్టూ పెన వేసుకునివున్నాయి. డాక్టరేట్ డిగ్రీ పొందిన నీకు కనీస మానవధర్మాల్ని గూర్చి లెక్చర్ ఇవాల్సి వచ్చినందుకు నాకే సిగ్గుగావుంది.

చాలుచాలు. అపవే నీ ఉపన్యాసం. నీకు చదువు, ఉద్యోగం ఎన్ని వున్నా నువ్వు ఆడదానివి ఇది పురుషాధిక్య సమాజం. నా తర్వాతనె నీకు ఎవరైనా, నామాట ప్రకారమే నడుచుకోవాలి నువ్వు.

నడుచుకోకుంటే ఏం చేస్తావ్? అని విమల గర్జించింది.

ఏం చేస్తానా? నా చేతిలో చావు దెబ్బలు తింటావ్ అంటూ మనోహర్ విమల చంపపై మరో దెబ్బలాగి కొట్టాడు

విమల చెంప దెబ్బబాధకు తట్టుకోలేకపోయింది కోపోద్రేకంతో—. ఒరేయ్! నువ్వు మనిషివా? క్రూరమృగానివా? నువ్వుమనిషివని, మనీషిగా మారుతావని వూహించుకున్నాను. కానీ నీలో రాక్షసుడు దాగి వున్నడని మాత్రం కలలో కూడా ఊహించలేదు. కొట్టడానికి అలవాటుపడ్డ నీ దుష్ట హస్తం ఇంకే పనికైనా వెనకాడదు. ఇకచాలు నీకూనాకు తీరిపోయింది. నీ అసలు రంగు ఇప్పటికైనా బయటపడి నందుకు సంతోషించాలి ఈ మాత్రానికి ఇలాంటి నీచుడితో ఎందుకు కలిపాడో ఆ భగవంతుడు. నీతో ప్రశాంతంగా బ్రతకడం జరగనిపని. ఇంక ఎవరికి వారేయమునా తీరే నీకూ నాకూ నింగీనేలకు వున్నంత అంతరమని ఈ నాటికి తెలుసుకున్నాను. నటనలో ఎ. ఎన్. ఆర్ జీవించినంత గొప్పగా జీవితంలో చాలా బాగా ప్రేమ నాటకం ఆడావు. వండర్ఫుల్ అంటూ మనోహర్ మోసాన్ని ఏ కరువు పెట్టింది విమల.

నీ జ్ఞానమంతా గుప్పించి నువ్వెన్ని నీతులు చెప్పినా నీ తెలుగు పాండిత్యంతో ఎంతగా ఘోషించినా, నీ మెడలో నేను కట్టిన తాళిబొట్టు వుండే. నువ్వెక్కడికెళ్ళినా నా పెళ్ళానివే. నన్ను వదలి నువ్వు ఎలా బ్రతుకుతావో, ఎలా తలెత్తుకొని తిరుగుతావో నేనూ చూస్తాను.

ఆహాఁ అదా నీధైర్యం. నువ్వు ఆనాడు కట్టిన పసుపుతాడు కాదు ప్రస్తుతం నామెడలో వుండేది నేను స్వయంగా సంపాదించి చేసుకున్న బంగారు గొలుసు ఇది. దీనిపై నీకు హక్కు లేదు. ఈ ఇంట్లో వుండే ప్రతి వస్తువూ నా స్వయార్జితమే నీది. ఒక్క వస్తువుకూడా లేదు. నేనే ఇనాళ్లు జాలితో నా ప్రగాఢప్రేమికుడవని భ్రమించి నిన్ను పోషించాను. నీ డాక్టరేట్ చదువును నేనే ప్రోత్సహించి సహకరించాను. నాకు బాగా గుణపాఠం చెప్పావు. భర్త అంటే తాళికట్టి అధికారపూర్వకంగా అనుభవించి పీడించడం కాదు. సుఖాలతోపాటు కష్టాలూ, బరువు బాధ్యతలూ అన్నీ పంచుకున్నప్పుడే, మాన ప్రాణరక్షణకు అండగా ఉన్నప్పుడే భర్త అవుతాడని, అతనే పతిదేవుడవుతాడని తెలుసుకో, నువ్వు నన్ను చూడటానికి కూడా అనర్హుడివి ఛీ— —

ఎంత పొగరేసికు! ఛీ కొడతావా నన్ను?

పొగరునాకు కాదు పెళ్ళొద్దనుకున్న నన్ను నయగారాలతో మోసం చేసి పెళ్ళి చేసుకొని వీధికెక్కి రచ్చకీడ్చి ఘోరంగా వంచించిన నీకే పొగరు. మానవత్వం, దయాదాక్షిణ్యాలు గుట్టుబెట్టులేని లోభిమనిషితో సాంగత్యం చెయ్యలేను. నా దృఢ వ్యక్తిత్వం, ఆత్మస్థైర్యం చూద్దువులే. నువ్వులేని. నేను ఎలా బ్రతుకుతానో. నేటినుంచి నేను మబ్బు విడిచిన వెన్నెలను. ఎవ్వరికీ తలవంచని మేరుగిరిశిఖరాన్ని అంటూ సూట్‌కేస్‌సర్దుకుంది విమల

ప్రేమపేరుతో, పెళ్ళిపేరుతో అమూల్యమైన సంవత్సరం కాలం వ్యర్థమైనందుకు, తెలియక దుష్టసంబంధం చేసినందుకు లోలోపల క్రుంగిపోయింది. చట్టపరంగా దుష్టసంబధాన్ని తెంపుకోవడానికే సిద్ధమయింది లోకంలో ఎందరో అనాథలు, ఆర్తులు కనీస అవసరాలు తీరక ఎంతో దీన స్థితిలో బ్రతుకుతున్నారు. అలాంటివాళ్ళకు, తనవాళ్ళకు తనొకతల్లిగా, కల్పవల్లిగా బ్రతకగల్గితే ఎంత బాగుంటుంది! ఇంతకన్నా ఈ జన్మకు సార్థ

కం ఏముంటుంది! అని ఆలోచించుకో సాగింది. ఇలాంటి త్యాగమయమైన సేవాజీవితాన్ని గడపడానికే గట్టిగా నిర్ణయించుకుంది విమల

తాను మరునాటి ఉదయాన్నే బయలుదేది వస్తూవుంటే ఆ ఇంట్లో ఒక్కరైనా ఉండమనలేదు. ఓదార్పునూ లేదు కనీసం బస్సుదాకా అయినారాలేదు. ఆ ఇంట్లో వున్న పెంపుడు కుక్కమాత్రం పెద్దమనసుతో జాలిగా చూస్తూ విమల వెంట కొంతదూరం వచ్చింది. మానవత్వం లేని ఈ డబ్బు మనుషులకన్నా దయకల్గిన జంతువులు నయం కదా అనుకుంది వెన్నెలలాంటి స్వచ్ఛమైన స్ఫటికంలాంటి హృదయం కల్గినవిమల.



శుభం మాసపత్రిక
మే, 1997

# హిరణ్య



తిరుపతి బస్‌స్టాండులో తన మేనమామ జానకిరామయ్య కనబడగానే పరుగుపరుగునా వెళ్ళారు హిరణ్య. హిరణ్య చెల్లెలు కమల ఎన్నో ఏండ్ల క్రితం చూసిందే మళ్లీఎన్నాళ్ళకు కలుసుకున్నాం మనం అని మేనమామ, మేనకోడళ్ళు సంబరపడ్డారు. ఒకరికొకరు కుశలప్రశ్నలు వేసుకున్నారు. ఒరే హిరణ్యా! రారా ఊరికి వెళ్ళదాం అన్నాడు జానికిరామయ్య లేదు మామా! నేనుకూడా ఊరికివచ్చి చాలాకాలం అయింది. ముందుగా ఇంటికి వెళ్లి అమ్మా వాళ్ళను పలకరించి ధైర్యం చెప్పి తర్వాత వస్తానన్నది హిరణ్య.

ఏరా! ఎంతదా నువ్వు ఎంతో దూరంలో పెద్ద ఉద్యోగం చేస్తున్నంత మాత్రాన మమ్మల్ని మరచిపోతే ఎలారా?

నేను ఎందుకు మరచిపోతాను మామా! మిమ్మల్ని. అసలు నేను పుట్టింది మీ ఊర్లోనేకదా, నాకు మూడేండ్లప్పుడు మీ అమ్మ అంటే మా అవ్వ చనిపోయారు. అప్పుడు నువ్వు, అమ్మ, పెద్దమ్మ ఎంతగా పొర్లిపొర్లి ఏడ్చారో నాకు ఇంకా రేఖామాత్రంగా గుర్తుంది.

ఒరే ఎంత బాగా గుర్తు పెట్టుకున్నావు. అందరూ ఎప్పటి విషయాలు అప్పటికే మరచిపోతూ ఉంటారు. నువ్వు చిన్నప్పటినుంచీ కూడా చాలా తెలివిగల్గిన దానివిరా. అదేకాదు మామానాకు గుర్తుండేది, నేను మూడవ తరగతి చదివేటప్పుడు ఎనిమిదేండ్ల వయసులో నేను మీ ఊరికివచ్చాను. అప్పుడు నిన్ను పనసపండు తెమ్మని భలే మారాముచేశాను, నీకు గుర్తుందామామా! ఔనేరా నాకు కొంచెం కొంచెంగా గుర్తుకొస్తోంది.

తన అక్క హిరణ్య, మామ ఇలా మాట్లాడుకుంటూఉంటే ఇంతలో పల్లెటూరి బస్సురానేవచ్చింది. అక్కా! బస్సు వచ్చేసిందిరా పోదాం అన్నది కమల

సరే మామ నేను వెళ్ళొస్తాను. మనవాళ్ళనందరిని అడిగినట్లు చెప్పు అన్నది హిరణ్య. సరేరా, నువ్వు తప్పకుండా మన ఊరికి రావాలి. అని చెప్పి జానకిరామయ్య వెను తిరిగాడు.

హిరణ్య, కమల తమ స్వగ్రామం వెళ్ళేబస్సు ఎక్కికూర్చున్నారు బస్సు ఎక్కి కూర్చున్నదిమొదలు బస్సువాళ్ళ ఊరికి చేరేవరకు హిరణ్య మనసు తన శరీరంలో లేదు. లేక లేక తన మామ కనిపించాడు. చిన్ననాటి జ్ఞాపకాలు తనను చుట్టుముట్టాయి. అంతే మనస్సుకు రెక్కలొచ్చితన అవ్వగారి ఊరు చిత్తూరు జిల్లాలోని గంగాధర నెల్లూరులో విహరించ సాగింది.

హిరణ్య అవ్వగారి ఊరు శతాబ్దం క్రితమే ఎంతో నాగరికంగా అభివృద్ధిగాంచింది. ఆ ఊర్లో ప్రాథమిక పాఠశాల, ఉన్నత పాఠశాల, పిల్లల ఆటస్థలం, ఆటవస్తువులు, ఆసుపత్రి, రోడ్డురవాణా, అక్కడి పిల్లల, పెద్దల నాగరిక వస్త్రధారణ, అలంకరణ, మర్యాద, మాట తీరు, ఆట, పాట, మంచి మనసు, కలుపుగోలు తనం ఇవన్నీ చిన్నప్పుడే హిరణ్య బాగా గమనించింది ఆ ఊరన్నా, అక్కడి మనుషులన్నా హిరణ్యకు అపారమైన ప్రేమ. ఈ ఊర్లోనే ఉండిపోతే ఎంతబాగుంటుంది అనుకునేది. కానీ నాన్న ఒప్పుకోడు ఒకసారి వాళ్ళ స్వగ్రామంలో ఉన్నప్పుడు నేను మా వూరికి పోతాను" అంటే అఊర్లో పక్కింటామె "మీఊరు ఇదే" అన్నది. కాదు కాదు. మాఊరు గంగాధర నెల్లూరే" అని వాదించేది హిరణ్య. అంతగా ఆ ఊరిపై ప్రేమాభిమానాలు పెంచుకున్నది.

నాకు బాగా తెలిసి అవ్వగారి ఊరుకెళ్ళింది రెండుసార్లే అయినా ఎంతగాఢంగా ముద్రబడింది నా హృదయంలో! అని అనుకుంటూ ఉండగా తనకు ఆనాటి పనసపండు గుర్తుకొచ్చింది.

మామా! నాకు పనసపండు కావాలి. అలాగేరా బుజ్జోడా! తప్పకుండా తెస్తాన్‌రా అన్నాడు జానికిరామయ్య ఆరోజు ఆయన ఏదో ఊరికెళ్ళాతు ఏదోపనిమీద హిరణ్య తన మామ ఏవైపున వెళ్ళుతున్నాడో ముందే గమనించి పెట్టుకున్నది. గంటకోసారి వాకిట్లోకివచ్చి చూసివెళ్ళేది. మామ

పనసపండు తెస్తున్నాడా లేదా అని. చివరికి సాయంత్రం 5 గంటలప్పుడు వచ్చి చూసేసరికి చాలాదూరంగా తన మామ కనిపించసాగాడు. భుజాన పనసపండుకూడా కనిపించింది హిరణ్యకు. అంతే ఎనిమిదేండ్ల హిరణ్య ఎగురుకుంటూ ఇంట్లోకి వచ్చి తన అమ్మకు, అత్తకు అందరికీ వార్త చెప్పిన మామ వస్తున్న దారివెంట ఎదురుగా పరుగెత్తింది.

ఒరే! ఒరే బుజ్జోడా! పడిపోతావురా! మెల్లగారారా అని దూరంనుంచి అరుస్తున్నాడు జానకిరామయ్య. అయినా వినకుండా పరుగెత్తి వెళ్లిమామను పట్టుకున్నది హిరణ్య. మామా ఆ పనసపండు నాకివ్వు నేను తలపై పట్టుకుంటా. వద్దురా! ఇది గుచ్చుకుంటుంది. పైగా బరువు అనిచెప్పి సముదాయించి ఒక భుజంపై ఎడమచేత్తో పనసపండును పట్టుకుని, కుడి భుజం పై హిరణ్యను ఎక్కించుకుని ఇంటికి వచ్చాడు జానకిరామయ్య.

తీరా పనసపండుకోసి తొనలుతీసి గింజలు ఒలిచి హిరణ్యకు తినిపించ బోయాడు. హిరణ్య ఎందుకో వాటిని తినలేదు. నాకు సగించలేదు అన్నది. ఆదేంట్రా బుజ్జోడా నీకోసం ఎంతోకష్టపడి పనసపండు తెస్తే నువ్వు తినకపోతేచాలా బాధగా ఉందిరా.

జానకిరామయ్య కళ్ళనుంచి కన్నీళ్ళు ఒక్కొబట్టు జారికిందపడసాగింది.

ఎందుకుమామా ఏడుస్తున్నావు?

ఏంలేదురా? పనసపండు కోరింది, నా చేత తెప్పించింది నువ్వు. తినేదిమేము అని బాధ కలిగింది అంతేరా.

దీనికి బాధపడటం ఎందుకు మామా! నేను గింజలు తింటానుకదా. ఇట్లాంటి పిచ్చితల్లివి ఈ స్వార్థలోకంలో ఎట్లా బ్రతుకుతావురా అని హిరణ్య త్యాగహృదయాన్ని ముందే పసికట్టి భవిష్యవాణి పలికినట్లు పలికాడు జానకిరామయ్య.

అంతలో కన్నీళ్ళు అపుకుంటూ ఒరే బుజ్జోడా! మిమ్మల్ని ఎల్లుండి ఊరికి పంపించేయమని ఉత్తరం వ్రాశాడురా మీనాన్న కాబట్టి నిన్ను, అమ్మను చిత్తూరికి పిలుచుకోనిపోయి కావలసినవన్నీ తీసిస్తానురా. అన్నాడు జానకిరామయ్య.

అలాగే అని తల ఊచింది హిరణ్య.

మరునాడు చిత్తూరికి వెళ్ళి బట్టలషాప్‌లోకి ప్రవేశించారు. మామ ఖరీదైన బట్టలు తీసుకోమంటూ ఉంటే హిరణ్యతల్లి వద్దులే అన్నా! మామూలు బట్టలే చాలుఅన్నది. నువ్వు పెండ్లి అయినప్పటినుంచీ మాత్రం ఏమడుగుతున్నావని? పైగా అదివద్దు ఇదివద్దు అనే అంటావమ్మా. అందరూ నీలాగే ఉంటే అందరి తల్లి దండ్రులు, అన్నలు ఎంతో సుఖపడేవారు. నువ్వు చిన్నప్పుడుకూడా ఏమీ కోరేదానికావు అని అంటుండే హిరణ్య మామా! నాకు ఈరంగు పావడకావాలి అన్నది అలాగే తీసుకోరో అంటూ కావలసినవన్నీ తీసిచ్చాడు షాపునుంచి బయటకు వచ్చాక రిబ్బన్లు కనిపించాయి. హిరణ్యకు. మామా! ఈ పచ్చది, ఎర్రది, బ్లు రిబ్బన్లు కావాలి అన్నది. వాటిని కూడా ఎంతో ప్రేమతో తీసిచ్చాడు. షాపింగ్ పరిపూర్తి అయిన తర్వాత ఇంటికివచ్చారు. మరునాడు స్వగ్రామానికి ప్రయాణం కావాలి

హిరణ్య దిగులుగా కూర్చున్నది. వెళ్ళకపోతే నాన్న ఊరకోడు. అయినా చదువంటే ప్రాణమైన హిరణ్య వెళ్ళకపోతే చదువు పాడవుతుందికాబట్టి మళ్ళీ కోలుకున్నది. వెళ్ళడానికి సుముఖురాలయ్యింది.

జానకిరామయ్య తన చెల్లెల్ని. చిన్నారిమేనకోడల్ని ప్రయాణానికి సిద్ధంచేశాడు. మామా నాకు ఉడకబెట్టిన పనసగింజలు మూటగట్టివ్వు అని అడిగింది హిరణ్య. అలాగే మూటగట్టి అందించాడు. అందరి చేతుల్లో ఆయా వస్తువుల సంచులుంటే హిరణ్య చేతుల్లో పనస గింజల మూట ఉంది. తన అవ్వగారిల్లును, మేనమామను, ఆ ఊరును వదలలేక వదలలేకవచ్చిన సంఘటనను తలచుకుంటూ ఉండేసరికి హిరణ్య, కమల ఎక్కిన బస్సు తనఊరు దగ్గరకు వచ్చేసింది.

అక్కా! ఏంటి నిద్రపోతున్నావా? లెయ్యి. మనఊరు వచ్చేసింది.

మన ఊరా అంటే గంగాధరనెల్లూరా? అదేంటి అలా మాట్లాడుతున్నావు? మనం ఎక్కింది గంగాధర నెల్లూరు బస్సా? మన ఊరు బస్సా?

హిరణ్య మనసు ఇంతసేపూ విహరించింది గంగాధర నెల్లూరులో అనే సంగతి కమలకేమి తెలుసు? అక్క హాయిగా బస్సులో నిద్రపోయింది అనుకున్నది కమల.

బస్సు ఆగవలసినచోట ఆగింది. ఇద్దరూ ఇంటికి వెళ్ళారు. హాయిగా అమ్మా నాన్నలతో, ఇంకా ఉన్న చిన్న పిల్లలతో సరదాగా కాలం గడిపారు.

అక్కా! హిరణ్య అంటే హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు అనేపేర్లు గుర్తుకొస్తాయి. నీకు "హిరణ్య" అనేపేరు ఎవరు? ఎందుకు? పెట్టారు? ప్రశ్నించింది కమల.

'హిరణ్య' అంటే బంగారం అని అర్థం నేను పుట్టినప్పుడు బంగారం కాంతిలా మెరుస్తుండటం వల్ల బంగారం వంటి విలువైన జీవితం గడపాలని మంచి పనులుచేసి మంచిపేరు తేవాలని మనతాత నాకు ఆపేరు పెట్టాడని అమ్మచెప్పింది.

ఆహా అదనమాట సరేగాని పడుకో నిద్రొస్తోంది అంటూ కమల మంచంపై పడుకున్నది. హిరణ్యకూడా చెల్లెలు ప్రక్కనే పడుకున్నది.

ఆనాటి తెల్లవారుజామున కమల నిద్రలేచేసరిని తనమేనమామ జానకీరమయ్య చనిపోయినట్లు ఎవరోవచ్చి వార్త చెప్పివెళ్ళినట్టు కమల హిరణ్యతో చెప్పింది.

హిరణ్యకు పిడుగు పడ్డంత భయాందోళన కలిగింది. అయినా ఆమె తెలివిగా ఎంతో జాగ్రత్తవహించి తన అమ్మకు మాత్రం ఈ వార్త అందించకుండా "మామకు చాలా సీరియస్‌గా ఉందని ఎవరో వచ్చిచెప్పారు త్వరగా బయలుదేరుదాము" అంటూ అందరినీ ప్రయాణం చేయించింది హిరణ్య.

హిరణ్య తల్లి శకుంతల కన్నీరుమున్నీరుగా ఏడ్వసాగింది. ఆమెకు ఏదోదాచు తున్నట్లు మనసుకు తోచింది. ఎందుకమ్మా ఏడుస్తావు! మామకు

ఏమీకాలేదు. ఏదో ఆరోగ్యం కొంత బాగాలేదని తెలిసింది అంతే. మనం చూడటానికి వెళ్ళుతున్నాంకదా. అని ఎంతో ఓదార్చింది.

అందరూ బయలుదేరి వెళ్ళారు. ఆ ఊరు దగ్గరదిగి రోడ్డుమీద వెళ్తూతూ ఉంటే ఒకే ఏడుపులు వినిపిస్తున్నాయి. శకుంతలకు ఇంకాబాగా అనుమానం వేసింది. ఏడుపు ఆపుకోలేకపోయింది. ఇంటికి రానేవచ్చారు. బెంచిపై అన్న శాశ్వతంగా పడుకొనే ఉండటం, ఒంటిపై పూల దండలు కప్పిఉండటం, అందరూ చుట్టూ చేరి ఏడుస్తుండటం కంట బడింది.

శకుంతలకు మిన్ను విరిగిమీద పడినంత పని అయింది. తట్టుకోలేక స్పృహ తప్పి పడిపోయింది. అందరూ ఎవరి ఏడుపుల్లో వాళ్లున్నారు హిరణ్య నీళ్ళుతెచ్చి తల్లిముఖంపై చల్లింది. కొంత కొంత స్పృహలోకి వచ్చి కోలుకున్నాక గుండెబాదుకుని, తలపట్టుకొని ఎడ్వసాగింది.

ముందే నరాల బలహీనత జబ్బుతో బాధ పడుతున్న అమ్మను ఇలాగేవదిలేస్తే ప్రమాదమని భావించి తన ఒడిలో పండపెట్టుకొని ఎంతో ధైర్యం చెప్పి ఓదార్చింది హిరణ్య.

హిరణ్యా! మీ మేనమామ నాకు తండ్రిలేని లోటుతీర్చి ఎంతో అల్లారుముద్దుగా పెంచిన "అన్న" తల్లీ! నేను ఎట్లా మరచిపోయేది. మా అన్న నన్ను ఒదిలేసి ఒంటరిగా వైకుంఠానికెళ్ళిపోయినాడమ్మా! అని మళ్ళీ ఏడవసాగింది.

ప్రాణాంతకమైన అమ్మ అనారోగ్యం విషయంలో ఎవ్వరూ పట్టించుకోకపోతే హిరణ్యే అంతా చూసుకున్నది. వైద్యం చేయించి మళ్ళీమామూలు మనిషిని చేసింది. మళ్ళీ అమ్మఇలాంటి దిగులు పెట్టుకొంటే ముందులాగా పాడైపోతుందని భావించింది హిరణ్య. అమ్మా! నువ్వు ఇంకెప్పుడూ ఏడవద్దు. అందరం ముందు వెనకలుగా వెళ్లేవాళ్ళమే కదా మామ ఎక్కడికీ పోలేదు. మన మనస్సుల్లో ఎప్పుడూ ఉంటాడు. మనసులో 'హరేరామ హరే కృష్ణ చెప్పుకుంటూ ఉంటేపైలోకానికెళ్లిన మామను భగవంతుడు బాగా చూసుకుంటాడు అని ఎన్నెన్నో దైవసంబంధమైన విషయాల్ని, జీవిత సత్యాల్ని చెప్పి తల్లిని ఓదార్చి నిద్రపుచ్చింది హిరణ్య.

తన మామ చనిపోయిన వార్త విన్నప్పటినుంచి అప్పటివాకా తల్లిని ఓదార్చడం కోసం తాను ఏడవకుండా నిగ్రహించుకున్నది హిరణ్య. ఇప్పుడు హృదయబాధ కట్టలు తెంచుకొని ప్రవహించింది. ఒంటరిగా కూర్చొని ఏడ్చి ఏడ్చి గుండె బరువును దించుకున్నది హిరణ్య.

బస్‌స్టాండ్‌లో మామ కనబడి "ఊరికి తప్పకుండా రారా బుజ్జోడా" అన్నది ఇందుకా? ఆయనే బ్రతికి ఉండుంటే తనను చూసి, తనవిద్యాభి వృద్ధిని, తన హోదాను చూసి, ఎంత మురిసిపోయేవాడో. ఆ ఊర్లో వాళ్ళకంతా ఎంత గొప్పగా చెప్పుకునేవాడో నన్నుగూర్చి. చిన్నప్పుడు ఒక సారి వెళ్లిన తర్వాత ఇరవై ఐదేండ్లకు ఈ విధంగా మామను చూడటానికి వెళ్ళవలసి వచ్చింది అని మనసులో పరిపరి విధాలుగా భావించుకొని దుఃఖించింది హిరణ్య.

తనకోసం భుజాన పనసపండు పెట్టుకొని వస్తున్నప్పటి తన మేన మామను చూసినప్పటి దృశ్యం, తనకు నచ్చిన బ్లు, పచ్చ రిబ్బన్లు కొని చ్చిన దృశ్యం ఇంకా ఎన్నో బాల్యంలోని అనుభూతులు హిరణ్య హృద సాగరంలో కెరటాల్లా కలచివేశాయి. ఈసారి ఊరు ప్రయాణం మేనమామను చివరిసారిగా చివరి చూపు చూడటానికి విధి ఉద్దేశించినట్లుంది దైవ లీలలు చిత్రవిచిత్రమైనవి కదా అనుకొని మన శ్శాంతికోసం భగవద్గీత చద వడానికి సిద్ధమయింది హిరణ్య.



నేటిభారతం (మాసపత్రిక)
ఫిబ్రవరి, 1998

# హేమంత్



కొంతమంది త్యాగాలు చేయడానికే పుడతారు. కొంత మంది ఇతరుల త్యాగఫలాల్ని మాత్రం కడుపార భోం చేసి స్వార్థంగా బ్రతకడానికే పుడతారు. త్యాగమూర్తుల జీవితాలు ఆరని దీపాలు. స్వార్థపరుల బ్రతుకులు పుట్టలోని చెదలు.

హేమంత్ పుట్టుకతోనే జ్ఞాని. తెలివితేటల్లో చురుకైనవాడు. తనకు స్వార్థంగా బ్రతకడం అంటే అసహ్యం. అందుకే తన కళ్ళముందుపుట్టి తన చేతుల్లో అల్లారు ముద్దుగా పెరిగిన ఆరుగురు తోపుట్టువుల్ని వదులు కోలేక మానవత్వంలేని మధ్యలో వచ్చిన మనిషినే శాశ్వతంగా వదులుకున్నాడు. బుద్ధి జ్ఞానం మనసు ఉండాలేగానీ ఎవరైనా బిడ్డలే ఆ భావన అందరికీ ఉంటే మరీ మంచిదే. అలాకాక ఏరుదాటాక తెప్పను తగలేసినట్లు, మేడఎక్కిన తర్వాత నిచ్చెనను కూలదోసినట్లు. అవసరాలకు కాళ్ళు అవసరాలు తీరినతర్వాత జుట్టుపట్టుకునే వైఖరి ఉంటేనే చింతనీయం ఏమైనా దయా హృదయులు తమధర్మం తాము చేస్తూముందుకు సాగుతారు.

హేమంత్ ఆఫీసునుంచి సాయంత్రం ఆరుగంటలకు ఇంటికివచ్చాడు. వచ్చాడోలేదో అప్పుడే ముగ్గురు తమ్ముళ్ళు, ముగ్గురు చెల్లెళ్ళు వాళ్లవాళ్ల కోరికల్ని చేతపట్టుకొని అన్నచుట్టూ గుమికూడారు. అన్నా! రేపు నా పుట్టిన రోజు పార్టీ జరుపుకోవాలి అని ఒకడంటే, టూర్‌కి వెళ్లాలి ఐదువందలు కావాలి అని ఒకడంటే, టేప్‌రికార్డర్ కొనాలి రెండు వేలు ఇవ్వు అని ఒకడంటే, అన్నా! డ్రస్సులు కొనాలి మూడువేలు ఇవ్వవూ అని ఒకచెల్లెలు రాగం తీస్తే, బంగారు చైన్‌కావాలి అని ఒక చెల్లెలంటే, స్కూటర్ కావాలి అని ఒక చెల్లెలంటే హేమంత్ నోరార నవ్వుతున్నాడు. పాపం ఇప్పుడిప్పుడే బాల్యపు ముసుగులు తొలిగించుకుంటూ యౌవన ప్రాంగణంలోకి అడుగులిడుతున్నారుకదా. చిన్నప్పటినుంచీ కష్టాల కోరలు తగలకుండా వాళ్ళను కాపాడుకుంటూ వచ్చాడు హేమంత్.

ఎండలబాధలు తెలిస్తేకదా నీడల సుఖాల విలువతెలిసేది అలా అని తాను ముందుండి వాళ్ళను కష్టాలపాలు చెయ్యలేదు. ఆ ఆలోచన, సహృదయం పెరిగే పిల్లలకుండాలి.

యువతను తప్పుదారి పట్టించే సినిమాలు, వేగవంతమైన ఆధునిక కాల పరిస్థితులు, స్వార్థం, మోహం నూరిపోసి కుటుంబ సమైక్యతను చెడగొట్టే దుష్టసాంగత్యాల ప్రభావం వీళ్లమీద బాగా పడిపోయింది. చిన్నప్పుడున్న బుద్ధి, జ్ఞానం, ప్రేమ, చదువులు పెరిగేసరికి నశించిపోతున్నాయి. వీళ్ళలో మానసిక నిశ్చలత్వం లేకుండా పోతోంది, కోరికల్ని కుప్పలుగా పెంచుకుం టున్నారు. అవి తీరకపోతే ద్వేషాగ్ని కణాల్ని చెరుగుతున్నారు. వీళ్ళను ఎలా దారిలో పెట్టడం! అని మనసులో పరిపరి విధాలుగా విచారిస్తానే "అలాగే అమ్మలూ, అలాగే అయ్యలూ మీరు అడిగినవి తప్పకుండా తీసి స్తాను. నా ఇరవై ఏండ్ల సర్వీసులో, ఎప్పుడన్నా ఏదన్నా కాదన్నానా? చదు వులకు, సినిమాలకు, పార్టీలకు, పిక్‌నిక్‌లకు, ఫోటోలకు ఇంకా ఎన్నో మీ అవసరాలకు, సరదాలకు వేలాదిగా డబ్బులు ఇస్తూనే ఉన్నాను కదా ఇప్పుడు కోరిన వాటిని కూడా తీసిస్తాను గానీ వెళ్లి అందరూ బుద్ధిగా చదు. వుకోండి. నా పరువును కుటుంబ గౌరవాన్ని నిలపెట్టండి మీ వంతుగా దేశా నకి సేవా చేయడం నేర్చుకోండి" అని మంచివాక్యాలు చెప్పి అందరినీ పం పించేశాడు హేమంత్.

"ఈ పిల్లల్లో ఎంత మార్పు వచ్చింది! గతంలో నేను ఆఫీసునుంచి ఇంటికి వచ్చానో లేదో నాకు ఏమేమి కావాలో అన్నింటినీ సమకూర్చడంలో అందరూ హడావుడి పడేవారు. అప్పుడు వీళ్లను చూస్తుంటే ఏంతో ముచ్చ టేసేది. ఇప్పుడు తనను గూర్చి కనీసంగా కూడా ఆలోచించడం మానే శారు. పైగా స్వార్థకాంక్షలు విపరీతంగా పెంచుకున్నారు. ఇదంతా లోక ప్రభావం కావచ్చు లేక స్వభావమేకావచ్చు మరి లోక ప్రభావానికి స్వార్థా నికి నేనూ లోబడిఉంటే, దయా హృదయంనాలో లేకుంటే వీళ్లంతా ఏ స్థితి లో ఉండేవారు" అనే ఆలోచనల దొంతరలు మనసును కలచివేశాయి హేమంత్‌కు.

ఇంతలో హేమంత్ తల్లి కస్తూరి వచ్చి ఒరే! హేమంత్! నీ పుట్టిన రోజు ఎప్పుడో కూడా మేం గుర్తుపెట్టుకోలేదు కనీసం నువ్వైనా గుర్తుపెట్టు కొని పుట్టినరోజు పండుగ చేసుకోవచ్చుకదా.

అదేంటమ్మా! నా పుట్టినరోజు పండుగను నేనే చేసుకోవాలా? ఎందుకు చేసుకోవాలమ్మా? నేనేమైనా కుటుంబాన్ని ఉద్ధరించేశానా? సమాజానికి ఏవైనా ఘనకార్యాలు చేశానా? దేశసేవలేమైనా చేశానా? అనాథశరణాలయా లేమైనా కట్టించానా? ఏ లోకోత్తరకార్యాలు చేశానని? మనం జరుపు కోవా ల్సింది శ్రీరామ కృష్ణాది దైవాల పుట్టినరోజుల్ని, అన్నమయ్య, త్యాగయ్య వంటి పరమ భక్తుల పుట్టినరోజుల్ని, మానవసేవా పరాయణులైన మహాత్మా గాంధీ, మదర్ థెరిసా, దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ వంటి మహనీయుల పుట్టిన రోజుల్ని. సరేనా.

అది సరేనాన్నా! ఊహతెలిసినప్పటి నుంచి మావల్ల వచ్చిన సంసార భారాన్ని నెత్తిని వేసుకొని భరిస్తున్నావు. ఇరవై ఏండ్లనుంచి లక్షలాదిగా సంపాదిస్తూ కూడా ఏనాడూ నీ సుఖం, సౌకర్యం నువ్వు చూసుకోలేదు, మేం భరించాల్సిన బాధ్యతలు బాధలు నువ్వు మోస్తున్నావు అసలు నాకే జ్ఞానంలేదురా. ఇవన్నీ నీతో మాట్లాడకుండా ప్రతి సంవత్సరం నీపుటినరోజు మేమే పండుగ జరపాలి. నీ ఆశయాలకు తగినట్లుగా పేదసాదలకు అన్న దానం చేసి సంతృప్తి పరచాలి. నీ తమ్ముడు సూర్య చూడు "సో ఒకరిది సొమ్ము ఒకరిది" అన్నట్లు ఎంత దర్జాగా ప్రతిసంవత్సరం పుట్టినరోజు పం డుగ చేసుకొని సరదాగా ఉంటున్నాడో! ఒక్కొ తరగతిని రెండేసి సంవ త్సరాలు చదివినందుకు కాబోలు!

పోనీలేమ్మా! యుక్తవయసులో ఉన్నవాడు వాడంతటవాడు ఆత్మ విమర్శ చేసుకునే స్థితికి వస్తేవాడే మారతాడు. ఏదిముఖ్యం? ఏది జీవిత పరమార్థం? అని తెలుసుకొనే రోజు దానంతట అదే వస్తుంది. ఈలోగా నువ్వు చెప్పినా, నేను చెప్పినా ప్రయోజనం లేదు ఇప్పటికే ఉపదేశాలు చేసీచేసి విదురుడిలా అలసిపోయాను.

కాల ప్రభావమో, కర్మ ప్రభావమో కానీ నాన్నా. అబ్బాయిలంటే వ్యామోహాలకు లోబడిపోయి వెనకటి కష్టాలన్నీ మరచిపోయారు. విలాసాలు, సరదాలు కోరుకుంటున్నారు. కానీ. ఆడపిల్లలుకూడా అలాగే తయారవుతున్నారు. బాబూ! ఒకరికొకరు బాధ్యతగా ప్రవర్తించాల్సిందిపోయి అసూయాద్వేషాలు, స్వార్థబుద్ధులు పెంచుకుంటున్నారు. వీళ్ళను ఎలా మార్చాలో, ఎలా మంచి మార్గంలో పెట్టాలో తెలియడంలేదు రోజురోజుకి చెడ్డ సావాసాలవల్ల వీళ్ళలో ఆశలు ఆకాశాన్నంటుతున్నాయి. అసలు నిన్నుగూర్చి, నీ బాగోగుల్ని గూర్చి, నీ సంపాదన వెనక ఉన్న కష్టాల్ని గూర్చి ఎవ్వరూ ఆలోచించడం లేదు. నా కడుపున పుట్టిన వాళ్ళు ఇంతటి స్వార్థ పరులవుతారని ఇంత అసూయాపరులు అవుతారని నేను ఊహించలేదు బాబూ!

వీళ్ళనే ఎందుకంటావమ్మా! మా అందరికన్నా ముందు నీ చేతుల్లో పెరిగి ప్రయోజకులైన వాళ్లు మాత్రం కనీసం నిన్నుగూర్చి ఆలోచించారా? కష్టాల్లో, జబ్బుల్లో ఎప్పుడైనావచ్చి నిన్ను పలకరించారా?

పోనీలే నాన్న నా మనసు ఇలాంటిది వాళ్ళ మనసు అలాంటివి.

ఇంక వాళ్ళ ప్రసక్తి చెయ్యను లేమ్మా! మనపిల్లలు నన్ను గూర్చి ఆలోచించడం లేదని నువ్వైనా చింతిస్తున్నావ్ అది చాల్లేమ్మా! భగవంతుడు లేడా? తనవల్ల బ్రతికిబట్టకట్టి, జీవనోపాధిని సంపాదించుకొని, పదిమందికీ ఆశ్రయమిచ్చే మనుషుల్ని దైవమే కాపాడుకుంటాడు. నువ్వు దిగులు పడకమ్మా!

అలాగే బాబూ, నాకూ ఆనమ్మకం ఉంది. నువ్వుకూడా ఈ పిల్లల విషయంలో బాధపడవద్దు. నువ్వు అనుభవిస్తున్న సౌకర్యాల్ని వీళ్లూ అనుభవించాలనుకున్నావు. నువ్వు చదివిన చదువుల్ని వీళ్ళూ చదవాలనుకున్నావు. నువ్వు పడిన కష్టాలు, హింసలు, అవమానాలు మాత్రం వీళ్ళు పడకూడదని ఎన్నో జాగ్రత్తలు చెబుతూ ఎంతో తపనపడుతున్నావుబాబూ! నీ అనుభవాల్ని, లోకానుభవాల్ని, నువ్వు నేర్చుకున్న ఎన్నో విషయాల్ని వీళ్ళకు చెబుతుంటావు వీళ్ళుమాత్రం వాటిని విననట్టేవిని అంతలో వదిలేసి విలాసాల్ని కోరుకుంటున్నారు. అంతేగానీ నీలాగా చదవాలని, నీలాంటి

బుద్ధిజ్ఞానాల్ని పెంపొందించుకోవాలని, నీలోని మానవత్వాన్ని, దయాదాక్షిణ్యాల్ని అలవరచుకోవాలని, నీలాగే పేరు పెంపుల్ని సంపాదించుకోవాలని ఏమాత్రం ఆలోచించడం లేదు. నేను మాత్రం వీళ్ళు నా చేతికి దొరికినప్పుడంతా నీ పెద్ద మనసును, నువ్వు మా కోసం పడిన కష్టాల్ని ఎదుర్కొన్న సమస్యల్ని గూర్చి చెబుతూనే ఉంటాను బాబూ'

ఎవ్వరికీ ఏమీ చెప్పాల్సిన పనిలేదమ్మా! వయసు ప్రభావం వల్లనో, అజ్ఞానం వల్లనో, స్వార్థపరుల దుర్బోధల వల్లనో ఒక్కోసారి మాయాజాలంలో చిక్కుకుంటూ ఉంటారు. ఆయాకాలాలు దాటిపోగానే ఎవరిదారి వారిది ఎవరిస్వార్థం వారిది. ఆ నాటికి వీళ్ళే తెలుసుకుంటారు ఎవరు మనకు శాశ్వతం? ఎవరుమనల్ని ప్రయోజకుల్ని చేసింది అని కాబట్టి సర్వం ఆ భగవంతుడికే సమర్పించి నిశ్చింతగా ఉండటమే మంచింది అన్నాడు హేమంత్.

అప్పుడే చదువు మీద విసుగువచ్చి సుమిత్ర అనే చెల్లాయి హేమంత్ దగ్గరకు వచ్చింగి అన్నా! నేను డ్రస్సులు కొనుక్కోవాలి. కనిసం వెయ్యి రూపాయలైన ఇవ్వు.

ఇప్పుడున్న డ్రస్సులతో సర్దుకోమ్మా తర్వాతకొనుక్కోవచ్చులే నేను చూడు ఎలాంటి షర్టువేసుకున్నానో. పెద్దవాళ్ళకు లేకపోతే పరవాలేదులే.

నేనేమైనా ఇంట్లోకూర్చునే అన్న అనుకున్నావా తల్లీ! ఒక సంస్థకు మేనేజర్‌నమ్మా! నాహెూదాకు తగినట్లుండాలి కదా. అన్నాడు హేమంత్ అమ్మాయికి కొంత తెలిసిరావాలని.

ఆ అమ్మాయి తన అన్న ఎప్పటిలాగే నీళ్ల ప్రాయంగా డబ్బు ఇస్తే స్తాడనుకుంది. డిగ్రీపూర్తి అయిన సుమిత్ర కొంచెం అర్థం చేసుకొని ని ఇష్టం వచ్చినప్పుడే డ్రస్సులు తిసవ్వన్నా. ప్రస్తుతానికి నువ్వు చెప్పినట్లే ఇప్పుడున్న వాటితోనె సర్దుకుంటాలే అన్నది.

అలా ఉండాలమ్మా! మంచిదానివి. అన్న మనసును అర్థం చేసుకొని ప్రవర్తిస్తే అన్నగోదావరిలా అనందంతో ఉప్పొంగి పోతాడమ్మా అన్న

మాటను వ్యతిరేకంగా అర్థం చేసుకొని బాధపెడితే తుఫానును చెట్టుకూలి నట్లు కూలిపోతాడమ్మా అది గమనించుకొని మెలగాలి అంటూ చెల్లాయిని లాలనగా తల నిమిరాడు.

ఇంతలో పక్కింటి పెద్దాయన మారుతివచ్చాడు. హేమంత్ బాధ్యతా యుతంగా ప్రవర్తించే మనిషి కాబట్టి ఏదో తన బాధలు చెప్పుకోవాలని చూస్తున్నాడు హేమంత్ ఆఫీసు నుంచి ఇప్పుడే వచ్చినట్లుంది. ఇంటికి వెళ్లి మళ్ళీ రావచ్చులే అనుకొని రేపువస్తాలే బాబూ అంటూ వెళ్ళ బోయాడు.

పరవాలేదండీ, కూర్చోండి మాట్లాడుకుందాం అన్నాడు హేమంత్. ఏముంది నాయనా మాఅమ్మాయిలు, అబ్బాయిలు యౌవన ప్రభావమో ఏమో కానీ మంచిమాట చెప్పినా, మంచిపని చెప్పినా విసుక్కుంటూ ఉం టారు. ప్రతిమాటను వ్యతిరేకంగా అర్థం చేసుకొని వద్దన్న చెడ్డపనుల్నే పనిగట్టుకొని చేస్తుంటారు. ఇంట్లోచెప్పకుండా వాళ్ళంత వాళ్లుగా రహ స్యంగా ఏవేవో చేస్తుంటారు ఎవరితోనో సాంగత్యాలు చేస్తుంటారు తీరా సమ స్యలు చుట్టుముట్టినప్పుడు మాత్రం నాకు చెబుతుంటారు. అప్పుడు నేనే ముందుండి వీళ్లను కాపాడాలి. ఎంతో గుట్టుగా, ప్రశాంతంగా బ్రతకాల్సింది పోయి వీధిరచ్చల్ని ఇంటికి తేవడం, బయటి వాళ్లతో పోరాటానికి వెళ్లడం ఇలాంటివి నాకు చాలా బాధకలిగిస్తాయి హేమంత్.

ఇంకైనా బుద్ధి తెలుసుకొని ఎవరి పరిధుల్లో వాళ్లు జాగ్రత్తగా ఉంటా రనుకొంటే అలా ఉండటం లేదు. "కుక్కతోక వంకర" అన్నట్లు మళ్లీ స్నేహం పేరుతో చెడు సాంగత్యాలు, చెడు తిరుగుళ్ళు ప్రారంభిస్తారు. వీళ్ళను ఎలా నియంత్రించాలో తెలియడం లేదు బాబూ! అంటూ తన కడుపులోని వేదనను కొంత వ్యక్తం చేసుకున్నాడు మారుతి.

పెద్దలపట్ల, పెద్దల మాటలపట్ల ఎంతో వినయం, గౌరవం చూపే హేమంత్ అంతా ప్రశాంతంగా విన్నాడు. విన్నంతసేపు తన ఇంట్లో వాళ్లు తెలివి తక్కువతో దూరదృష్టి లేకుండా చేసిన పనులు, వాటివల్ల తాను ఎదుర్కొన్న అవమానాలు, కష్టాలు అన్నీ స్మరణకు వచ్చాయి. వీటన్నిటిని

మారుతికి చెప్పడం ఎందుకులే అనుకున్నాడు. బాధలు చెప్పుకున్న వాళ్ళను ఓదార్చడం తన ధర్మంగా భావించి మీరేమీ దిగులు పడకండి. మారుతిగారూ! నేను మీ వాళ్ళకు చెప్పిచూస్తాను. చెప్పడం వల్ల ప్రయోజనం ఉన్నా లేకున్నా వాళ్ళలో మంచి మార్పులు వచ్చేవరకు చెబుతూనే ఉండాలి. లేకుంటే వీళ్లే ఒకప్పటికి మనల్నే ప్రశ్నిస్తారు. "మేం విననంత మాత్రాన మమ్మల్ని ఇలా వదిలేయడమేనా? కొట్టి తిట్టి మంచిదారిలో పెట్టాలికదా" అంటారు.

నిజమే బాబూ! ఇప్పుడేమో పెద్దవాళ్ళకు విరుద్ధంగా, గుప్తంగాపనులు చేస్తారు సమస్యల మంటలు చెలరేగినప్పుడు అలా అంటారు సరే హేమంత్ నీకుచాలా శ్రమకలిగించాను రేపు కలుసుకుందాం అంటూ వెళ్లాడు మారుతి.

ఏంటో! ఈ పిల్లలు చిన్నప్పుడు పువ్వుల్లా స్వచ్ఛంగా ఉండేవారు పెద్దవాళ్ళయ్యేసరికి మాయామర్మాలకు, లోక స్వభావాలకు వ్యామోహితులైపోతున్నారు. కర్తవ్యంపై, కుటుంబ బాధ్యతలపై మనసులగ్నం చేయలేకపోతున్నారు. అసలు ఏది మంచి? ఏదిచెడు? ఏదితాత్కాలికం? ఏది శాశ్వతం అనే కనీసం జ్ఞానం కూడా లేకపోతోంది. వీళ్ళను చివరివాకా సన్మార్గంలో నడిపించి ఉత్తమ పౌరులుగా, బుద్ధిమంతులుగా తీర్చి దిదలేకపోతే నా ప్రయత్నమంతా, నా పోరాటమంతా వ్యర్థమైపోతుందికదా అనే ఆలోచనా తరంగాలు హేమంత్ హృదయ సాగరంలో అలజడిరేపాయి. ఆ భావప్రవాహానికి అతి కష్టంగా ఆనకట్టవేశాడు. "తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు" కాబట్టి తాను ఏదీ తలవకపోవడమే మంచిదనుకున్నాడు హేమంత్. 'నీటన్ ముంచుము పాలన్ ముంచుము నీ చిత్తము నా భాగ్యము" అనే అన్నమయ్య సుభాషితం గుర్తుకొచ్చింది. మనుషుల్ని నమ్మి చెడిపోయిన వాళ్ళున్నారు కానీ భగవంతుని నమ్మి చెడిపోయిన వాళ్లులేరుకదా అని ధైర్యం తెచ్చుకున్నాడు. తన భారాన్ని, అందరి భారాన్ని పైవాడికే వదలిపెట్టాడు. ఇంక బాధపడటానికి కూడా తనలో శక్తి లేదని తెలుసుకున్నాడు.

"ఏంటి నాన్నా' అలా దిగులుగా కూర్చొని ఏదో ఆలోచిస్తున్నావ్? రా నాన్నా! స్నానం చేసి భోజనంచెద్దువ్" అన్నది హేమంత్ తల్లి

"నా మనసేమీ బాగాలేదమ్మా! కృష్ణాలయానికి వెళ్ళొస్తాను" అంటూ ఆలయం వైపునడిచాడు హేమంత్. సాయంత్రం ఇంటికి వచ్చి నీళ్ళైనా త్రాగని హేమంత్‌ని దారివెంట సాయంత్రపు చల్లగాలులు ఆనంద గీతకలై అలరించాయి.



కోస్తావాణి

11-8-1988.

## రచయిత్రి ముద్రిత గ్రంథాలు

1. అన్నమయ్య సంకీర్తనల్లోని జానపద గేయ ఫణితులు — 1986
2. పదకవితా వైజయంతి — 1993
3 అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో స్త్రీ ధర్మాలు — 1994
4. సంకీర్తనా జ్యోతి — 1996
5. కరుణ కమలం (వచన కవితా సంపుటి) — 1996
6 లీలా గీతమాల (గేయ కవితా సంపుటి) — 1998
7 ప్రేమదీపం (వచన కవితా సంపుటి) — 1998
8. కీర్తనా కౌముది — 1999
9. ప్రకీర్ణభారతి — 1999
10. లీలా కథామాలిక — 1999

## :- రచయిత్రి విశేషాలు :-

జననం - తిరువేంకటపతి అవతరించిన తిరుపతి సమీపంలోని 'పానకం' అనే గ్రామం.

విద్యాభ్యాసం :- తిరుచానూరు, తిరుపతి.

ఉద్యోగం : సీనియర్ అసిస్టెంట్ ప్రొఫెసర్, దేశిసాహిత్య శాఖ — హెడ్, పొ. శ్రీ. తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రి ప్రాంగణం, బొమ్మూరు - 533 124.

ప్రవృత్తి : దైవ చింతనతో లౌకిక వేదనల్ని ప్రక్షాళనం చేసుకోవడం. అన్నమయ్య సంకీర్తనలగానంతో, పరిశోధనా వ్యాపకంతో మనసును ఉల్లాస పరచుకోవడం.

వ్రాయాలనిపించినప్పుడు వివిధ సాహితీ ప్రక్రియల్లో రచనలు చేయడం. వెలగని దీపాల్ని ప్రోత్సాహమనే తైలం పోసి వెలిగించాలి కానీ ద్వేషమనే సుడిగాలిని సృష్టించి వెలిగే దీపాల్ని

అర్పివేయకూడదని, ఆశ్రయమిచ్చి, ఆశించిన వరాలిచ్చే కల్ప వృక్షాన్ని పూజించాలి కానీ కాలదన్నడం, కూలదోయడం పాప మని హెచ్చరిక చేయడం. ప్రతి విద్యావంతులైన యువతీ యువకులు కుటుంబంపట్ల, సమాజంపట్ల. దేశంపట్ల బాధ్యతా యుతంగా ప్రవర్తించాలని, స్వార్థ దృష్టిని వీడాలని సందేశ మివ్వడం

అవార్డులు : రచయిత్రి సాహితీ కృషికి రోటరీక్లబ్, రాజమండ్రి వారి రజత పతక బహుకరణ — 1996

రాష్ట్ర మనోరంజని, హైదరాబాదు వారిచే ఉత్తమ ఉపాధ్యాయిని అవార్డు మరియు సంగీత సాహిత్యాత్మకమైన అన్నమయ్య సంకీర్తనల్లో విశేష కృషి గావించినందుకు సాహితీ సవ్యసాచి బిరుదు — 1996.

కరుణకమలం వచన కవితా సంపుటికి సృజన ఆర్ట్ క్రియేషన్, హైదరాబాదు వారి విశిష్ట అవార్డు — 1997.



Acc. No. 31040
894.8133 LEE
Rs. 70/-

# అనుబంధం

ఒక్క పరిశోధనా రంగంలోనే కాక వివిధ ప్రక్రియల్లో సృజనాత్మక రచనలుకూడా చేయవలసిందంటూ ఎంతోమంది సాహిత్యాభిలాషులు, శ్రేయోభిలాషులు తామరతంపరలుగా ఉత్తరాలు వ్రాసేవారు. కొంతమంది ప్రత్యక్షంగా, మౌఖికంగా చెప్పి ప్రోత్సహించేవారు. వారిలో తిరుపతిలో ప్రఖ్యాత కథరచయిత శ్రీపులికంటి కృష్ణారెడ్డిగారు, రాజమండ్రిలో ప్రసిద్ధ కథారచయిత శ్రీ ముప్పిడి ప్రభాకర్‌గారు ముఖ్యులు. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. కానీ ఆరోజుల్లో కథలు వ్రాయాలనే ఆలోచననేగానీ ఆసక్తిగానీ, ఆకాంక్షగానీ నాకులేదు. ఉద్యోగపరమైన బోధనాంశాల వరకు, పరిశోధనాపరమైన వ్యాసరచనవరకే పరిమితంగా ఉంటూవచ్చాను. కాల క్రమంలో జీవితానుభవాల్ని, లోకానుభవాల్ని వివరంగా చెప్పడానికి కథా ప్రక్రియ అనుకూలమయిందిగా తోచింది. అందువల్ల కథా రచనకు కూడా ఉద్యమించడం జరిగింది.

ఈ కథాసంపుటి ముద్రణ ముగింపు సమయంలో పదేండ్ల క్రితం శ్రీ తిరుమూరు సుధాకర రెడ్డిగారు 30-4-1988 తేదీన వ్రాసినలేఖ కంట పడింది. కాలక్షేపం కోసం వ్రాసే ఉత్తరాలైతే ఏనోడో గాలిలో కలసిపోయేవి. కానీ సాహిత్యాంశాలతో కూడిన సారవంతమైన లేఖలు కాబట్టి నిక్షేపాల్లా దాగి ఉంటాయి. వాటిలో ఒకలేఖ కనిపించేసరికి ఎంతో సంతోషం కలిగింది, ఆ లేఖను ఈకథా సంపుటి అనుబంధంలో చేర్చితే ఎప్పటికీ ప్రోత్సాకరంగా ఉంటుందని భావించాను.

తాళ్ళపాక చిన్నన్న రచించిన పరమయోగివిలాసం ద్విపద కావ్యాన్ని వచనంలో రెండు సంపుటాలుగా వ్రాసి సాహిత్య లోకానికి అందించిన రచయిత, 'తలపుల తొలకరి' కథా సంపుటి రచయిత, కవి అయిన శ్రీ సుధాకర్‌గారు నాకు వ్రాసిన ఉత్తరంలోని 'మీరు కాల్పనిక సాహిత్యంలో కూడా అంటే నవల, కథానికల రంగాల్లోకూడా ప్రవేశిస్తే బాగా రాణించంగలరని నా నమ్మకం' అన్నవాక్యం చంద్ర కిరణంలా ఆహ్లాదం కలిగించింది. వారికి నా మనఃపూర్వక ప్రత్యేక కృతజ్ఞతాంజలి.

పొన్నా లీలావతి



పి.హెచ్.డి. నాటి రచయిత్రి



పి.హెచ్.డి. తర్వాతరచయిత్రి



ప్రస్తుతం రచయిత్రి